హాసం

హాస్య-సంగీత పత్రిక

# ఇవీ సంగతులు

66

Also available on net:
www.haasam.com

ముఖచిత్రం

'సాంబ' చిత్రంలో
జెనీలియా డిసౌజా



## హాస్యం





సినిమా పాటల ప్రత్యేకం



స్థలాభావం వల్ల ఆపాతమధురం, సకాలంలో చేరకపోవటం వల్ల భువనచంద్ర గారి కథ ఈ సంచికలో అందించలేకపోయాం. - ఎడిటర్

## సంగీతం






పాత పాటల ప్రత్యేకం 71, 72, 73, 74 పేజీల్లో



మీరు ప్రచురించే శీర్షికలు అన్నీ ఆణిముత్యాల్లా ఆకట్టుకుంటున్నాయి. అందుకే నేను మీ పత్రిక అభిమానిని అయ్యాను. ఇటు హాస్యాన్ని, అటు సంగీతాన్ని సమానంగా అందిస్తున్న 'హాసం' పత్రిక ఎప్పుడు వస్తుందో అని వెయ్యి కళ్లతో ప్రతీనెలా ఎదురు చూస్తుంటాను. ఈ కాలం, ఆ కాలం సినిమాల్లోని వుదాత్తతని, వున్నత భావాన్ని, కళారూపాన్ని అందంగా మాకందిస్తున్న మీ పత్రిక దినదినాభివృద్ధి చెందాలని, హృదయ పూర్వకంగా కోరుకుంటూ ...

**-అనంత ప్రభాకర్ దత్తు, విశాఖపట్నం.**

శ్రీ సింగీతంశ్రీనివాసరావు"రంగుల చెఱువు" ఈ పత్రికకు హైలెట్. ప్రస్తుత స్థితిలో రాజకీయనాయకుల కప్పదాట్లు చాలా సున్నితంగా ఎండగట్టారు. వీరి చర్యవల్ల 'సమాజం' అనే కొలను ఎలా కలుషితమవుతుందో చాలా చక్కగా వివరించారు. అంతేకాదు సమాజమనే ఈ కొలను కలుషితం కాకుండా వుండాలంటే ప్రజలు చైతన్యవంతులై రాజకీయ నాయకుల్ని నిలదీయాలని చాలా సున్నితంగా హెచ్చరించారు. 'హాట్సాఫ్ టు సింగీతం'& 'హాసం'.

**- జయప్రకాష్, హైదరాబాద్.**

16-31, మే సంచికలో సిరివెన్నెల సీతారామశాస్త్రిగారి గురించి చంద్రబోస్, కులశేఖర్ గార్లు వ్రాసిన వ్యాసాలు చాలా బాగున్నాయి. అలాగే సుద్దాల అశోక్ తేజ గారు తన గురించి తెలియజేసిన విషయాలు, కోటిగారి ఇంటర్వ్యూ చాలా బాగున్నాయి. ప్రముఖుల పుట్టినరోజునాడు పురస్కరించుకొని వారి గురించి వ్యాసాలు అందిస్తున్న 'హాసం'కు మా ప్రత్యేక కృతజ్ఞతలు.

**-వరదా సాయికుమార్, పర్లాకిమిడి.**

శ్రీ సింగీతం శ్రీనివాసరావుగారు వ్రాసిన 'వందనాలు' అందరినీ ఎంతో అలరిస్తున్నది. కథ చివరన 'సెటైర్', 'ఐరనీ' లాంటివి -ఆంగ్ల హాస్యరచయితలను మరిపిస్తున్నవి. శ్రీసింగీతం శ్రీనివాసరావు 'అంత్యఘట్టం' అనే సరికొత్తశైలిలో ఏకాంకికను రచించి నాటిక ప్రదర్శన ప్రపంచాన్ని ఒక్క ఊపు ఊపేశారు. ఈ ప్రదర్శన అప్పట్లో శ్రీవెంకటేశ్వర విశ్వవిద్యాలయం నిర్వహించిన 'ఇంటర్ యూనివర్శిటి యూత్ ఫెస్టివల్' పోటీలల్లో కావలి కళాశాల వారిచే ప్రదర్శింపబడి ఉత్తమ ప్రదర్శనగా ఎన్నికకావడం గుర్తు చేసికొన్నాము, నేనూ కుటుంబసభ్యులు. మరోమారు అప్పట్లో ప్రొఫెసర్ శ్రీరాం వేంకట భుజంగ రాయశర్మగారు (తెలుగు ప్రొఫెసర్, తర్వాత ప్రిన్సిపాల్) ఈ నాటికను ఎంతో ప్రశంసించారు. అందులోని 'న్యూ టెక్నిక్'- స్టేజిపై మరో స్టేజి దర్శకుడూ మొదలగువారుంటారు. **-శ్రీమతి కాకుటూరు సుజాత, నాగరాజు, కావలి.**

16-31 మే. 2004 నాటి 'హాసం' హాస్య సంగీత పత్రికలో ఆపాత (ట) మధురం శీర్షికలో అన్నపూర్ణావారి, వెలుగునీడలు చిత్రగీతాలు నన్ను అలరించాయి. నాటికి నేటికి మరి ఏనాటికి 'వెలుగునీడలు' చిత్రగీతాలు ప్రేక్షక శ్రోతల హృదయాలలో చిరస్థాయిగా నిలిచివుంటాయి. ముఖ్యంగా కలకానిది విలువైనది బ్రతుకు కన్నీటి ధారలోనే చెలి చేయకు శ్రీ శ్రీ గీతం,ఘంటసాల గానం, అక్కినేని వారి అభినయం ఆ చంద్ర తారార్కంగా అజరామరంగా నిలిచివుంటుంది. కళాభారతి, జమునగారి నేనూ-నా పాటలు, సీరియల్‌గా అందిస్తున్న 'హాసం'కు అభినందన మందారమాల సమర్పిస్తున్నాను. ముందు ముందు మరిన్ని మంచి మధురగీతాలు అందిస్తారని ఎదురుచూస్తుంటాను.

**-దోవారి నాగేశ్వరరావు, వేకనూరు.**

నా ఉత్తరం చేరగానే మీ ఉత్తరంతో బాటు'జై' ఆడియో' సిడి' చేరినాయి. డోర్ నెంబర్ విషయంలో జరిగిన పొరపాటుకు నా బాధ్యత కూడా వున్నది. మునిసిపాల్టీ వాళ్ళు ఈ కొత్త నంబర్ ఇచ్చారు కదా అని నేను వ్రాయడంలో కొరియర్ వాళ్ళు పొరపాటుపడి మీకు వాపసు చేశారని అర్థమయింది. నా ఉత్తరానికి జవాబుగా మళ్లీ శ్రద్ధ తీసుకుని మీరు 'సిడి' పంపడం చాలా సంతోషం కలిగింది. ఇంకా ఇలాంటి మంచి వాళ్ళు ఉన్నారా అని అన్పించింది. కృతజ్ఞతలు తెలుపుకుంటూ.

**-టి. ప్రియాంక,గుంతకల్లు.**

'డాక్టర్ డూలిటిల్' ద్వారా ఈ తరం కొత్తరకం హాస్యాన్ని, అదీ ఈనాటి తెలుగులో అందిస్తున్నందుకు అభినందనలు. సీరియల్ చక్కగా సాగుతోంది.

**- సుమనస్పతి రెడ్డి, హైదరాబాదు**

16-31 మే పత్రికలో సీతారామశాస్త్రి గారి జన్మదినాన్ని పురస్కరించుకొని ప్రచురించిన వ్యాసం చాలా బాగుంది. వారి గురించి చంద్రబోస్,కులశేఖర్ గార్లు చక్కగా తెలిపారు. నిజంగా వారు గొప్ప గీతరచయిత. ఆ దివిలో వెన్నెల ఎలా వెలుగుతున్నదో ఈ భువిపై గీతాలను సిరివెన్నెలగారు అలా వెలుగుతున్నారు. అంతేకాక సుద్దాల అశోక్‌తేజగారి గురించిన వ్యాసం కూడా బాగుంది. ఇలాంటి విషయాలను మాకు అందిస్తున్న 'హాసం' పత్రికకు నా హృదయపూర్వక కృతజ్ఞతలు.

**-ఎ. శశికిరణ్,రాగంపేట**

మే 16-31 సంచికలో 'సంవీక్షణం' గురించి - మదన్‌మోహన్ జి.కె.వెంకటేశ్ కంఠాన్ని మెచ్చినది 'సంతోషం'లోని 'తీయని యీనాటి రేయి' పాట గురించి, 'యమునా వాటికి' గురించి కాదు. దీని హిందీవెర్షన్ పాడినది లత, హేమంత్, జమున గారన్నట్లు లతా, రఫీ కాదు. శాంతకుమారిపై వ్యాసంలో - 'మీ వంటిదేనండీ' పాట 'ధర్మదేవత' లోనిది, 'ధర్మతేజ'లోది కాదు.

**-వే.ఆ.కృ.రంగారావు, మద్రాసు**

**(ధర్మతేజ అచ్చుతప్పు. 'యమునావాటిక' సమీక్షకుడి పొరబాటు - ఎడిటర్)**

'హాసం' పత్రిక మకుటాయమానమైన శీర్షిక 'ఆపాత మధురం' ఈ శీర్షిక లేకపోతే హాసం పత్రికకు నిండుదనం లేనట్టే నాదృష్టిలో . నేను ప్రతి పత్రిక ఎదురు చూసేది ఆ పాత మధురం కోసమే. రెండు సంవత్సరాల నుండి పత్రిక కొంటున్నాను, దాచుకుంటున్నాను. 1-15అక్టో2001నుండి 16-31 అక్టో 2002 వరకు పాత సంచికలు కొనాలనుకుంటున్నాను. ఈ కొనడాలు, అనుకొనడాలు, దాచుకొనడాలు అన్నీ ఆపాతమధురం కోసమే. పాత చిత్రాల పాటలకు సాధికారపు రాజాగారి విశ్లేషణ కోసమే. అలాంటి శీర్షికను స్థలాభావము అను సాధారణ కారణంతో ఆపి మమ్మల్ని బాధించారు. దయచేసి ఇక ముందు ఎట్టి పరిస్థితుల్లోను ఈ శీర్షిక ఆపవద్దని మనవి. ఆపడానికి మిగతా శీర్షికల్లో ఏదేని ఒకటి అవ్వండి. "ఈ పత్రికలో నేను రాయలేకపోయాను" అని చెప్పండి. అంతేగాని మరే కారణాలతోను ఆపవద్దని మరీమరీ మనవి. ఎక్కువగా రాశాను అనుకుంటే మన్నించండి.

**- జి. రామారావు,విజయవాడ.**

'హాసం' ప్రతినెలా వదలకుండా చదువుతున్నా పాఠకుల్లో నేనొకడ్ని. 'ఆపాతమధురం' శీర్షికలో మీరు ప్రచురిస్తున్న పాత చిత్రాల గీతాలను, వాటి విశ్లేషణని చదివి చాలా ఆనందిస్తున్నాను. 1-15 జూన్ పత్రికలో హైదరాబాదు పాఠకులు శ్రీవి.కామేశ్వర రావుగారు 'వరుడుకావాలి' పాటల నెప్పుడు పరిచయం చేస్తారు? అని అడిగిన ప్రశ్నకు మీరు 'అవకాశం తక్కువ' అని సమాధానం యివ్వడం బాధకలిగింది. ఎందుచేత ? మీ దగ్గర ఆ పాటల పుస్తకం ఉంది. నేను( మీరు కోరితే) మీకు పంపించగలను.

**- డాక్టర్.రాచర్ల రాధాకృష్ణ,గుడివాడ.**

'వరుడు కావాలి' పాటలపుస్తకం మా వద్ద కూడా ఉంది. కానీ అది సరిపోదు. వీ సీడీ కూడా ఉండాలి. అప్పుడే సంపూర్ణ ధైర్యంతో రాయగలం. అప్పట్లో విడుదలైన రికార్డులను టేపుల లోకి ట్రాన్స్‌ఫర్ చేసుకున్న టేపులు కూడా సేఫ్‌సైడ్ ఉంటే మంచిది. ఇవన్నీ ఆ చిత్రానికి లభ్యం కావడం మా పరిధిలో కష్టం. కనుక అలా అన్నాం. ఒకవేళ సమకూరితే ఆ అదృష్టాన్ని ఒదులుకోం కదా!

**- ఎడిటర్**

The one and only Magazine devoted to Humour & Music



# హాసం

హాస్య - సంగీత పత్రిక

66

సంపుటి: 3 సంచిక: 18

16-30 జూన్ 2004

పేజీలు: 76

విడి ప్రతి : రూ. 10-00

సంవత్సర చందా : రూ. 200

విదేశాలలో (ఎయిర్‌మెయిల్): $ 50

జీవిత చందా : రూ. 2000

విదేశాలలో (ఎయిర్‌మెయిల్) : $ 400

మేనేజింగ్ ఎడిటర్
**ఎమ్బీయస్ ప్రసాద్**

ఎడిటర్
**రాజా**

రిఫరెన్స్ కర్టెసీ
డా॥ కె.వి.రావు
జె.మధుసూదన శర్మ

మేనేజర్
**పి.గిరి**
చీఫ్ లే-అవుట్ డిజైనర్
**జి.రాజేష్**

**HAASAM HAASYA SANGEETHA PATHRIKA**
Flat No. 502, Sri Balaji Nilayam
13-1-212, Motinagar,
Hyderabad-500 018
Ph: 2383 1388 / 5557 0215
*email:* haasammag@hotmail.com

Printed and Published by:
**K.I.Varaprasad Reddy**
On behalf of Hummus Infoway (P) Ltd.,
502, Sri Balaji Nilayam,
13-1-212, B.S.P. Colony, Motinagar,
HYDERABAD - 500 018

**Printed at:** Kalajyothi Process Ltd.,
1-1-60/5, RTC X Roads,
Musheerabad, Hyderabad-20,

**Published at:** 502, Sri Balaji Nilayam,
13-1-212, B.S.P. Colony, Motinagar,
HYDERABAD-500 018

**Editor: RAJA**

Marketed by:
Margadarsi Marketing Pvt Ltd.,
6-3-570, Eenadu Compound
Somajiguda, Hyderabad-82

కళను వృత్తిగా స్వీకరించినవారికి ఎప్పుడూ కత్తి మీద సామే! తక్కిన వృత్తులలో ఎక్కడో అక్కడ ఫుల్‌స్టాప్ ఉంటుంది. ఏదో ఒక దశలో తృప్తిపడడమనేది ఉంటుంది. కానీ కళకు సంబంధించి క్వాలిటీ విషయంలో భరతవాక్యం అనేదే లేదు. అక్కౌంట్స్ డిపార్టుమెంటు తీసుకుంటే, ఆ పక్కా ఈ పక్కా టేలీ అయిపోతే హమ్మయ్య అనుకోవచ్చు. వ్యవసాయమయితే ఎకరానికి ఇంత దిగుబడి వచ్చింది కాబట్టి ఫర్వాలేదని అనుకోవచ్చు. వ్యాపారానికి వస్తే గతసంవత్సరం టర్నోవరుపై ఇంత శాతం పెరిగిందని తృప్తి పడవచ్చు. అనుకున్న దానిని కనిపెట్టగలిగితే శాస్త్రజ్ఞుడు ఆనందాశృవులు రాల్చవచ్చు.

కానీ కళ విషయానికి వస్తే ఇవేమీ పనికిరావు. ఎంత బాగా పనిచేసినా ఇటు కళాకారుడు కానీ, అటు రసజ్ఞుడుకానీ తృప్తి పడకపోవచ్చు. చేయవలసినది ఎంతో మిగిలిపోయిందన్న అసంతృప్తి లోపల రగులుతూనే ఉంటుంది. అందుకే ఎంత గొప్ప నటుడయినా, కళాస్రష్ట అయినా 'నేనింకా సముద్రపు లోతులను తరచి చూడలేదు. ఒడ్డున గవ్వ లేరుకుంటున్నాను.' అంటూంటారు. ఈ అసంతృప్తి వల్లనే కళాకారులు అశాంతిగా కనబడతారు. ఊహకందినది చేతి కందక, తన అనుభూతిని ఇతరులకు తెలియచెప్పలేక సతమతమవుతారు.

రసజ్ఞుడు కళాకారుడి నుండి ఎంతో ఆశిస్తాడు. కళను ఆస్వాదించడానికి పాండిత్యం అక్కరలేదు. సామాన్యుడయినా సరే వంక లెంచగలడు. 'ఈ బొమ్మలో ముక్కు అలా వుందేం?' ' 'ఈ కవిత్వం ఏమిటో దీని భావం అర్థం కాలేదు' 'ఈ అమ్మాయి పాటలో జీవం లేదు' 'ఈయన యాక్టింగు నాచురల్‌గా లేదు' 'ఈ కథ అదోలా ఉంది' 'ఈ ట్యూన్ హృదయానికి హత్తుకోలేదు' ఇలా అనేక వ్యాఖ్యలు.. ఎలా వుంటే బాగుంటుందో వారికీ తెలియదు, చెప్పడం వారి పనీ కాదు. 'నచ్చలేదు, దట్సాల్'!

శ్రోత, పాఠకుడు, ప్రేక్షకుడు - ఎవరైనా కానీయండి, వారు పెదవి విరుపును కళాకారుడు సహించలేడు. అన్నిటికన్నా భరించలేని వ్యాఖ్య మరొకటుంది - 'ఇదివరలో మీరు చేసినంత బాగా లేదీసారి..'. ఒకసారి రాజ్‌కపూర్ వాపోయారు - 'ఎవ్రీటైమ్ వి హావ్ టూ అవుట్‌డూ అవర్ ప్రీవియస్ బెస్ట్' (మమ్మల్ని మేమే అధిగమించాలి)అని.. ప్రతిసారీ 'ఆవారా'లు పుట్టుకురావన్న సంగతి ప్రేక్షకుడికి పట్టదు. పాతదానితో పోల్చి 'అబ్బే, ఇతని పని అయిపోయింది' అనేస్తాడు. అతనెక్కడ ఆ ముక్క అనేస్తాడోనన్న భయమే కళాకారుడిని నిత్యం వెంటాడుతుంది. 'కొంపదీసి అది యథార్థమేనేమో' అన్న ఆలోచన అతనిలో అభద్రతాభావాన్ని నింపుతుంది.

ఆ అభద్రతాభావమే కళాకారుడిని కృంగతీస్తుంది, ఆలోచనారహితుడిని చేస్తుంది, దుర్వ్యసనాలపాలు చేస్తుంది. వ్యవసాయదారుడయినా, వ్యాపారస్తుడయినా తన వంతు కృషి తాను చేసి ఫలితం దక్కని సందర్భాలలో పరిస్థితులతో రాజీ పడతారు. కానీ కళాకారులు అలా రాజీపడలేక పోవడంతోనే వస్తోందీ చిక్కు. దీనికి ప్రధాన కారణం - వ్యవసాయదారుడిది, లేదా వ్యాపారస్తుడిది వ్యక్తిగతమైన నష్టం కాగా కళాకారుడి నష్టంతో సంఘానికి కూడా ప్రమేయం ఉంటోంది. అతని వైఫల్యాన్ని తమదిగా భావించి కృంగిపోతున్నవారి పరిస్థితి కళాకారుడని అనుక్షణం ఆందోళనకు, మానసిక ఒత్తిడికి గురి చేస్తోంది.

ఇది నిజంగా దురదృష్టకరం. కళాభిమానులు గుర్తించవలసినది - శ్రీశ్రీ వ్రాసిన ప్రతి కవితా 'మహాప్రస్థానం' కాలేదని, ఆత్రేయ వ్రాసిన ప్రతిపాటా 'ముద్దబంతిపూవు' కాలేదని, రాజేశ్వరరావు సంగీతం ఇచ్చిన ప్రతి సినిమా 'మల్లీశ్వరి' కాలేదని! అంతెందుకు, ఎందరో పాఠకులు తమ ఆశలను, ఆశయాలను 'హాసం' నెరవేర్చాలని ఆశించడం కూడా చూస్తూ ఉన్నాము. చేతనైనంతవరకు వారిని తృప్తి పరచాలన్న ప్రయత్నించడమే తప్ప అవన్నీ తలకెత్తుకుంటే అశాంతితో, అసంతృప్తితో రగలడమే మిగులుతుందని తెలిసి మసలుకుంటున్నాము! కళతో సంబంధమున్న గీతకారులకైనా, సంగీతకారులకైనా, మరెవరికైనా ఈ సూత్రమే వర్తిస్తుంది!



ప్రముఖ దర్శకుడు
శ్రీ సింగీతం శ్రీనివాసరావు
'హాసం' పాఠకుల కోసం
ప్రత్యేకంగా రాస్తున్న

క రాజు కథలు 15

# వ్యాపార వైద్యుడు

క రాజంటే సామాన్యుడు కాదు. ఈ రాజ్యానికే మహారాజు. ఆయన చేయలేని పనిని ఇంకెవరు చెయ్యగలరు? కాని ఆయన చేయ గలిగినది కొంతవరకే. ఉదాహరణకు, ఆయన నాటక ప్రియుడు. నాటక రచయితల్ని ప్రోత్సహిస్తాడు. కాని వాటిని ప్రదర్శనా యోగ్యంగా చేసుకునే బాధ్యత ఆ రచయితల్దే కదా? ఇదే మంత్రిగారి వాదన. ఈమాటే అతను 'పాపం' గారికి చెప్పాడు.

పాపం అంటే పానకాల పద్మనాభం. ఈ మధ్యనే 'పాపం' శతకం రాశాడు. పాపం వినరా, పావం కనరా, పావం గదరా లాంటి ముక్తాయింపులతో నూట ఎనిమిది కంద పద్యాలు రాయడమే కాక వేమన సుమతీ శతకాల్లో లేని కొన్ని సత్యాలను ఇందులో పొందుపరిచానన్నాడు. ఎవ్వరూ చదవలేదు గనక అది ఔననో కాదనో ఎవ్వరూ చెప్పలేదు.

కొన్నాళ్ళకు 'పావం' శతకం అందరూ మర్చి పోయారు. 'పావం' అంటూ అందరూ జాలిగా చెప్పుకున్నారు. కావ్యమైతే ఎవ్వరూ చదవరనీ, నాటకమైతే దానిని ప్రదర్శిస్తారు గనక నలుగురూ తనను గురించి చెప్పుకునే అవకాశం ఉంటుందని అనుకున్నాడు పావం. అందుకని ఒక మంచి నాటకాన్ని రాయడానికి పూనుకున్నాడు. 'పావం నాటకం రాస్తున్నాడట పాపం' అనుకున్నారంతా.

నాటకానికి ఇతి వృత్తంగా'అభిజ్ఞాన శాకుం తలాన్ని' ఎన్నుకున్నాడు. కాకపోతే ప్రతీసారీ ఏదో ఒకటి కొత్తగా చేయాలనే తాపత్రయ పడేవాడు గనుక నాటకానికి 'అంగుళీయకం' అని పేరు పెట్టాడు. అయితే కొందరు ఇది అందరికీ ఫలానా కథ అని వెంటనే అర్థం కాదంటే దానిని కొద్దిగా పొడిగించి 'అంగుళీయకం' అను 'భరతజననం' అను 'అభిజ్ఞాన శాకుంతలం' అను 'ఉంగరం' అన్నాడు. ఇది విన్నవారు 'పాపం ఎప్పుడూ ఏదో కొత్తగా చేస్తుంటాడు' అన్నారు. కాని తీరా నాటకం రాసిన తర్వాత దానిని ప్రదర్శించడానికి ఎవ్వరూ ముందుకు రాలేదు. నాటకంలో అంగుళీయకం ముఖ్యపాత్ర వహిస్తుండడంచేత నీళ్ళల్లో చేపను పట్టడం, దానిని కోస్తే అందులో ఉంగరం దొరకడం లాంటి ముఖ్యమైన ఘట్టాన్ని విపులంగా రాసేడు. ఈ దృశ్యాలే ప్రదర్శకులకు ఎదురైన సమస్య. వీటిని రంగస్థలం మీద ఎలా చూపాలా అనేది వాళ్ళ ప్రశ్న. 'పాపం కవి. నాటకం రాయడం చేతకాదు. అని వాళ్ళ గోల. వాళ్ళకు తన ప్రతిభను అర్థం చేసుకోగలిగేంత తెలివి లేదని పావం గోల. ఎలాగైతేనేం నాటకాన్ని ఆడించలేక పోయాడు పాపం. ఇంతకాలం కష్టపడినా ఫలితం లేకపోయే సరికి ఇక వేరే దారిలేక మంత్రిగారిని సందర్శించి తన గోడును చెప్పుకొని ఎలాగైనా మహారాజుగారికి చెప్పి తనకు సహాయం చేయించ వలసిందిగా కోరాడు.



"పాపంగారూ! మీరు కాస్త అర్థం చేస్కోవాలి. ఎంత మహారాజైనా కొంతవరకే సహాయం చేయగలడు. ఏకంగా రంగస్థలం మీదే చేపలు పట్టమంటే ఆయనకు మాత్రం ఎలా సాధ్యం చెప్పండి? " అన్నాడు మంత్రి. "పోనీ ఇంకేదన్నా నాటకం రాయకూడదా?''అని సలహా ఇవ్వబోయి అయితే లంకా దహనం రాస్తానంటాడేమోనని భయపడి ఊరుకున్నాడు.

నిరుత్సాహంతో నీరసపడి పోయిన 'పావం'కు ఈ సమయంలో ఎడారిలో జలాశయంలా ఒక నేస్తం దొరికాడు. చిత్రం ఏమిటంటే అతని పేరు మహారాజు. 'ఆ మహారాజు చేయకపోతే ఏం ఈ మహారాజు చేస్తాడు' అని అతను 'పావం'కు మాటిచ్చాడు. చేస్తాడో చెయ్యడో ఆ మాటే పాపంకు కొండంత ధైర్యాన్నిచ్చింది.

మహారాజు స్వంత ఊరు రాజమహేంద్ర

వరం. అప్పుడతని పేరు కన్నయ్య. ఒకప్పుడు ఒక గుజరాతీయుల ఇంట్లో వంటపనికి కుదిరాడు. వంటవాళ్ళను వాళ్ళు మహరాజ్ అనిపిలిచే అలవాటు. అలాంటి ఇళ్ళల్లో పనిచేసి చేసి చివరకతని పేరు 'మహారాజు'గా స్థిరపడి పోయింది. అతను దేశం నలుమూలలా తిరిగి రకరకాల ఉద్యోగాలు, వ్యాపారాలూ చేసి బ్రతుకు తెరువు మెలికలను బాగా తెల్సుకున్నాడు. ఎన్నో భాషలు నేర్చుకున్నాడు. తెలివి ఉండాలేగాని ఏ పనైనా సాధించగలమనే ఆత్మవిశ్వాసం సంపాదించుకున్నాడు. ఇప్పుడం దరికీ వ్యాపారం ఎలా చెయ్యాలో చెప్పడమే అతని ముఖ్య వ్యాపారం. వెనుకబడిన జాతుల నుద్ధరించే దేశోద్ధారకుడిలా, నష్టపోయిన వ్యాపారస్తులను లాభాల మార్గంలో పెడ్తాడు. అందుకే అందరూ అతన్ని వ్యాపార వైద్యుడంటారు. నష్టాల జబ్బులో వున్న వ్యాపారస్తులను ఆదుకోడానికే కరాజు రాజ్యాని కొచ్చాడు మహారాజు.

ఆరోజు రాత్రి గుడి ఆవరణలో యువకులంతా కలిసి ఒక హాస్యనాటకాన్ని ప్రదర్శిస్తున్నారు. చూడ్డానికి వచ్చిన వందలాది జనం ప్రతిమాటకు విరగబడి నవ్వుతున్నారు. ఆ సమయంలో ఆ దారిన పోతున్న మహారాజు గుడిలోంచి వస్తున్న నవ్వులు విని కుతూహలంతో గుడిలోకి వెళ్ళి వెనక నిలబడి




నాటకం చూసాడు. అందరూ నవ్వుతున్నారు. కాని తన ప్రక్కన నిలుచున్న వ్యక్తి మాత్రం ఏడుస్తున్నాడు. జనం బిగ్గరగా నవ్వుతున్నకొద్దీ అతను అంతే బిగ్గరగా ఏడుస్తున్నాడు. ఈ విడ్డూరాన్ని చూసిన మహారాజు ఆ వ్యక్తితో 'అదేమిటండీ? అందరూ నవ్వుతూంటే తమరు మాత్రం ఏడుస్తున్నారు?' అనడిగాడు.

"ఏం చెయ్యమంటారు స్వామీ! నేను అంగుళీయకం అనే ఒక నాటకాన్ని కష్టపడి రాసేను. అద్భుతంగా రాశాను. అయినా ఎవ్వరూ ప్రదర్శించలేదు. ఇప్పుడెవరో అనామకుడు రాసిన నాటకాన్ని చూసి అందరూ నవ్వుతూంటే నాకు ఏడుపు రాకుండా ఎలావుంటుంది?" అన్నాడా వ్యక్తి. ఈ విధంగా మహారాజుకు పాపంకు మొదటి పరిచయం ఏర్పడింది.

"అధైర్యపడకండి. మీ నాటకం నేను ప్రదర్శింపచేస్తాను" అన్నాడు మహారాజు ఆ మాటలు విన్న పాపం ఆనందానికి అవధులు లేవు.

మహేంద్రవర్మ అనే బట్టల వ్యాపారస్తుడు కొన్ని సంవత్సరాల వెనక 'మహేంద్ర మందిరం' అనే బట్టల దుకాణం స్థాపించాడు. అక్కడ దేశంలోని అన్ని ప్రాంతాల్నుంచి రకరకాల చీరలు తెప్పించి అమ్ముతున్నాడు. దూర ప్రాంతాల్నుంచి తెప్పిస్తున్నాడు గనక అక్కడి చీరలకు కాస్త ఖరీదు లెక్కువ. అందుకని అతని వ్యాపారం ఆశించినంత బాగా సాగలేదు. ఈ మధ్య అతని నష్టాలు మరీ ఎక్కువయ్యాయి. ఈ సమయంలో 'మహారాజు' అనే వ్యాపార వైద్యుణ్ణి గురించి విని అతన్ని ఇంటికి పిలిపించాడు. మహేంద్రుని కష్టాలను విన్న

మహారాజు అంతకు ముందు రాత్రే 'పాపం' కష్టాలను కూడా వినడం జరిగింది. ఇప్పుడు వీరిద్దరినీ సమన్వయిస్తే ఇద్దరి కష్టాలూ గట్టెక్కే మార్గం అతనికి స్ఫురించింది. ఇద్దర్ని కూర్చోపెట్టి మహారాజు తన పథకాన్ని ఇలా వివరించాడు.

మహేంద్ర మందిరంలో ఎక్కువ ధర గల చీరలను ఊళ్ళోని ఆడవాళ్లంతా 'ఈ చీరలనే కొనాలి' అనేట్టు చెయ్యాలి. ఇదెలా సాధ్యం?".

ఇప్పుడు రంగంలోకి దిగుతాడు పాపం. అతని రచనలో కొన్ని మార్పులు చేర్పులు చేస్తాడు. దుష్యంతుడు శకుంతలను మొదట చూసిన దృశ్యంలో శకుంతల మహేంద్ర మందిరంలోని గులాబీ రంగు చీర కడ్తుంది. దానికి తగ్గట్టు దుష్యంతుడు 'ఆహా! నీ వెవ్వరివో గాని ఆ తుమ్మెద నిన్ను వెంటాడడానికి కారణం గులాబీ వంటి నీ ముఖమూ, దానికి వన్నె తెచ్చే నీవు ధరించిన 'మహేంద్ర మందిరం చీర' అంటాడు. ఆ తర్వాత దుష్యంతుణ్ణి తలుచుకుంటూ శకుంతల నవరాగమాలికలో పాట పాడ్తుంది. ఒక్కొక్కరాగానికీ ఒక్కొక్క రంగు చీర కడ్తుంది. అవన్నీ మహేంద్ర మందిరం చీరలని చెలికత్తెలు చెప్తారు. ఇక చేపల దృశ్యంలో బెస్తవాడు ఒక గాజు కుండీ నిండా నీళ్ళుపోసి అందులో రంగు రంగుల చేపలను వదిలి వేదికి మీదికి తీసుకొస్తాడు. ఈ రంగులన్నీ మహేంద్ర మందిరం చీరల్లా వున్నాయంటాడు. ఏ రంగులేని ఒకే ఒక చేపను తీసుకెళ్ళి కోయమని అనుచరులకు చెప్తాడు. అతను పక్కనున్న తెర వెనుక వెళ్ళి చేపను కోసినట్టు, అందులో ఉంగరం దొరికినట్టు చెప్తాడు.




ఈ పథకం ప్రకారం మహేంద్ర వర్మ తనే అన్ని

ఖర్చులూ భరిస్తూ ఈ నాటకాన్ని ప్రదర్శించడానికి సన్నద్ధుడయ్యాడు. దీనిని నగరంలోని స్త్రీలకు ఉచితంగా ప్రదర్శిస్తున్నట్టు ప్రకటించాడు. ఆస్థాన నర్తకీ మణులలో ఒకరికి నూటపదహారు చీరలు ఉచితంగా ఇచ్చి ఆమె చేత శకుంతల వేషం వేసేట్టు ఒప్పించాడు. ఒక అందగాడైన నటుడి చేత దుష్యంతుని వేషం వేయించాల్సిందిగా 'పాపం' కోరాడు. కాని 'మహారాజు' ఆ సలహాని తిరస్కరించాడు. 'అందమైన దుష్యంతుడు అక్కడుంటే వచ్చిన వాళ్ళంతా అతన్నే చూస్తుంటారు. మహేంద్ర మందిరం చీరలు చూడరు' అన్నాడు. దాంతో అతి సామాన్యంగా కాస్త నల్లగా వుండే వ్యక్తిని దుష్యంతుడిగా ఎన్నుకున్నారు.

నాటక మందిరం కిక్కిరిసి పోయింది. శకుంతల నాట్యం చేస్తుంటే అందరి దృష్టి చీర మీదే వుంది. దుష్యంతుడి మాటల్లో అది మహేంద్ర మందిరం చీర అని తెలిసేటప్పటికి అందరిలో ఒక రకమైన ఉత్కంఠత ఆవరించింది. ఇక నవరాగమాలిక పాటలోని చీరలను చూసి అందరూ మైమరచిపోయారు. చేపల రంగుల చీరల్ని ఊహించుకుంటే అవెంతో ఆధునికంగా కనపడ్డాయి. నాటకం బ్రహ్మాండమైన విజయాన్ని సాధించింది.

మరుసటి రోజు మహేంద్ర మందిరం 'అంగుళీయకం' చీరలు కొనడానికి వచ్చిన స్త్రీలతో నిండిపోయింది. ఇంత రద్దీ వుంటుందని మహేంద్ర వర్మ కలలో కూడా అనుకోలేదు. ఈ మహర్దశకు కారకుడైన మహారాజును ఆ రాత్రి ఇంటికి విందుకు పిలిచి, సన్మానించి విశేష ధనాన్ని సమర్పించుకున్నాడు. అలాగే నాటక కర్త అయిన పాపం కూడా మొట్టమొదటిసారిగా తన రచనకు పారితోషికాన్ని కళ్ళతో చూడగలిగాడు. కొన్నాళ్ళయేసరికి చీరల వ్యాపారంలో మహేంద్ర మందిరం మొత్తం రాజ్యంలో అగ్రస్థానాన్ని ఆక్రమించుకుంది. అంతకు ముందు భైరవి అన్నా కానడ అన్నా అవి రాగాల పేర్లనే వారు. కాని ఇప్పుడవి అంగుళీయకం చీరల పేర్లని చెప్పుకుంటున్నారు. ఆ పేర్లతో రాగాలున్నాయన్న సంగతే మర్చిపోయారు.

మహేంద్రవర్మ విజయాన్ని చూసిన మిగతా వ్యాపారస్తులు కూడా మహారాజును కలిసి తమను కూడా నష్టాల ఊబిలోంచి బయటకి లాగమని కోరారు. ఇందులో చెప్పుల వ్యాపారం చేస్తున్న చిలకలూరి చెంగయ్య ఒకడు. వెంటనే మహారాజు ప్రస్తుతం ప్రముఖ నాటకకర్తగా చెలామణి అవుతున్న పాపం గారిని పిలిపించి అతని చేత "పాదుకా పట్టాభిషేకం" నాటకం రాయించాడు. అందులో భరతుడు శ్రీరామచంద్రుని కోరిన పాదుకలు చిలకలూరివారి కొట్టులో చేసినవిగా చెప్పించాడు. యథాప్రకారం నాటకం విజయవంతమై చిలుకలూరి చెప్పులు ప్రసిద్ధికెక్కాయి.

"శ్రీరామచంద్రుడు చిలకలూరి చెప్పులు వాడడమేమిటి? ఏమిటీ విడ్డూరం?" అంటూ నిందించాడు నాటకం చూసిన ఒక పండితుడు.

'ఎక్కడో అయోధ్యలో పుట్టిపెరిగిన రాముడు తెలుగులో మాట్లాడగా లేనిది, చిలకలూరి చెప్పులు వేస్కుంటే తప్పా' అన్నాడు పాపం ధైర్యంగా. ఇంకా 'శ్రీకృష్ణతులాభారం' లో







త్రాసులో సత్యభామ వేసిన నగలు 'లక్ష్మీపతీ నగల దుకాణం' లోనివిగా చెప్పించాడు. ఊరిలో కెల్లా ప్రసిద్ధి కెక్కిన వీరయ్య వంటకానికి మరింత ప్రాశస్త్యం తెస్తూ 'శశిరేఖా పరిణయం' నాటకంలో ఘటోత్కజుని చేత 'వివాహ భోజనంబు వీరయ్య వంటకంబు' అనిపించాడు.

మహారాజే చెయ్యలేని పనులు ఎవరైనా చెయ్యగలరా అని అనుమానించిన మంత్రి వ్యాపారవైద్యుడిగా పేరుగాంచిన ఈ మహారాజు అద్భుత చర్యలకు ఆశ్చర్యపొయ్యాడు. ఎలాగైతేనేం రాజ్యంలో వ్యాపారం ఊపందుకున్నందుకు సంతోషించాడు.

ఈమాటే కరాజుతోచెప్పాడు. వ్యాపార వైద్యుడు సాధించిన గొప్ప కార్యాన్ని కరాజు మనస్ఫూర్తిగా మెచ్చుకున్నాడు. సంతృప్తి తాండవించే చిఱునవ్వుతో కరాజు మంత్రిని చూసి ''మంత్రీ! రాజ్యంలో వైద్యులెంత ముఖ్యమో వ్యాపారవైద్యులు కూడా అంతే ముఖ్యమని తెలిసి వచ్చింది కదా! వెంటనే నగరంలోని వైద్యకళాశాల ప్రక్కన వ్యాపార వైద్య కళాశాలనొక దానిని స్థాపించి, దానికి ప్రధానోపాధ్యాయుడిగా మహారాజును నియమించండి. దీంతో 'అటు నాటక కళ, ఇటు వ్యాపారం రెండూ, చేదోడు వాదోడై ఉన్నత స్థితిని చేరుకోగలవు " అన్నాడు.

మొట్టమొదటిసారి మంత్రికి కూడా ఒక నాటకం రాయాలనిపించింది. ◆





హాస్యరచనకై 1991-92లో తెలుగు విశ్వవిద్యాలయం నుంచి పురస్కారం పొందిన నండూరి పార్థసారధి, 'సంవీక్షణం'లో పరిచయం చేయబడిన 'రాంబాబు డైరీ' ద్వారా 'హాసం' పాఠకులకు పరిచితులు. వీరి 'సాహిత్య హింసావలోకనం' కుడీ, ఎడమా లేకుండా చిత్తమొచ్చినట్లు రాసి పారేసే కమ్మర్షియల్ రచయితలను ఎండగట్టింది. హనుమంతరావు అనే ఓ కారికేచర్‌ను సృష్టించి సాహిత్యాన్ని భ్రష్టు పట్టించినవారిపై ధర్మాగ్రహాన్ని ప్రదర్శించి హాస్యరచనతో ఒక ప్రయోజనాన్ని సాధించారు నం.పా.సా.

'హింసావలోకనం' అతిశయోక్తులతో సాగిన రచన కాగా'రాంబాబు డైరీ' సున్నితమైన హాస్యానికి ప్రతీకగా నిలబడి మనసును గిలిగింతలు పెడుతుంది. పెర్‌ఫ్యూమ్స్‌లో మగసెంటు, ఆడసెంటు ఉండడమేమిటని బారిష్టరు పార్వతీశం లెవెల్లో ఆశ్చర్యపడిపోతాడు రాంబాబు ('హాసం' 2, 23, 24 సంచికలు చూడండి)

'కార్ఖానాఖ్యానము' ఒక గ్రామీణయువకుడి కథ. రైసుమిల్లులో ఎన్టీయార్, ఏయన్నార్ అభిమానుల మధ్య కాలక్షేపం కబుర్లతో సమయం వృథా చేస్తూ, పట్నం వెళ్లి క్రమక్రమంగా జీవితంలో ఎదిగిన కుర్రవాడి గాథ. సహజత్వానికి దగ్గరగా ఉంటూ, మామూలు సంఘటనల నుండే హాస్యాన్ని చిందించినట్లుంటుంది.

కానీ 'అయోమయరాజ్యం'లో రచయిత ఎన్నుకున్న పంథా వేరు. ఒక కాల్పనిక రాజ్యాన్ని సృష్టించి, దానిలోని అవకతవకలను విపులంగా వర్ణించి, చివరకు ఆ వ్యవస్థ కూలిపోయిన విధాన్ని జానపదగాథలా చెప్పారు. ఓ తలతిక్క మేధావి మూడు పొరుగురాజ్యాలనుండి కొన్ని ప్రాంతాలు కాజేసి అయోమయరాజ్యానికి రూపకల్పన చేస్తాడు. భాష, మతం, ఆచారవ్యవహారాలు, పగలు, రాత్రి - ప్రతిదానికి విశ్వామిత్ర సృష్టి చేస్తాడు. పరిసరప్రాంతాల ప్రభావం పడకుండా చుట్టూ గోడ కట్టిస్తాడు, పైన పందిరి వేయిస్తాడు. సూర్యరశ్మి తగలకుండా, వెన్నెల అనేది తెలియకుండా ప్రజలను తయారుచేస్తాడు. మరి వీరికి పంటలెలా పండుతాయి? తిండేం తింటారు? అందువల్ల రవాణాసురులు అనే పేరుతో దొంగలను పెంచిపోషిస్తాడు. వారి పని పక్కరాజ్యాల నుండి వస్తువులను, ఆహారపదార్థాలను దొంగిలించి తెచ్చి రాజ్యంలో యావన్మందినీ పోషించడం!

ఇలా ఒకటి కాదు, రెండు కాదు అరవై యేళ్లపాటు పరిపాలన సాగుతుంది. కానీ ఓ సారి యువరాజుకోసం పొరుగురాజ్యం రాకుమారిని అపహరించి తెస్తారు. ఆమెను ప్రేమించిన మరో రాజకుమారుడు తన సహచరుడితో సహా ఈ రాజ్యానికి వచ్చి రాజ్యం తీరుతెన్నులు అధ్యయనం చేస్తున్నాం అంటూ విషయాలన్నీ సేకరిస్తాడు. ఉపాయంతో రాజకుమారిని తప్పించి, అంతటితో తృప్తి పడకుండా మళ్లీ తిరిగివచ్చి శాంతియుతంగానే అయోమయ పాలన నుండి ప్రజలను విముక్తులను చేస్తాడు. జరిగినదానిని అతని సహచరుడు గ్రంథస్తం చేసి కాలనాళికలో పాతిపెడితే అది నేటికాలానికి బయటపడుతుంది. ఫ్లాష్‌బ్యాక్‌లో ఈ కథ అంతా తెలుస్తుంది.

సమకాలీన సంఘాన్ని డైరెక్టుగా విమర్శించడం కుదరని పరిస్థితుల్లో 'పంచతంత్రం'లా జంతువుల మీదనో, 'డాన్ క్విక్సట్' లా వ్యంగ్యపాత్రల ద్వారానో, 'గలివర్ ట్రావెల్స్'లా కాల్పనిక లోకం పేరుపెట్టో ఆ పోకడలను రచయితలు దుయ్యబట్టడం కద్దు. నం.పా.సా. వంటి పాత్రికేయుడు, మేధావి 'అయోమయరాజ్యం'ను కల్పిస్తున్నారంటే అటువంటి ప్రయత్నమేదో ఉందని భావించడం జరుగుతుంది. అయోమయరాజ్యం గురించి కొన్ని ముచ్చట్లు -

ఆ రాజ్యం ఓ మూతపెట్టిన డబ్బాలా ఉంటుంది. కింద చూస్తే నేల, పైన చూస్తే పందిరి. పగలు నిద్రపోతారు, రాత్రి వీధిదీపాల వెలుగులో తిరుగుతారు. జనాలు వెనక్కి నడుస్తారు. చక్రవర్తి పేరు వక్రవర్తి. ఆయన అష్టవంకరలతో ఉంటాడు. మంత్రులను తంత్రులంటారు. అక్కడ పాఠశాలలు లేవు. దొంగతనం జన్మహక్కు. లంచం పుచ్చుకోవడం ప్రాథమిక హక్కు. గోపూజ నిషేధం. గాడిదను పూజిస్తారు. పందులను గౌరవిస్తారు. రాజుగారి ఆసనం సింహాసనం కాదు, శునకాసనం. మతం శంకరమతం కాదు, వంకరమతం.



నండూరి పబ్లికేషన్స్, హైదరాబాదు
ఫోన్ - 23548352
ప్రతులకు :
విశాలాంధ్ర, నవోదయా, నవయుగ

భాషావైషమ్యాలు పోగొట్టడానికి రాజు కొత్తభాష సృష్టించి అందర్నీ ఆ భాషే మాట్లాడమన్నాడు. దాన్ని కిందనుంచి పైకి నిలువుగా రాస్తారు. కులవ్యవస్థను కూల్చడానికి కులవృత్తులను నిర్మూలించాలని సంకల్పించి ఎవరూ ఏ వృత్తినీ మూడు నెలలకంటె ఎక్కువకాలం సాగించరాదని శాసించాడు. వారికీ కవిత్రయం ఉంది - తలతిక్కన, సోమరిపోతన, రసాభానకవి. విలోమసంగీతం ఉంది. అదీ వెనక్కి నడుస్తుంది. అంటే తార షడ్జం దగ్గర ప్రారంభమవుతుంది. ఏదైనా కార్యక్రమం ప్రారంభించినప్పుడు దీపం ఆర్పి ప్రారంభిస్తారు. ప్రభుత్వోద్యోగులకు సూత్రరత్నత్రయం ఉంది - 'చెప్పింది చెయ్యి, ఇచ్చింది పుచ్చుకో, చచ్చినట్లు పడుండు'.

ఇది ఏ రాజ్యవ్యవస్థను సూచిస్తోంది? ఏ వ్యవస్థను, ఏ సమాజాన్ని , ఏ సిద్ధాంతాన్ని నం.పా.సా. వెక్కిరిస్తున్నారు? కమ్యూనిజాన్ని వెక్కిరిస్తూ జార్జి ఆర్వెల్ 'యానిమల్ ఫామ్' రాశాడు. అధిక్షేపణ ద్వారా సంఘాన్ని సంస్కరించబూనడం మనకూ ఉంది. జంఘాలశాస్త్రి కలల ద్వారా ఊహాలోకాన్ని సృష్టించి పానుగంటివారు కొన్ని ఆచారాలపై తన నిరసన వ్యక్తపరచారు. మరీ ఈ ఊహారాజ్యాన్ని నండూరివారు ఎవర్ని ఉద్దేశించి ఏ లక్ష్యంతో నిర్మించారో తెలియరాలేదు. ఆ గోడ చైనా గోడా? జర్మన్ గోడా? కొత్త భాష, మతం సృష్టించాడు కాబట్టి వక్రవర్తి అక్బరా? పోనీ హిట్లరా? ఎవరి కారికేచర్ ఇది? ఏమో! 'హింసావలోకనం'లో కనబడే కసి ఇక్కడ కనబడదు. వక్రవర్తి మీద మనకు అసహ్యం పుట్టదు. అలా అని నవ్వూ రాదు.

అయోమయం అంటే ఇనుములాగా కఠినమైనదీ, దుర్భేద్యమైనదీ అని అర్థం అని పుస్తకంలోనే వివరణ ఇచ్చారు. నలభైయేళ్లపాటు రచన సాగిన ఈ 438 పేజీల పుస్తకం ఇంచుమించు అలాగే వుంది. హృదయానికి తాకే హాస్యం కంటె బుద్ధికే ఎక్కువ పనిచెప్పే సై-ఫై సినిమాలా తోచింది. కొన్ని చోట్ల వేదాంతచర్చలు కూడా పేజీల కొద్దీ సాగాయి. 'హాస్యం, వ్యంగ్యం, అధిక్షేపణ, కేరికేచర్, పన్, ఫన్, పారడీ, ఫాంటసీ - అన్నీ కలబోసిన విచిత్రగంభీర రచన' అని చివరి అట్టమీద రాసినట్లే సాగిందీ నవల. కవర్ మీద బొమ్మ చూసి ఒట్టి సరదా నవల అనుకుని నం.పా.సా. పూర్వరచనలను గుర్తుకు తెచ్చుకుని చదవబూనితే మాత్రం పాఠకులు తప్పుదారిన పడతారు.

**పుస్తకంలో కొన్ని చెణుకులు**

'బ్రహ్మము అనేది భ్రమము అని తెలుసుకుని వక్రవర్తి భ్రమజ్ఞాని అయ్యాడు.'

'దక్షిణపక్షీయులు ప్రభుత్వాన్ని సమర్థించేవారు. వామపక్షీయులు అసమర్థించేవారు. అంటే వారు సమర్థులు, వీరు అసమర్థులు.'

'మా పితామహులు తపస్సు చాలించి కళ్లు తెరిచేసరికి రాజ్యం పరహస్తగతమై పోయింది. అందువల్ల మా పితృపాదులు ఒంటికంటితో తపస్సు చేశారు.'

**కాయిన్ చేసిన కొన్ని మాటలు** - 'వక్రభాష్యాలు, వక్రోక్తులు, వ్యర్థోపనిషత్, అజ్ఞానానందలహరి, కూపస్థమాండూక్యోపనిషత్, త్రివక్రముడు, హింసానంది రాగం, అశ్రుధారావ్రతం'

**- ఎమ్బీయస్ ప్రసాద్**

50 సంవత్సరాల
నట జీవితాన్ని పూర్తి చేసుకున్న
స్వర్ణోత్సవ నటి జమున
'హాసం' పాఠకుల కోసం
ప్రత్యేకంగా అందిస్తున్న
జ్ఞాపకాల ధారావాహిక

7

# నేనూ నా పాటలు



- శ్రీమతి జమునా రమణారావు

'దొంగల్లో దొర' సినిమాని డి.ఎల్. నారాయణ గారు తీశారు. అప్పటికే - నేను నంబర్‌వన్ ర్యాంకులోకి వెళ్లి పోయాను. గ్లామర్, సక్సెస్,టాలెంట్, హెవీ క్యారెక్టర్ వీటిలో ఏ వేషం వేసినా జమున అద్భుతంగా చేస్తుంది అనే పేరు తెచ్చుకున్నాను. నిర్మాతలు కానీయండి, ఆర్టిస్టులు కానీయండి.... ఆవిడ లవ్ సీన్‌లలో అంత ఫ్రీగా చేయదయ్యా ! అదొక్కటే ఆవిడతో ఇబ్బంది అని ఒక టాక్ ఒకటి లేవదీశారు. సరే అదే టైమ్‌కు డి.ఎల్.నారాయణ గారు అశోక్‌కుమార్ నటించిన 'సంగ్రామ్' అనే హిందీ సినిమాని బేస్ చేసుకుని నన్నూ, నాగేశ్వరరావు గారిని కలిపి తీయాలని...మాకు హిందీ పిక్చర్ చూపించారు. అప్పటికే డి.ఎల్. గారి కంపెనీలో నేను రెండు మూడు పిక్చర్స్ చేశాను కాబట్టి ఒప్పుకున్నాను. అయితే ఆయన ఒక కండిషన్ పెట్టారు..

"అమ్మా చూడండి... ఇది 'చిరంజీవులు' సినిమాలోలాగా ఏడుపులు, మొత్తుకునే క్యారెక్టర్ కాదు.. చాలా గ్లామరస్ క్యారెక్టర్, నాలుగు డ్యూయెట్‌లు, ఒక ఏడుపు పాట, ఎండ్‌లో హీరోహీరోయిన్స్ కౌగిలించుకుంటారు అంతే ! వేషం ఇంతే ! ఈ వేషానికి ఇప్పుడు అమ్మాయి తప్పించి ఇండస్ట్రీలో ఎవరూ లేరు. నా రిక్వెస్ట్ ఏంటంటే- ప్రస్తుతం అమ్మాయి ఇండస్ట్రీని డామినేట్ చేసే పొజిషన్‌లో ఉంది. కాబట్టి కాస్త ఫ్రీగా యాక్ట్ చేయనీయండి. కొంచెం మీరు కూడా మారాలి.... రొమాంటిక్ క్యారెక్టర్ కాబట్టి ఫ్రీగా చేస్తే బాగుంటుందమ్మా... మీరు అమ్మాయి భవిష్యత్తును దృష్టిలో పెట్టుకోవాలి. భుజం మీద చేయి కూడా వేయనివ్వదనే టాక్ వచ్చేసింది. మీరు మరీ ఎదురుగా కూర్చుంటే సరిగా చేయలేదు కదా! భయపడుతుంది. అట్లా అమ్మాయి యాక్ట్ చేస్తుందంటే నేను ఈ సినిమా తీస్తా ! లేకపోతే వేరే సబ్జెక్ట్ వెతుక్కుంటా. అమ్మాయి లేకుండా నేను ఈ సినిమా తీయలేను, అమ్మాయి తప్పించి ఇప్పుడు గ్లామర్ ఆర్టిస్ట్ లేరు... " అని అన్నారాయన మా అమ్మా నాన్నలతో.

అప్పుడేమిటంటే ఉన్న నలుగురు హీరోయిన్స్‌కి డ్రా బ్యాక్స్ ఉన్నాయి... ఒకళ్లు లావు అయిపోయారని, ఒకళ్లు అన్‌లక్కీ అని, ఒకళ్లేమో ఓల్డ్ అని ఈ టైమ్‌లో ఉన్నారు కాబట్టి ఇప్పుడు అన్నిటికీ పనికివచ్చే హీరోయిన్ ఎవరంటే జమున. మా అమ్మగారు ఒప్పుకోలేదు. " ఏంటండీ ఫ్రీ అంటే మీద పడి దొర్లాలా ! కళ్లతో కూడా ప్రేమ పుట్టించవచ్చు" అని అన్నారు. "అలా కాదమ్మా మేము అమ్మాయిని వల్గర్‌గా చూపించం. రెస్పెక్టబుల్‌గా చూపిస్తాం. కానీ లవ్ సీన్ అంటే మరీ రిస్ట్రిక్ట్ అయిపోతోంది. మరీ భుజం మీద కూడా చెయ్యి వెయ్యనీయకుండా.... ఎలా? అమ్మాయి భవిష్యత్తుకి ఇది మంచిది" అని కన్విన్స్ చెయ్యటానికి ట్రై చేశారు. మా అమ్మ నాన్న చాలా సేపు తర్జనభర్జన పడ్డారు ...చివరకు మా నాన్నగారే మా అమ్మను కన్విన్స్ చేశారు - "పోనీలేవే మారుతున్న యుగంలో మనం కూడా మారాలి'' అని! మొత్తానికి వెనుకటి సినిమాలకంటే 'దొంగల్లో దొర' లో కొంచెం ఫ్రీగా యాక్ట్ చేశాను. ఇప్పటికీ ఆ ఫోటోలు నా దగ్గర ఉన్నాయి. చూస్తుంటే నవ్వొస్తుంది. ఒక చోటేమో నాగేశ్వరరావుగారి ఒళ్లో సగం పడుకుంటాను. రెండో దాంట్లోనేమో ఎండ్‌లో కౌగిలించుకోవటం. అంతకుమించి దానిలో ఏమీ ఫ్రీ లేదు. ఇప్పుడున్నట్లుగా అసలు లేదు. సినిమా రిలీజ్ అయింది. ఇక చూడండి ఉత్తరాలు... "జమున గారూ, మీరంటే మాకు ఎంతో గౌరవం. మీరు కూడా ఇలా ఫ్రీగా యాక్ట్ చేస్తారని మేం అనుకోలేదు. మీరు ఎంతో రెస్పెక్టబుల్ అని




'దొంగల్లోదొర' పాటల పుస్తకం కవర్‌పేజీ

**చిత్రం : దొంగల్లో దొర**
**సంగీతం : ఎం.సుబ్రహ్మణ్యరాజు**

రచన : మల్లాది రామకృష్ణశాస్త్రి
గానం : పి. లీల

నన్నేలు మోహను డేడమ్మా
నందగోపబాలు డెందుదాగినా డమ్మా
ఆనందగోపబాలు డెందుదాగినా డమ్మా
ఒక ఆట ఆడి -ఒక పాటపాడీ
ఒక మాటగానే ఉన్నా మమ్మా
చిననాటి చెలిమి-ఆ నాటిచెలినీ
మరువనివాడు -మంచివాడమ్మ
తన వెంట నేనుంటే -నా కంట తా నుంటె
మనకేమిలోటని అనుకుంటినమ్మా
కనుచాటు కానీ -ఎడబాటుకానీ
చివరకు మేము-ఒకటేనమ్మా

---

రచన : సముద్రాల,
గానం : ఘంటసాల, పి. లీల

అ: ఆశలే మారునా
మమతలే మాయునా
బ్రతుకె బరువైపోవునా
ఆ: చందమామ పొందుగోరి చేరువాయెనే ॥ఆశలే॥
అందగోరి చేరబోవ దూరమాయెనే ॥ఆశలే॥
అ: మెప్పుగోరీ కలలనైన నీతిమాననే
తప్పులేనిదండనా తలను కూలెనే ॥ఆశలే॥
ఆ: వెలుగుమాసి దిగులుమూసి విరహ వీధులా
నిలువలేను పాడలేను శోకగీతులా ॥ఆశలే॥
అ: చెరుపరాని నుదుటిరాత నాదు నేరమా
నీవులేక నెనరులేక నిలువనేరనే ॥ఆశలే॥

---

రచన : మల్లాది రామకృష్ణశాస్త్రి
గానం: ఘంటసాల, పి. లీల

అ: ఓహో.......రాణి....
ఆ: ఒ ఓ ఒ, ఒ ఓఒ, ఒఓరాజ
అ: ఈడు జోడుగా తోడునీడగా
ఆ: ఈడు జోడుగా తోడునీడగా
మనముందాములే ఈ తీరుగా
అ: ఈడుజోడుగా తోడునీడగా
ఆ: రేరాజు పలుక-రేరాణి కులుక
విందైన వెన్నెల చిందువేయగా
అ: ఈ రేయినీవై నీ హాయి నేనై
కదలి పొంగారు సరసాలలీలగా
ఈడుజోడుగా తోడునీడగా
అ: నీ వాలుకన్నుల పరువము నేనై
ఆ: నన్నేలు చిన్నారి మురిపెమునీవై
అ: నీ బాసనేనై
ఆ: నా ఆశనీవై
ఇ: కలిసి కలకాలము ఈ లీలగా
ఈడుజోడుగా తోడునీడగా
అ: ఓహో.......రాణి....
ఆ: ఒ ఓ ఒ, ఒ ఓఒ, ఒఓరాజ

అనుకున్నాం" అని ఉత్తరాలు వచ్చాయి.

కె.వి.రెడ్డి గారి దర్శకత్వంలో నేను రెండు సినిమాలు చేశాను. మొదటిది దొంగరాముడు అయితే రెండోది పెళ్లినాటి ప్రమాణాలు. ఈ సినిమాలో నా పాత్ర ముగ్గురుబిడ్డల తల్లి. మెయిన్‌గా పురుషుల యొక్క బలహీనతను, ముగ్గురు బిడ్డల తల్లి అయిన భార్యని పురుషులు, - ఎఫెక్షన్ ఉన్నా కూడా - ఎలా చూస్తారు అన్నది ఓ సైకలాజికల్ ఎఫెక్ట్. నాగేశ్వరరావు గారికి ఈ సబ్జెక్ట్ బాగా ఇష్టం. ఈ పిక్చర్‌కు నేషనల్ అవార్డు కూడా వచ్చింది. ఈ చిత్రానికి మ్యూజిక్ ఘంటసాల గారు... ఇందులో నాకు ఇష్టమైన పాటలు రెండున్నాయి. 'వెన్నెలలోనే వేడిఏలనో....' రెండోది మంచి పేట్రియాటిక్ సాంగ్. ఈ సినిమాలో నా గెటప్ నాకు బాగా నచ్చింది. చక్కదనాల తెలుగు రిచ్ అమ్మాయి ఎలా ఉంటుందో అలా తెలుగుతనం ఉట్టిపడేలా చాలా బాగా తీశారు కె.వి.రెడ్డి గారు.

ఇందులో తమాషా ఏమిటంటే - హీరోయిన్ ఇంటికి హీరో ఉద్యోగం కోసం వస్తే -ఉత్తరాలు మారిపోతాయి. రమణారెడ్డి వంటవాడికి ఇవ్వవలసిన ఉత్తరం హీరోకి ఇస్తాడు. వంటవాడనుకుని హీరోయిన్, పనిమనిషి అతన్ని వంటగదిలోకి పంపిస్తారు. వంటవాడు అయితే ఇలా ఉంటాడా అని అనుమానిస్తారు. సరే, హీరో ఆ అమ్మాయిని చూసి ముగ్ధుడైపోయి వంట గదిలోకి వెళ్లి ఓ సొరకాయ తీసుకుని కోస్తూ ఉంటాడు. అప్పుడు ఓ డ్రీమ్ సీక్వెన్స్. Waltz డాన్స్ చెయ్యాలన్న మాట. స్టెప్స్ అవన్నీ నేనూ, నాగేశ్వరరావు గారు ఆఫీసుకెళ్లి నేర్చుకున్నాం. సరే, డ్రెస్ మెజర్‌మెంట్స్ అవీ తీసుకున్నారు. సిండ్రిల్లా స్టయిల్ లో పెద్ద



'పెళ్ళినాటి ప్రమాణాలు' చిత్రంలో...

**చిత్రం : పెళ్ళినాటి ప్రమాణాలు**
**సంగీతం : ఘంటసాల**
**రచన : పింగళి నాగేంద్రరావు**
**గానం : ఘంటసాల, పి.లీల**

వెన్నెలలోనె వేడి ఏలనో
వేడిమిలోనె చల్లనేలనో
ఏమాయ ఏమో జాబిలీ
ఈమాయ ఏమో జాబిలీ
వెన్నెలలోనె విరహమేలనో
విరహములోనే హాయి ఏలనో
ఏ మాయ ఏమో జాబిలీ
ఈ మాయ ఏమో జాబిలీ
మొన్నటికన్నా నిన్న వింతగా
నిన్నటికన్నా నేడు వింతగా
ఓ హో హో ఓ ఓ ॥మొన్నటి॥
నీ సొగసూ నీవగలూ
హాయి హాయిగా మెరిసేనే ॥వెన్నెల॥
రూపముకన్నా చూపు చల్లగా
చూపులకన్నా చెలిమి చల్లగా
ఓహో హో ఓ ఓ ॥రూపము॥
నీ కళలూ నీ హొయలు
చల్ల చల్లగా విరిసెనే ॥వెన్నెల॥



గౌను, పైన అప్పర్ క్లాత్ ఉండదు. ముందు వాళ్లు స్కెచ్ పంపించారు. తర్వాత డ్రెస్ ఇంటికి పంపించారు. ఆ డ్రెస్ అమ్మగారు చూసి, 'అప్పర్ క్లాత్ ఏదీ' అన్నారు. "అమ్మా..ఇది ఇంగ్లీషు స్టయిల్ కదా అప్పర్ క్లాత్ ఉండదు..." అంటే "నో..ఇది వేయటానికి వీల్లేదు" అని మా అమ్మ. "అసలు దానిలో అసభ్యం ఏమీ లేదు. నిండుగానే ఉంటుంది. పైన అప్పర్ క్లాత్ ఒక్కటే లేదు" అని టైలర్స్! మా అమ్మగారు పెద్ద రాద్ధాంతం చేసేశారు. ఈ సినిమా లేకపోయినా పర్వాలేదు, పైన అప్పర్ క్లాత్ లేకుండా చేయదని. అక్కడ్నుంచి ఆర్ట్ డైరక్టర్, స్పెన్సర్ టైలర్స్ మొత్తం అందరూ మా అమ్మగారి ఆగ్రహానికి భయపడి ఆఫీస్‌కు పరుగెత్తారు.

నేనూ నా పాటలు



చిత్రం : ఇల్లరికం
సంగీతం : టి.చలపతిరావు
రచన : కొసరాజు
గానం : ఘంటసాల



నిలువవే వాలు కనులదానా - వయ్యారి హంసనడక దాన
నీ నడకలో హొయలున్నవె చానా
నువు కులుకుతు ఘులఘుల నడుస్తువుంటే
నిలువదె నా మనసు ఓ లలనా అది నీకే తెలుసు ॥నిలువవే॥
ఎవరనీ ఎంచుకొనినావొ పరుదని భ్రాంతి పడినావొ
ఎవరనీ ఎంచుకొనినావొ భ్రాంతి పడినావో సిగ్గుపడి తొలగేవో
విరహాగ్నిలో నను తోసిపోయేవో ॥నువు కులుకుచు॥ ॥నిలువవే॥
ఒకసారీ నన్ను చూడరాదా చెంతజేరా సమయమిది కాదా
ఒకసారీ నన్ను చూడరాదా సమయమిది కాదా
చాలు నీ మరియాదా
వగలాడి నే నీవాడనే కాదా ॥నువు కులుకుచు॥ ॥నిలువవే॥
మగడంటే మోజు లేనిదానా మనసుంటే నీకు నేను లేనా
మగడంటే మోజు లేనిదానా నీకు నేను లేనా కోపమా నా పైనా
నీ నోటి మాటకు నోచుకోలేనా ॥నిలువవే॥

# నేనూ నా పాటలు



కె.వి.రెడ్డిగారు అక్కడే ఉన్నారు. వీళ్లంతా "సార్, సార్ ఇలా అయింది. వాళ్ల అమ్మగారు అబ్జెక్ట్ చేస్తున్నారు" అంటే పాపం అంత పెద్దాయన బఱున కారులో వచ్చారు. ఆయన వచ్చేముందే ఫోన్ చేశారు కాబట్టి నాన్నగారు, మేమంతా ముందు హాల్లో కూర్చున్నాం. అక్కడనుంచి ఆయన మా అమ్మగారిని కన్విన్స్ చేయటానికి - "అమ్మా ఇంగ్లీషు వాళ్లు అప్పర్ క్లాత్ వేసుకోరు" అన్నారు. మా అమ్మ "ఎందుకండీ అలా...పైన ఫిల్స్‌లాగా ఏదైనా పెట్టి కవర్ చేయవచ్చు కదా...."అని ఆవిడ ఆర్గ్యుమెంట్. మా అమ్మగారితో ఎవరూ ఆర్గ్యూ చేయలేరు. సరే.. రెడ్డి గారు "అది ఉండేది రెండే నిముషాలమ్మా. దానికోసం ప్రత్యేకంగా స్కెచ్ గీయించాం. అయినా మేం ఏదైనా అసభ్యంగా తీస్తే కదా"అని మా అమ్మ గారిని కన్విన్స్ చేశారు. అప్పర్ క్లాత్ లేకుండా యాక్ట్ చేయటం పుట్టిల్లు, తర్వాత ఇది సెకండ్ పిక్చర్.

బి.ఎన్.రెడ్డి గారు కానీ, కె.వి.రెడ్డి గారు గానీ - ఆనాటి డైరెక్టర్‌లలో ఉండే గొప్పతనం గురించి ఓ సంఘటన చెబుతాను. ఆ సినిమాలో హీరో హీరోయిన్ హనీమూన్‌కు వెళతారు. ఓ సాంగ్ లో రెండు మూడు షాట్స్ తీశారు. నైట్ నాకు ఏదో పిక్చర్ ఫినిషింగ్. నైట్ 11 నుండి తెల్లవారు ఝాము వరకూ తీశారు. కాల్‌షీట్స్ ఏమైనా ప్రాబ్లం వచ్చినా...లేక అందరి ఆర్టిస్ట్‌ల కాంబినేషన్ అయినా అలా తీసేవారు. నైటంతా షూటింగ్ చేయటం వల్ల అస్సలు రెస్ట్ లేదు. మళ్లీ మొహం కడుక్కుని పెళ్లినాటి ప్రమాణాలు షూటింగ్ కు వెళ్లిపోయాను. వచ్చిన దగ్గర్నుంచీ ఒకటే నిద్ర, ఆవలింతలు. అందులోనూ రెండు మూడు క్లోజ్ షాట్స్. రెండు లాంగ్ షాట్స్ ఉంటే అవి తీశారు. క్లోజ్ షాట్స్ వచ్చేటప్పటికి నాకేమో నిద్ర ముంచుకొస్తోంది. కుర్చీలో పడుకోవడం, ఆవలింతలు, కళ్లలో నీళ్లు కె.వి.రెడ్డి గారు ఇదంతా చూసి 'పేకప్' అనేశారు. సడన్‌గా పేకప్ అనే సరికి అందరూ కంగారు పడ్డాం. 'ఏమైందండీ' అంటే మా నాన్నగారిని పిలిచి 'ఏమండీ...అమ్మాయి ఏంటి సెట్‌లో ఇలా ఆవులిస్తోంది...నిద్రపోతోంది' అని అడిగారు. దానికి 'లేదండీ ఇలా ఫలానా వారి పిక్చర్ తెల్లవారు జాము దాకా షూటింగ్ జరిగింది' అని మా నాన్నగారు అన్నారు. 'పోనీలెండి రేపు తీసుకుందాం... ఫ్రెష్‌గా ఉండాలి హీరో హీరోయిన్లు. రొమాంటిక్ సాంగ్ అండీ... చక్కగా అందంగా ఉండాలి. క్లోజప్ షాట్స్ రేపు తీసుకుందాం. లాంగ్ షాట్స్ మరో రెండు తీసి పేకప్ చెప్పేద్దాం' అని అన్నారు కె.వి.రెడ్డి గారు. ఎంత గ్రేట్ అండీ వాళ్లు. సెట్‌లో ఆవలింతలు వచ్చాయని పేకప్ చెప్పేశారు. ఎంత మేకప్‌లు వేసుకున్నా, ఎన్ని లైటింగ్‌లు వేసినా నిద్ర కళ్లు ఎక్కడికి పోతాయి, ఆ ఫ్రెష్ ఎఫెక్ట్ రాదు కదా ! కె.వి.రెడ్డి గారి లాంటి వాళ్లు అంత బాగా అబ్జర్వ్ చేసేవారు. అందువల్లే ఆనాటి చిత్రాలుగానీ, యాక్టింగ్‌గానీ మరుపురానివిగా ఉంటాయి.

తర్వాత 'ఇల్లరికం' చెప్పుకోవాలి. అప్పటికే నాగేశ్వరరావు గారితో చాలా చిత్రాలు చేశాను. ఈ సినిమా ఆంధ్రదేశమంతటా 25 వారాలు ఆడింది. మా ఇద్దరి కాంబినేషన్‌లో ఎన్నో హిట్ చిత్రాలున్నప్పటికీ ఇదే అప్పటికి బిగ్గెస్ట్ హిట్. తాతినేని ప్రకాశరావు గారు దర్శకులు. నేను చాలా అందంగా, ముద్దుగా కనిపించినది... 'నేడు శ్రీవారికి మేమంటే పరాకా' పాటలో. అసలా నైట్ గౌను గానీ, హెయిర్ స్టయిల్ గానీ ఎంత బావుందో... ఇప్పట్లో లా అప్పుడు విగ్గులు వాడేవాళ్లం కాదు. ఏదో కర్ల్స్ పెట్టినట్టుగా ఉండేది హెయిర్. హీరాలాల్ మాస్టారు చాలా బాగా చేయించారు. భార్యాభర్తల మధ్య

చిత్రం : ఇల్లరికం    రచన : ఆరుద్ర
సంగీతం : టి.చలపతిరావు    గానం : ఘంటసాల, సుశీల

ఆమె : నేడు శ్రీవారికి మేమంటే పరాకా
తగని బలే చిరాకా ఎందుకో తగని బలే చిరాకా ॥నేడు॥
ఆమె : మొదట మగవారు వేస్తారు వేషాలు
పెళ్ళి కాగానే చేస్తారు మోసం
అతడు : ఆడవారంటే శాంత స్వరూపాలే
కోపతాపాలు రావండి పాపం
ఆమె : కోరి చేరిన మనసు చేత జిక్కిన అలుసు ॥కోరి॥
కడకు ఎడబాటు అలవాటు చేస్తారు
అతడు : నేడు శ్రీమతికి మాతోటి వివాదం
తగువే బలే వినోదం - ఎందుకో
తగువే బలే వినోదం ॥నేడు శ్రీమతికి॥
అతడు : వారి మనసైతే వస్తారు ఆడవారు
చేర రమ్మంటే రానేరారు
ఆమె : ఆ, ఆ... తెలుసుకున్నారు స్త్రీల స్వభావాలు
తెలిసి తీర్చారు ముద్దు మురిపాలు
అతడు : అలుక సరదా మీకు - అదే వేడుక మాకు ॥అలుక॥
కడకు మురిపించి గెలిచేది మీరేలే
ఇద్దరు : ప్రణయ కలహాల సరసాలె వినోదం
నిజమే బలే వినోదం... ఆ.. ఆ.. ఆ...
నిజమే బలే వినోదం.... ఆ....







# నేనూ నా పాటలు





అనుబంధాన్ని చాలా చక్కగా తీశారు. చక్కలిగింతలు పెట్టే సాహిత్యం, పిక్చరైజేషన్, మూమెంట్స్ కూడా ! నెక్ట్స్ నిలువవే వాలు కనులదానా.' దీనికి సంబంధించిన సంఘటన నాగేశ్వరరావుగారే చెప్పారు కాబట్టి నేను కూడా చెప్పవచ్చేమో - అదేమిటంటే అప్పటికే భార్యాభర్తలు విడిపోవటం, వారిద్దరి మధ్యా అగాధం ఏర్పడటం.... ఆ టైమ్‌లో హీరో మారువేషంలో వచ్చి భార్యను టీజ్ చేస్తూ పాట పాడటం ఏమిటీ వద్దంటారు నాగేశ్వరరావు గారు.. ఇక తాతినేని ప్రకాశరావు గారు మొండి పట్టు. నో ఈ పాట కంపల్సరీగా ఉండాల్సిందే. ఈ పాట సూపర్‌హిట్ అవుతుంది. నువ్వు చేయవల్సిందే అంటారు ఆయన. హీరో అంత బాధల్లో ఉంటే... హీరోయిన్ వెనుక టీజ్ చేస్తూ పాట ఏమిటి అని లాజికల్‌గా మాట్లాడారు నాగేశ్వరరావు గారు. అయితే ప్రకాశరావుగారు డైరక్టర్ కాబట్టి తీశారు, ఆ పాట పెట్టారు. ఆ పాట హిట్ అయింది. నిజంగా ఆ రోజుల్లో డైరక్టర్స్ విజన్ ఎంత గొప్పగా ఉండేదంటే ఒక్కోసారి ఆర్టిస్టులమైన మా ఆర్గ్యుమెంట్ తప్పనిపిస్తుంది. మరి 'ఈ నిలువవే వాలుకనులదానా' పాట ఎంత సూపర్‌హిట్ అయిందో తెలిసిందే కదా! అది కూడా ప్రేక్షకులు చాలా బాగా ఎంజాయ్ చేశారు. హీరో అంత బాధల్లో ఉండి కూడా మారువేషంలో వచ్చి భార్యను ఇలా టీజ్ చేస్తాడా అని ఎవరూ లాజికల్‌గా ఆలోచించలేదు. అంతే కాకుండా ఆ సినిమా 25 వారాల ఫంక్షన్స్‌కు వెళితే జనం ఎంత క్రేజ్‌గా ఆ పాట పాడుతూ రిసీవ్ చేసుకున్నారో.... -ఆ రోజుల్లో 100 రోజులు, సిల్వర్‌జూబ్లీ ఫంక్షన్స్ ఎంత బాగుండేవి - మొత్తం యూనిట్ అంతా నాలుగైదు కంపార్ట్‌మెంట్‌లు బుక్ చేసుకుని అన్ని సెంటర్స్‌లోనూ, జూబ్లీ ఫంక్షన్స్‌కు వెళ్లేవాళ్లం. ప్రతి స్టేషన్‌లోనూ అభిమానులు విపరీతంగా వచ్చేవాళ్లు. తలుపులు కొట్టడం, అభిమాన తారల్ని బయటకు రావలిసిందిగా కోరటం, వీళ్లేమో తలుపులు వేసుకుని లోపల కూర్చోవటం, తెల్లవార్లూ నిద్ర ఉండేది కాదు. అదొక థ్రిల్! నేనేమో 'అయ్యో జనం బయట వెయిట్ చేస్తున్నారు...' అంటూ చీటికి మాటికి బయటకు వెళ్లేదాన్ని. వెళ్లటంతోనే నిలువవే వాలు కనులదానా అంటూ ఇవే పాటలు. అట్లాంటి సూపర్ హిట్ సాంగ్ అది.

ఇంకొక పాట - 'అడిగిన దానికి చెప్పి' అని వస్తుంది. అది కూడా చక్కటి పాట. ఇంటలెక్చువల్ సాంగ్. మెదడుకు మేత లాగా... ప్రశ్నలు వేయటం.. అలాంటి అయితే అక్కడ సంఘటన ఏమిటంటే - హీరాలాల్ మాస్టర్ డ్యాన్స్ డైరెక్టర్. అప్పుడు హీరాలాల్ మాస్టర్ నెంబర్‌వన్. ఆయనంటే అందరికీ హడల్. ఆయన గురించి టాక్ ఏమిటంటే చాలా స్ట్రిక్ట్ అని, కోప్పడతారని... సరే నాకేమో డ్యాన్స్ సరిగ్గా రాదు. భయపడుతూనే సెట్లోకి వెళ్లాను. ఆయన్ని నాకు పరిచయం చేశారు. 'నమస్కారం సార్' అని.... 'సార్ నేను ప్రొఫెషనల్ డ్యాన్సర్‌ని కాను. కాస్త సింపుల్‌గా ఉండే స్టెప్స్ ఉంటే చెప్పండి... మళ్లీ నేను చేయలేకపోతే కోప్పడవద్దు. నన్ను భయపెట్టకండి. నేను తప్పు చేస్తే, అవి ఎలా చేయాలో చెబితే ప్రాక్టీస్ చేస్తాను'' అని చెప్పేశాను. మొట్టమొదట జీవితంలో ఓ వ్యక్తిని చూసి జమున భయపడింది అంటే అది హీరాలాల్ మాస్టర్‌కే ! కానీ పాపం ఆయన చాలా చక్కగా..."అలా ఎందుకమ్మా, నేను సింపుల్ స్టెప్స్ కంపోజ్ చేస్తానుగా" అన్నారు. దాంతో భయమంతా పోయింది. అదే హీరాలాల్ మాస్టారు 'ఏక్‌రాజ్' అనే హిందీ సినిమాలో నా చేత ఎంత మంచి డ్యాన్స్‌లు చేయించారో...

(ఆ విశేషాలు వచ్చే సంచికలో.... )

---

చిత్రం : ఇల్లరికం
సంగీతం : టి.చలపతిరావు
రచన : కొసరాజు
గానం : ఘంటసాల, సుశీల

వేణు : అడిగిందానికి చెప్పి - ఎదురాడక ప్రశ్నను విప్పి
నిల్చెదవా గెల్చెదవా - ఓహో చిన్నదానా
రాధ : అడిగిందానికి చెబుతా - ఎంతైనా పందెం గడతా
నిల్చెదనోయి గెల్చెదనోయ్ - ఓహో చిన్నవాడా
వేణు : ఒంటికాలిపై నుండి హఠయోగ ముద్రలోనుండి ॥ఒంటి॥
గుట్టుగ తన పని సాధించునది - వివరిస్తావా ఏదది
కోరస్ : అడిగిందానికి చెప్పి - ఎదురాడక ప్రశ్నను విప్పి
నిల్చెదవా గెల్చెదవా - ఓహో చిన్నదానా



రాధ : ముక్కు మూరెడే యౌను అది కొక్కొకొమని గొణిగేను ॥ముక్కు॥
కొంగ జపమని ప్రసిద్ధియేను ముందుకు వచ్చి కాదను
కోరస్ : అడిగిందానికి చెబుతాం ఎంతైనా పందెం గడతాం
నిల్చెదమోయ్ గెల్చెదమోయ్ ఓహో చిన్నవాడా
వేణు : వాయు వేగమును మించి లోకాలన్నీ గాలించి ॥వాయు॥
గడియలోననే ఉన్న చోటకే వడిగా చేరేదేదది



మొగవాళ్ళు : అడిగిందానికి చెప్పి ఎదురాడక ప్రశ్నను విప్పి
నిల్చెదవా గెల్చెదవా ఓహో చిన్నదానా
రాధ : రాకెట్టని అనుకోను అది స్ఫూత్నిక్కని అనలేను ॥రాకెట్టని॥
ముమ్మాటికి అది మనసేను ఇక - ముందుకు వచ్చి కాదను
కోరస్ : అడిగిందానికి చెబుతాం ఎంతైనా పందెం గడతాం
నిల్చెదమోయ్ గెల్చెదమోయ్ ఓహో చిన్నవాడా
వేణు : దానమిచ్చి చెడెనెవ్వడు
రాధ : కర్ణుడు
ఆడపిల్లలు : కర్ణుడు



వేణు : తప్పు తప్పు బలిచక్రవర్తి
మగవాళ్ళు : హేయ్ బలిచక్రవర్తి
వేణు : జూదానికి నిపుణుండెవ్వడు
రాధ : ధర్మజుడు
కోరస్ : ధర్మజుడు
వేణు : తప్పు తప్పు శకుని
మొగవాళ్ళు : హేయ్ శకుని



వేణు : అన్నదమ్ముల పోరాటంలో సందుచూచుకుని కూల్చిందెవడు
రాధ : భీముడు
కోరస్ : భీముడు
వేణు : తప్పు తప్పు రాముడు మొగవాళ్ళు : హేయ్ రాముడు - శ్రీరాముడు - శ్రీరాముడు

తెలుగు సినిమా నేపథ్య గాయనీమణుల జీవిత చిత్రాలు తెలిపే

# కొమ్మా కొమ్మా కోకిలమ్మా 6



- ఇంద్రగంటి జానకీబాల

## మాదీ స్వతంత్రదేశం.. టంగుటూరి సూర్యకుమారి

ఏ పాట పాడినా ఆమె జీవ లక్షణం దేశభక్తి. ఆమె గీత లక్షణం జాతీయత. ఆమె పేరు టంగుటూరి సూర్యకుమారి.



ఆమె ఏం పాడినా అది జాతీయ గీతం లాగనే వుంటుందనేది నిజం. ఆమె గళంలో పలికే భావం జాతీయ గీతానికి కావలసిన భావం. నటించడానికి సరిపోయే చక్కని రూపురేఖలు వున్నాయి. శ్రుతిలయలు, రాగభావాలూ గల కంఠం వుంది. ఇవి సూర్యకుమారి నటిగా, గాయకురాలిగా చెప్పుకునేందుకు ముఖ్యమైన లక్షణాలు.

టంగుటూరి సూర్యకుమారి 1925లో విజయవాడలో పుట్టారు. చిన్నప్పటి నుంచి సంగీతంలో, మధ్యలో నాట్యంలో మంచి శిక్షణ పొందారు. పెద్దనాన్నగారైన టంగుటూరి ప్రకాశంగారి వెంట వుంటూ, రాజకీయ మహాసభలో గళమెత్తి జాతీయ గీతాలు ఆలపించటంలో ఆమెకామె సాటనిపించుకున్నారు. ఆమె ఎన్నో దేశభక్తి గీతాలు, అష్టపదులు, ప్రేమగీతాలు ఓడియన్, కొలంబియా కంపెనీల కోసం రికార్డు చేశారు. సూర్యకుమారి, బాలాంత్రపు రజనీకాంత్ రావు, బసవరాజు అప్పారావు, దేవులపల్లి కృష్ణశాస్త్రి రాసిన ఎన్నో భావగీతాలు పాడారు.

ఆమె 'మరదలు పెళ్ళి' అనే సినిమాలో కథానాయికగా నటించటమే కాకుండా ఆ సినిమాకి వి.నాగయ్యతో బాటు సహ సంగీత దర్శకురాలిగా పనిచేశారు.

'రైతు బిడ్డ'లో కథానాయకుడి చెల్లెలు పాత్ర పోషించి పాటలు పాడారు.

చంద్రహాస, దేవత,దీనబంధు, భాగ్యలక్ష్మి, కృష్ణప్రేమ, భక్త రామదాసు మొదలైన తెలుగు సినిమాలతో బాటు కొన్ని తమిళ, కన్నడ సినిమాలు చేశారు. ఆమె నటించిన హిందీ సినిమాలు 'వతన్',' ఉడన్ ఖటోలా' .

ఆమె అమెరికాలో హిచ్‌కాక్ టి.వి. ప్రొడక్షన్‌తో కలిసి పనిచేశారు.

78 ఆర్.పి.ఎమ్.రికార్డులు తెలుగు, సంస్కృతం, తమిళం,గుజరాతీ భాషల్లో యిచ్చారు.



'భక్తపోతన'లో వి.నాగయ్య, టంగుటూరి సూర్యకుమారి

మాదీ స్వతంత్ర దేశం మాదీ స్వతంత్ర జాతి
భరతదేశమే మా దేశం భారతీయులం మా ప్రజలం ॥మాదీ॥
వింధ్య హిమవత్ శ్రీ నీలాదుల సంధ్యారుణిత నవాశలు మావి
గంగా గోదావరీస హ్యాజా తుంగ తరంగిత హృదయాల్ మావి ॥మాదీ॥
ఆలయమ్ముల శిల్పవిలాసం ఆరామమ్ముల కళాప్రకాశం
మొగల్ సమాధుల రసదర హాసం మాకు నిత్యనూత నేతిహాసం ॥మాదీ॥
అహింసా పరమో ధర్మః సత్యం వద ధర్మం చర....
ఆది ఋషుల వేదవాక్కులు మాగాంధి గౌతముల సువాక్కులు ॥మాదీ॥
స్వతంత్రతా భ్రాతృత్వాలు సమతా మా సదాశయాలు
జననీ ఓ స్వతంత్ర దేవీ కొనుమా నివాళులు మావి ॥మాదీ॥

కర్ణాటక సంగీతంలో కూడా ఒక రికార్డు యిచ్చారు.

ఆమెకు 'రాజాలక్ష్మీ' (మదరాసు) పురస్కారం లభించింది.

ఆమె మహాత్మాగాంధీ (డాక్యుమెంటరీ) లో పాడిన పాటలు అందర్నీ ఆకర్షించాయి. ఆమె సినిమా పరిశ్రమ నుండి విరమించుకుని విదేశాలకు వెళ్ళిపోయారు. లండన్‌లో డ్యాన్స్ స్కూలు స్థాపించి అక్కడే వుండిపోయారు.

ఆమె మెదట్లో కొన్ని సినిమాల్లో నటించినా, పాడినా ఆమెను సినిమా నటిగా, గాయనిగా చెప్పుకునే వీలు చాలా తక్కువ.

ఆమె కంఠం విచిత్రమైన పలుకుబడితో దేశభక్తిగీతాలు, జాతీయ గీతాలు పాడేందుకు ఎక్కువ అనువుగా వుంటుంది.

మా తెలుగు తల్లికీ మల్లెపూదండ (రచన శంకరంబాడి సుందరాచారి, సంగీతం ఆర్. సుదర్శనం) పాటనీ, టంగుటూరి సూర్య కుమారినీ విడదీసి చూడటం చాలా కష్టం

తర్వాత ఈ 'మా తెలుగు తల్లికి' పాటను ఎందరో గాయనీ గాయకులు పాడారు, కానీ సూర్యకుమారి పాడినదే అసలు సిసలు మా తెలుగు తల్లికి మల్లెపూదండ.

చిత్రం : కృష్ణప్రేమ
గానం : టంగుటూరి సూర్యకుమారి (నారదుని పాత్రలో)
సంగీతం : గాలి పెంచల నరసింహారావు
రచన : తాపీ ధర్మారావు

నీ సరి దేవతలేరి యేరి
నటన సూత్రధారీ
దాసజనావళి దయతో కాచెదు
దోషుల కాలను రాసె దహోహో
వేదములకు నీ పాదము పట్టక
రాదుకదా విలువ అయనను
ఏదియునేరని నానిగ నాడుదు
వాదనకా యిది శౌరీ

చిత్రం : మరదలు పెళ్లి
గానం : టంగుటూరి సూర్యకుమారి
సంగీతం : వి. నాగయ్య -టి.సూర్యకుమారి
రచన : శ్రీ శ్రీ

జాబిల్లీ
జలరాశి కెరటాలు
జిలుగు వెన్నెల చిలికి
ప్రేమ సీమల్లోని
పిలుపు వినిపించేవు
మబ్బు తెరచాటేల జాబిల్లీ
మాయమర్మములేల జాబిల్లీ
మనసు నిలకడలేని జాబిల్లీ
కలువ కన్నెల నెల్ల
వలపించి మురిపించి
గిలిగింత గొల్పునీ
మృదువైన హృదయాన
మచ్చయే లేనిచో
మరియెంత వెలిగేవో జాబిల్లీ

# హిందీ సినీ సంగీతంలో మలుపులు-మజిలీలు

## 1964

లక్ష్మీ-ప్యారేలు 'ఆయా తుఫాన్' చిత్రంతో నాలుగో హిట్ కొట్టారు. ఈ చిత్రంలో 'హమ్ ప్యార్ కియే జాయేంగే, కోయీ రోక్ సకే తో (లతా), 'అభి కమ్‌సిన్ హో నాదాన్ హో జానేజానా'(రఫీ) పాటలు హిట్ అయ్యాయి. ఇదే సంవత్సరం 'అభి కమ్‌సిన్ హో నాదాన్ హో జానేజానా' పాట సాహిత్యానికి అతి దగ్గరగా ఉన్న 'తుమ్ కమ్‌సిన్ హో నాదాఁ హో' పాటను 'ఆయీ మిలన్ కి బేలా' చిత్రంకోసం రఫీ, శంకర్-జైకిషన్ స్వరనేతృత్వంలో పాడటం విశేషం.

'ఆయీ మిలన్ కి బేలా' చిత్రం కోసం శంకర్-జైకిషన్ స్వరపరిచిన 'మై కమ్‌సిన్ హూ' (లతా), 'బురా మాన్ గయే, ప్యార్ ఆంఖోఁ సే జతాయా'(రఫీ), 'తుమ్హే ఔర్ ఔర్ క్యా దూఁ మై'(లతా), 'ఓ సనమ్ తేరే హోగయే హమ్'(లతా, రఫీ), టైటిల్ ట్రాక్ 'ఆ హ ఆయీ మిలన్ కి బేలా దేఖో...'(ఆశా, రఫీ) పాటలు మంచి పేరు తెచ్చుకున్నాయి. అయితే ఈ చిత్ర నిర్మాత జె. ఓం ప్రకాశ్ తన తదుపరి చిత్రం 'ఆయే దిన్ బహార్ కే' కోసం లక్ష్మీ-ప్యారేల వైపు మొగ్గు చూపటం విచిత్రం. అయితే ఈ చిత్రం రెండు సంవత్సరాల తర్వాత విడుదలైంది.

శంకర్-జైకిషన్ లు 'సంగం', 'రాజ్‌కుమార్' చిత్రాలతో డబుల్ సక్సెస్ సాధించారు. అతి చక్కటి మెలోడీలతో రూపుదిద్దుకున్న ఈ చిత్రాలలోని గీతాలు చరిత్రలో శాశ్వతత్వాన్ని పొందాయి. సంగం చిత్రంలోని 'ఓ మేరే సనమ్'(లతా, ముకేష్), 'దోస్త్ దోస్త్ న రహా'(ముకేష్), 'యే మేరా ప్రేమ్ పత్ర్'(రఫీ), 'హర్ దిల్ జో ప్యార్ కరేగా'(లతా, ముకేష్, మహేంద్రకపూర్), 'బోల్ రాధా బోల్'(ముకేష్, వైజయంతిమాల), 'ఓ మెహబూబా'(ముకేష్), 'రాజ్‌కుమార్' చిత్రంలోని 'జానేవాలే జరా హోషియార్, యహాఁ కే హమ్ హై రాజ్‌కుమార్'(రఫీ), 'దిల్‌రుబా దిల్ పే తు'(ఆశా, రఫీ), 'ఆజా ఆయీ బహార్'(లతా), 'తుమ్‌నే కిసికీ జాన్ కో'(రఫీ), 'ఇస్ రంగ్ బదల్తీ దునియా'(రఫీ), 'నాచ్ రే మన్ బతకమ్మా'(ఆశా, లతా), 'తుమ్‌నే పుకారా ఔర్ హమ్ చలే ఆయేం'(సుమన్, రఫీ) పాటలను మరిచిపోగలమా !?

'జిందగీ' చిత్రం కూడా శంకర్-జైకిషన్‌లకు చక్కటి పేరు తీసుకువచ్చింది. మొత్తం 12 పాటలున్న ఈ చిత్రంలోని 'గుంగర్‌వా మోరా ఛమ్ ఛమ్'(ఆశా, రఫీ), 'పహలే మిలే యే సప్నోంమేఁ ఔర్ ఆజ్ సామ్‌నే పాయా'(రఫీ), 'హమ్‌నే జఫా నా సీఖీ'(రఫీ), 'ముస్కురా లాడ్లే ముస్కురా'(మన్నాడే) పాటలతో పాటు 'సాంఝ్ ఔర్ సవేరా' చిత్రంలోని 'అజాహూఁ న ఆయే



'సంగం'లో రాజ్‌కపూర్, వైజయంతీమాల, రాజేంద్రకుమార్

బలమా'(సుమన్, రఫీ), 'ఓ సజనా మేరే ఘర్ అంగనా'(లతా), టైటిల్ సాంగ్ 'సాంఝ్ ఔర్ సవేరా'(ఆశా, రఫీ) మంచి హిట్ అయ్యాయి.

'ఏప్రిల్‌ఫూల్' చిత్రంలో 'మేరా నామ్ రీటా క్రిస్టినా'(లతా), 'ఆ గలే లగ్ జా'(రఫీ), టైటిల్ ట్రాక్ 'ఏప్రిల్ ఫూల్ బనాయా'(రఫీ), అలాగే 'బేటీ బేటే' చిత్రంలోని 'ఆజ్ కల్ మేఁ ఢల్ గయా'(లతా), 'రాధికే, తూనే బన్సారీ చురాయీ'(రఫీ), పాటలు శంకర్-జైకిషన్‌లకు మంచి పేరును తీసుకువచ్చాయి.

శంకర్-జైకిషన్, లక్ష్మీ-ప్యారేల తర్వాత కళ్యాణ్‌జీ -ఆనంద్‌జీల జంట మూడు చక్కటి హిట్‌లను సాధించారు. 'ఇశారా' చిత్రంలో 'చల్ మేరా దిల్ లహరా కే చల్'(ముకేష్), 'దిల్ బేకరార్ సా హై'(రఫీ), 'దుల్హా దుల్హన్' చిత్రంలో 'హమ్నే తుజ్‌కో ప్యార్ కియా హై జిత్‌నా'(లతా), 'జీ చాహతా హై' చిత్రంలో 'హమ్ ఛోడ్ చలే హైఁ మెహఫిల్'(ముకేష్) చెప్పుకోదగ్గవి.

(వచ్చే సంచికలో మరికొంత)

# హాసం క్లబ్ విశేషాలు

## హైదరాబాద్

హైదరాబాద్ 29 మే ఆఖరి శనివారం మూడవ కార్యక్రమం జరిగింది. చి॥ చైత్ర అత్యద్భుతంగా పాడిన 'అందేనా చేతులకందేనా" (పూజాఫలం) పాటతో ప్రారంభమయింది. జమీందారు బిడ్డను వలచిన గుమాస్తా కూతురు అన్యాపదేశంగా చందమామ గురించి పాడిన ఈ దేవులపల్లి పాట ఎంచుకోవడంలో విశిష్టతను వ్యాఖ్యాతగా వ్యవహరించిన యస్వీ రామారావు ప్రశంసించారు. తదుపరి సవితాశర్మ, కమలశ్రీ, ఎమ్మెల్ చారి, ఎమ్వీ ప్రసాద్, మైథిలి, వీరాస్వామి, అరుణ్‌తేజ పాటలు పాడారు. శ్రీనివాసాచారి జానపదహాస్యగీతంతో బాటు విచిత్రవార్తలు వినిపించారు. సి.కమల 'హాసం'పై వచనకవిత, గతసారి కంప్యూటరు దండకం చదివిన చి॥ వంశీకృష్ణ గరికపాటి వ్రాసిన ఆవకాయపై హాస్యపద్యం, సంగీతరాగాలతో కూర్చిన గద్యం, ధర్మాచార్యులు చాదస్తపు భార్యపై హాస్యగల్పిక వినిపించారు. రేడియో కార్యక్రమాల్లో వేసే అరిగిపోయిన రికార్డుల తీరుతెన్నులను దుర్గాప్రసాద్ అనుకరించి చూపగా, పశుపక్షులు తెలుగు, హిందీ, ఇంగ్లీసు మాట్లాడితే ఎలా ఉంటుందో మోహనకృష్ణ చూపారు. కెబి శర్మ, బి.సాంబశివశాస్త్రి, చి॥ లక్ష్మి జోక్స్‌తో సభను రక్తి కట్టించారు. మద్రాసు హ్యూమర్‌క్లబ్ సభ్యులు సాంబశివశాస్త్రి కొన్ని జోకులు చెప్పడంతో బాటు 'హాసం క్లబ్'ను కృషిని కొనియాడారు. 'అర్థం చేసుకుందాం - ఆస్వాదిద్దాం' కాలమిస్టు పి.వి.సత్యనారాయణరాజు మజ్రూసుల్తాన్‌పురి కవితాపటిమ ను వివరించి ఉదాహరణగా 'మేరే భీగిభీగిసీ (అనామికా)' పాటను వినిపించి పాటసాహిత్యాన్ని విశ్లేషించారు. వేణుమాధవ్ ఆత్మకథ పుస్తకాన్ని 'హాసం' దుర్గాప్రసాద్‌కు బహుమతిగా అందజేయగా అచ్చిరెడ్డి, కృష్ణారెడ్డిల కానుకగా 'అతడే ఒక సైన్యం' సిడిని చైత్ర, మైథిలి, శ్రీనివాసాచారిలకు ఇవ్వడం జరిగింది. స్టేటు కన్వీనరు యస్.వి.రామారావు ఆద్యంతం చక్కని వ్యాఖ్యలతో సభను నిర్వహించారు. ఈ కార్యక్రమాన్ని ఈటీవీ 2 వారు 01 06 2004 ఉదయం 'కళాంజలి'లో ప్రసారం చేశారు. జూన్ నెల కార్యక్రమం ఆఖరి శనివారం సాయంత్రం 6.35 గం॥లకు నారాయణగూడలోని 'ఆంధ్ర బాలానంద సంఘం' (ఫోన్ నెం.27661209)లో జరుగుతుంది.


బి.శ్రీనివాసాచారి


దుర్గాప్రసాద్


మోహనకృష్ణ

### చింతిస్తున్నాం....

- 'టైమ్ మేనేజ్‌మెంటు' సెమినార్ అధ్యక్షుడు సమయానికి రాని కారణంగా ప్రోగ్రాం ఆలస్యంగా ప్రారంభమయినందుకు చింతిస్తున్నాం...
- 'గుండె జబ్బులు - సులభ నివారణ పద్ధతులు' అంశంపై ప్రసంగించ వలసిన డాక్టరు హృదయనాథ్ మంగేష్ ఉదయమే హార్ట్ ఎటాక్‌కు గురి కావడం వలన కార్యక్రమం రద్దు చేస్తున్నందుకు చింతిస్తున్నాం...
- జంక్షన్‌లో ఏర్పాటు చేసిన 'రోడ్డు భద్రతా వారోత్సవాల' బోర్డు కూలి పాదచారులపై పడినందుకు రోడ్డు, రవాణా శాఖ మంత్రి చింతిస్తున్నారు...
- 'కల్తీ నివారణ' సదస్సులో అందించబడ్డ కలుషితాహారం తిని పన్నెండుమంది అస్వస్థత పాలయినందు వల్లన సదస్సు వాయిదా పడిందని తెలుపుటకు చింతిస్తున్నాం..
- తమ సంఘం ప్రారంభించడానికి అంతా సిద్ధంగానే ఉన్నా మంచిముహూర్తం దొరకకపోవడం వల్ల ఆలస్యమవుతున్నందుకు చింతిస్తున్నామని 'హేతువాదుల సంఘం' కార్యదర్శి తెలిపారు..
- 'టెన్షన్ ఎదుర్కోవడం ఎలా?' సభకు వక్తగా హాజరయిన డాక్టర్ ప్రశాంత్ నిర్వాహకులు ఇస్తానన్న ఫీజు ఇవ్వకపోవడంతో ఆందోళనకు గురయి స్పృహతప్పి పడిపోయారని తెలుపుటకు చింతిస్తున్నాం...
- 'జీవకారుణ్య సంఘం' వార్షికోత్సవంలో వడ్డించిన కుందేలు మాంసం తమదాకా రాలేదన్న కోపంతో పలువురు ప్రదర్శనకు దిగడంతో ఉత్సవ వేడుకలు అర్థాంతరంగా ముగిసాయని తెలుపుటకు చింతిస్తున్నాం...

- బి.శ్రీనివాసాచారి

'హాసం క్లబ్స్' ప్రారంభించదలచిన వారు సంప్రదించవలసినది -
శ్రీ ఎస్.వి.రామారావు, 040-2416 0279, 98491 39030

## పలాస

మే 29, ఆఖరి శనివారం సాయంత్రం గం॥ 6-30 ని॥ల నుండి రెండుగంటలపాటు వివేకానంద కాలనీలో డా॥ రామినాయుడు ఆసుపత్రి మేడపై ఆహ్లాదభరితంగా జరిగిన 'హసం క్లబ్' కార్యక్రమం కిమ్మోజీ ప్రార్థనాగీతంతో ప్రారంభమయింది. ముఖ్య అతిథిగా వచ్చిన డి.ఆంజనేయమూర్తి జీవితాన్ని ఆనందమయము, నందనవనంగాను చేసుకోవడానికి నవ్వు, సంగీతాలకు మించిన సాధనాలు లేవన్నారు. సిహెచ్.కామేశ్వరరావు 'హసం' పై తాను రాసిన కవితను విని పించారు. శ్రీనివాస బాబ్జీ మిమిక్రీతో, ఛలోక్తులతో చక్కని నవ్వులు పండించారు.



జోక్ చెప్తున్న డా॥ ఎస్.కె.వి.శాస్త్రి, కార్యక్రమం నిర్వహించిన కన్వీనరు డా॥ రామినాయుడు

డా॥ ఎస్.కె.వి.శాస్త్రి, డా॥ వి.ఆర్. సోమేశ్వరరావు, బూర్ల కోటేశ్వరరావు, సిహెచ్.వి.కె.పట్నాయక్, రాజశేఖర్, కాళిదాసు మున్నగువారు పాల్గొన్న ఈ సభలో రమణమూర్తి ఉత్తమజోకు చెప్పి బహుమతి గెల్చుకున్నారు. జూన్ నెల కార్యక్రమం ఆఖరి శనివారం **అంటే 26న అదే చోట జరుగుతుందని** కన్వీనరు డా॥రామినాయుడు తెలిపారు.

ఓ కొండచరియమీద ఓ గొల్లపిల్లవాడు గొర్రెలు కాచుకుంటున్నాడు. మన రాష్ట్రప్రభుత్వాలకు విజన్ నేర్పించే మేధావుల డ్రెస్ వేసుకున్న ఒక యువకుడు అటువైపు వచ్చాడు. "నీ మందలో ఎన్ని గొర్రెలున్నాయో కరెక్టుగా చెప్తాను. నా ఆన్సర్ కరక్టయితే నాకో గొర్రె ఫ్రీగా ఇవ్వాలి మరి" అన్నాడు.

గొల్లబ్బాయి సరేనన్నాడు. వచ్చిన కుర్రాడు బ్యాగ్‌లోంచి ల్యాప్‌ట్యాప్ బయటకు లాగాడు, శాటిలైట్‌కి కనక్టు చేశాడు, రెండుమూడు సాఫ్ట్‌వేర్లు ఉపయోగించి అరగంటసేపు కుస్తీపట్టి 'నీ దగ్గర 583 గొర్రెలున్నాయి' అని చెప్పాడు. 'సరిగ్గానే చెప్పారు' అని కుర్రాడు అనగానే 'అయితే పందెం ప్రకారం ఈ గొర్రెను తీసుకుంటా' అని ఓ దాన్ని చంకన పెట్టుకుని వెళ్లబోతూండగా,

'సార్ మీరెవరో నేను కరక్టుగా చెప్పారనుకోండి, అది నాకు వెనక్కిచ్చేస్తారా?' అడిగాడు గొల్లబ్బాయి.

'చెప్పు చూదాం' అన్నాడు యువకుడు.

'మీరు మేనేజిమెంటు కన్సల్టెంటు కదూ'

'అరే, భలే చెప్పావే! ఎలా కనుక్కున్నావ్!'

'ఈజీగానే తెలిసింది సార్, ఒకటి - మీ అంతట మీరే వచ్చారు, రెండు - ప్రశ్నా మీరే వేశారు, జవాబూ మీరే కనుక్కున్నారు, మూడు - నాకు తెలిసున్నదానినే నాకు చెప్పి అలా చెప్పినందుకు చార్జీలు అడుగుతున్నారు. అన్నిటికన్నా ముఖ్యమైనది - నేను గొర్రెలు ఎలా కాస్తానో రెండేళ్లలో నా మంద రెట్టింపెలా అయిందో మీకు తెలియదు, తెలుసుకోవాలన్న ఉద్దేశమూ లేదు. అందువల్ల మీరెవరో తెలిసింది..అయిందా.., ఇక మీరు గొర్రె అనుకుని చంకన బెట్టుకున్న నా కుక్కపిల్లను నాకు వెనక్కి ఇచ్చేసి మీ దారి మీరు చూసుకోండి"

## జగ్గంపేట

జూన్ 6 మొదటి ఆదివారం సాయంత్రం 'నైన్' కోచింగ్ సెంటర్ ఆవరణలో జిల్లా గ్రంథాలయ చైర్మన్ ఎన్.వి.ఎన్. అప్పలరాజు చేతులమీదుగా 'హసం క్లబ్' ప్రారంభమయింది. కంది కల్యాణి, సాయి మణికంఠ ప్రార్థనా గీతంతో మొదలయిన ఈ కార్యక్రమం కన్వీనర్ నూజిళ్ల సూర్యనారాయణ వ్యాఖ్యానంతో, పాటలతో రక్తి కట్టింది. అప్పలరాజు మాట్లాడుతూ ఈ యాంత్రికజీవనంలో మనిషి రోజులో కనీసం కొంతసమయమైనా హాస్యాన్ని, సంగీతాన్ని ఆస్వాదించడం ద్వారా ఆరోగ్యంగా, చలాకీగా ఉండే అవకాశం ఉందని అన్నారు.



ప్రారంభోత్సవంలో ప్రసంగిస్తున్న అప్పలరాజు, అటూ ఇటూ కన్వీనర్లు సూర్యనారాయణ, శాస్త్రి

వాకర్స్‌క్లబ్ ప్రెసిడెంట్ కొత్త కొండబాబు, పొన్నపల్లి ఉషాదేవి, కొత్త మాధురి, ఎన్.లక్ష్మీదుర్గ, దుర్గారావు, సిటీకేబుల్ ఎం.డి.అడపా వెంకటరావు, కెమెరామన్ జి.రామకృష్ణ, పీలామహేష్ తదితరులు పాల్గొన్న ఈ సభలో అనేకమంది జోక్స్, స్కిట్స్, పాటలు సమర్పించారు. ఎన్.సూర్యనారాయణ, సాయిమణికంఠ పాల్గొన్న 'మొద్దబ్బాయ్', స్కిట్ జిమ్మీ ప్రదర్శన హైలైట్‌గా నిలిచింది. **ప్రతినెలా మొదటి ఆదివారం నాడు కార్యక్రమాలు జరుగుతాయని** కన్వీనర్లు నూజిళ్ల సూర్యనారాయణ (ఫోన్ - 08852-234185) పి.వి.రామాంజనేయశాస్త్రి (08852-233209, 234414) తెలిపారు.

## వినబడిన జోక్స్

✦ లాలూప్రసాద్ యాదవ్ గారు బారుకి వెళ్లారు. గుమ్మం దగ్గర వేరెవరో అటువైపునుండి వస్తుంటే దర్వాన్ ఈయన్ని ఆపడానికి 'వెయిట్' అన్నాడు. '70 కిలోస్' అని చెప్పేసి దర్జాగా ముందుకు సాగాడు లాలూ. లోపలికి వెళ్లాక ఈ పక్కటేబుల్ వాడు 'జానీవాకర్, సింగిల్' అనీ ఆ పక్కటేబుల్ వాడు 'పీటర్ స్కాట్, సింగిల్' అనీ ఆర్డరివ్వడం విన్నాడు. అక్కడ బరువు అడిగారు. ఇక్కడ పేరు, మారిటల్ స్టేటస్ చెప్పాలి గాబోసు అనుకుని వెయిటర్ రాగానే 'లాలూప్రసాద్ యాదవ్, మ్యారీడ్' అని చెప్పి గట్టిగా ఊపిరి పీల్చుకున్నాడు.

✦ టీ తాగడానికి బస్సుదిగి వెళ్లివచ్చిన ఆర్టీసీ బస్సు డ్రైవరుకు గేర్ రాడ్ ఎక్కడా కనబడలేదు. ఉన్నట్టుండి ఎలా మాయమయిందో కండక్టరు కూడా చెప్పలేకపోయాడు. ఐదు నిమిషాలపాటు వాళ్లను హడావుడి పడనిచ్చి డ్రైవరు వెనకాల ఉన్న పాసెంజరు ఫకాలున నవ్వాడు - "బస్సెక్కిన కాణ్నుంచి చూస్తున్నాను. దాన్ని విరక్కొట్టాలని అటుతిప్పి ఇటు తిప్పి, వెనక్కి తిప్పి, ముందుకు తిప్పి మహా అవస్థ పడుతున్నావు. పోనీ ఏదో హెల్పుసాయం చేద్దామనుకున్నాను. నువ్వు అలా దిగగానే ఇలా విరక్కొట్టి నీ సీటుకిందే ఎట్టాను. సాయం చేసిన పుణ్యాత్ముడికి ఓ దండం అనుకోకుండా కంగారుపడి సత్తారేమిటయ్యా బాబూ" అని.

✦ ఓ ఇద్దరు ఇల్లరికపు తోడల్లుళ్లకు అత్తగారి జన్మదిన సందర్భంగా ఏమైనా బహుమతి ఇస్తే బాగుండుననిపించింది. భార్యల నడిగితే చెవిరింగులు కొనమని డబ్బిచ్చారు. బజార్లో బంగారంకొట్టు రష్‌గా, ఎదురుగా ఉన్న బారు ఖాళీగా కనబడింది. కాస్సేపు కూచుని వద్దామని బారుకెళ్లి మందుకొట్టారు. చూస్తూండగానే డబ్బంతా హరించుకుపోయింది. చిన్నల్లుడు ఖంగారుపడ్డాడు "ఇలా అయితే అత్తగారికి ఏం ఇవ్వగలం అన్నయ్యా" అని.

అనుభవజ్ఞుడైన పెద్దల్లుడు తొణకలేదు. "రింగుల విషయం ఎనౌన్స్ చేసేద్దాం. ఇన్‌స్టాల్‌మెంటులో ఇన్నున్నామని చెబుదాం. ఫస్ట్ ఇన్‌స్టాల్‌మెంటుగా ఈ ఏడాది చెవికి కన్నాలు పొడిపిద్దాం. రింగుల సంగతి వచ్చే ఏడాది చూసుకుందాం."




# పెళ్ళిపుస్తకం

దర్శకత్వం : బాపు

స్క్రీన్‌ప్లే-మాటలు-నిర్మాత
**ముళ్లపూడి వెంకటరమణ**

**నవలీకరణ**
ఇలపావులూరి మురళీమోహనరావు

వెండితెర నవల
**9**

**జరిగిన కథ**

మధ్యతరగతికి చెందిన కృష్ణమూర్తి, సత్యభామలకు పెళ్లవుతుంది. ఒకే ఊరిలో ఉండాలని శ్రీధరం కంపెనీలో ఉద్యోగాలలో చేరతారు. చేరడానికి తామిద్దరం భార్యాభర్తలు కాదని చెప్పవలసి వస్తుంది. కృష్ణమూర్తి బ్రహ్మచారి అనుకుని శ్రీధరరావు కూతురు వసుంధర అతన్ని అభిమానిస్తూ ఉంటుంది. భామకు ఇది కంటగింపుగా ఉంటుంది. శ్రీధరం బావమరిది గిరి సత్యభామపై కన్నేస్తాడు. యజమానురాలి కోరిక మేరకు వసుంధరకు డ్యాన్స్ నేర్పటానికి ఒప్పుకుంటుంది భామ. -(ఇక చదవండి)

దెబ్బ తగిలిన చోట తమలపాకుల్లాంటి చేతులతో స్పృశించింది భామ. ఆ చలువకు నెప్పి మటుమాయం.

"హ...హ....హ....కంగారు పడకండి. అయినా అతను మీరను కున్నంత చెడ్డవాడు కాదండీ" నవ్వింది భామ.

"మంచి-చెడ్డలు రాసులు పోసినట్లు వేరు వేరుగా ఉండవు. అవసరాన్ని బట్టి మంచితనం అవకాశాన్ని బట్టి చెడ్డతనం పెరుగుతుంటాయి" భామను పక్కకు నెట్టేసి లేచి బయటకు వెళ్ళిపోయాడు కృష్ణమూర్తి.

భర్త భయం అర్థంచేసుకుంది భామ. ఈ కొత్త బాధ్యత మూలంగా తాము ఒకరికొకరు దూరంగా ఉండాల్సిరావడమే కాక గిరి నుంచి ఎలాంటి ముప్పు ఎదురౌతుందోనని అనుమానం కూడాను. కానీ ప్రస్తుతం తామున్న పరిస్థితులలో ఒక్కరూపాయి ఆదాయాన్ని కూడా త్యాగం చెయ్యడం కష్టం. భర్తను ఓదార్చడం, ఒప్పించడం తన కర్తవ్యం. కృష్ణమూర్తి వెనుకే భామ కూడా బయటకొచ్చింది.

"ఈ కొటేషన్ కూడా బాగుందండీ. నన్ను విడిచి పెట్టి ఉండలేనని ఒప్పేసుకోరాదూ" అన్నది.

"నన్ను విడిచి పెట్టి ఉండగలవని నువ్వు ఒప్పేసుకున్నావుగా" ముఖం ముటముట లాడించాడు కృష్ణమూర్తి.



"ఆఁ...సోమవారం నుంచి శుక్రవారం దాకా ఉండగలను. శనివారాలు మాత్రం ఉండలేను. మా వారు మంచం పట్టి వుంటారు కదా. పతి సేవ చేసుకోవాలి" అంటూ నవ్వింది భామ.

వెనక్కు తిరిగాడు కృష్ణమూర్తి.

పక పక నవ్వింది భామ.

ఆ పసితనాన్ని చూసేసరికి కృష్ణమూర్తి కోపం మంచు ముక్కలా కరిగింది.

తాను నవ్వాడు .

ఇద్దరూ కలిసి నవ్వారు ఆనందపు అలల్లా.

* * *

తిండిపెట్టి పోషించేవాడు ఏ ఆదేశమిచ్చినా చచ్చినట్లు పాటించక తప్పదుకదా ఎవరికైనా! అందునా యజమానిగారి భార్య... యజమాని మీద యజమాని ! ఇష్టమున్నా లేకపోయినా నోరు మాత్రం ఆటోమేటిగ్గా 'అలాగే ...చిత్తం' అంటుంది.

వసుంధరకు డాన్సు నేర్పమని మంగళ అభిమాన పూర్వకమైన ఆదేశాన్నిచ్చింది. భామకు వసతి, భోజన తాంబులాది సౌకర్యాలన్నీ ఏర్పాటు చేసింది. పదిపచ్చకాగితాలు పూలల్లో పెట్టిఇచ్చింది. ఇక కుదరదని అనడానికి వీలేదాయె! కాకపోతే పతిదేవుడికి దూరంగా ఉండాల్సివస్తుంది. అదొక్కటే బాధ! కరెన్సీ కాగితాలు ఎంత మహిమాన్వితమైనవి! మనుషుల్ని కలుపుతాయి. విడదీస్తాయి.

వసుంధర డాన్స్ నేర్చుకోవడానికి అన్ని ఏర్పాట్లు చెయ్యబడ్డాయి. వసుంధర కూడా రెడీ అయింది. మృదంగం మోగింది. భామ అడుగులు నర్తించసాగాయి.



తాంతరి తక ఝుణు
తాంతరి తక ఝుణు
తాంతరి తక ఝుణు
తాం తాం తాం
తధీం గిణత ఝుణు
తధీం గిణత ఝుణు

వసుంధర కూడా డాన్సు ఆరంభించింది. భామ మీద కన్నేసిన గిరి- అహల్య పాలిట సహస్రాక్షుడిలా - కెమెరా పట్టుకుని భామను వివిధ రకాల భంగిమలో ఫోటోలు తియ్యడానికి ప్రయత్నిస్తున్నాడు వారిద్దరూ చూడకుండా.

తోంధికి తక ఝుణు
తోంధికి తక ఝుణు - తళాంగు
తకధికి తక తరిగిట తోం

కృష్ణం - కలయ సఖి సుందరం
బాలకృష్ణం కలయ సఖి సుందరం
కృష్ణం గత విషయ తృష్ణం
కృష్ణం గత విషయ తృష్ణం
జగత్ప్ర భ విష్ణుం
సురారి గణ జిష్ణుం
సదా బాల కృష్ణం
కలయ సఖి సుందరం
తద్దరి తద్దన తరుణు తద్ధిమి
తకతరి తద్ధన తక తరికిటతోం
తధీంత తనోంత ఘదీంత తకాంత
తనోంత తధోంత తకధినతాం
తధీంత తరుుంత తక తరికిటతోం తక తరికిట తోం తక తరికిట తోం
శృంగాన రసభర - సంగీత సాహిత్య
శృంగార రసభర సంగీత సాహిత్య
గంగాల హరిఖేల - సంగం సదా
బాలకృష్ణ కలయ సఖిసుందరం
బాలకృష్ణం కలయ సఖి సుందరం





ఇక్కడ వీరి నృత్యసాధన ఇలా సాగుతుండగా అక్కడ ఆరుబయట శ్రీధరం, కృష్ణమూర్తి షటిల్ ఆడుతున్నారు. పాపం- కృష్ణమూర్తి ఎంత దరిద్రంగా ఆడిపోదామను కుంటున్న వీలుకావడంలేదు. తాను గెలిస్తే యజమానికి ఆగ్రహం వస్తుందేమో? అందుకే వీలైనంతవరకూ చెత్తషాట్లు కొడుతున్నాడు. కానీ అవతల ఆటగాడు అంతకంటే...? మధ్య మధ్య పానీయంలా భామ, వసుంధరల ప్రాక్టీస్ కూడా చూస్తున్నారు.

ధిత్తాం ధిమితాం - కిటతకు తళాంగు తకధిమి
తకు తరికిటతోం
ధిత్తా ధిమితా ధిమితా కిటతక
ధిత్తా ధిమితా ధిమితా కిటతక
తథిగిణతోం - తథిగిణతోం- తథిగిణతోం

ఇద్దరి మధ్యా కెమెరా పట్టుకుని తిరుగుతూ భామపోటోలు తియ్యాలని విశ్వ ప్రయత్నం చేస్తున్నాడు గిరి. కానీ వీలుకావడంలేదు.



రాధారుణాధర సుధామం
సచ్చిదానంత
రాధా రుణాధర సుధామం
సచ్చిదానంద రూపం జగత్రయ
భూపం సదా బాలకృష్ణం
కలయ సఖీ సుందరం
బాలకృష్ణం కలయ సఖీ సుందరం

వీరి డాన్సు చూస్తూ ఆనందంగా నవ్వుతున్నాడు శ్రీధరం. కుమార్తె షోడశ కళా ప్రపూర్ణురాలు కావాలని కదా ఆయన కోరిక! అటు చూస్తూనే ఇటు కృష్ణమూర్తితో షటిల్ ఆడుతున్నాడు.

తళాంగుం తోం - తత్తక తధీగిణతోం
తళాంగుం తోం -
తత్తరి కిట తరికిట
తరితాకిట
తళాంగుతోం
తధిగిణతోం -
తధిగిణతోం తధిగిణతోం
శిధిలీకృతానర్థం
శ్రీనారాయణ అర్థం-



శిధిలీకృతానర్థం
శ్రీనారాయణ తీర్థం
పరమపురుషార్థం
సదాబాలకృష్ణం కలయసఖీ
సుందరం - బాలకృష్ణం
తద్దరి తరుణ తరుణు తద్ధిమి
తోంగట తక తక తరికిట తక
తదిగిణతోం
తాంగట తక తరికిట తక
తదిగిణతోం -
తాంగట తిక తరికిట తక
తదిగణతోం



ఇద్దరూ నృత్యం చేస్తూండగా పట్టుదలగా గిరి కెమేరాతో భామ అందాలను బంధించాలని ప్రయత్నిస్తున్నాడు. భామ డాన్సు చేస్తూ ఒక భంగిమలో కాలుపైకెత్తగా ఆ తాకిడికి కరాటే దెబ్బతిన్నవాడిలా వెల్లికిలా పడిపోయాడు గిరి. ఫొటో సంగతి దేవుడెరుగు మాడుమాత్రం బొప్పిగట్టింది. భామ ఆయాసంతో కూర్చుండిపోయింది. ఇదే సమయమనుకుని - ఈ డాన్సుగోల మీద ఏమాత్రం ఇష్టం లేని వసుంధర షటిల్ చూసే నెపంతో కృష్ణమూర్తి దగ్గరకు వెళ్ళింది.

శ్రీధరం, కృష్ణమూర్తి చక్కగా ఆడుతున్నారు. శ్రీధరం షాట్‌కొట్టినపుడల్లా 'లౌలీ...లవ్లీషాట్ 'అంటున్నాడు కృష్ణమూర్తి. కృష్ణమూర్తి వంక చూస్తూ నవ్వుతున్నది వసుంధర. తన పతిదేవుడివంక చూస్తూ పదేపదే వసుంధర అలా నవ్వుతుంటే భామకు అరికాల్లో మండింది. కృష్ణమూర్తి కూడా వసుంధర వంక చూస్తూ 'లవ్లీ....లవ్లీ.....ఫైవ్ ..సిక్స్ 'అంటూ స్కోర్ చదువుతున్నాడు. అందమైన పడుచు పక్కన వుంటే కుర్రాళ్లకు హుషారు పెరక్కుండా ఉంటుందా? తన భర్త కూడా అంతేననుకుని పళ్ళు పటపట కొరుక్కుంది భామ.



వసుంధరను చూస్తూ షాట్‌కొట్టాలని పైకెగిరాడు కృష్ణమూర్తి. కాలుజారి కిందపడ్డాడు. నడుముపట్టేసింది. "అమ్మా..నా నడుమురోయ్" అని మూలిగాడు.

* * *

ఆఫీసునుంచి వంగిన నడుములో బ్రీఫ్‌కేసుతో మూలుగుతూ వచ్చాడు కృష్ణమూర్తి. భామ దూరంగా కూర్చుని చదువుకుంటున్నది. భర్త మూలుగులను పట్టించుకోవడంలేదు. భామకు మళ్ళీ కోపం వచ్చిందని గ్రహించాడు కృష్ణమూర్తి.

"హల్లో... 'మూలుగుతూ పిలిచాడు. వినిపించుకోకుండా అవతలివైపు తిరిగి కూర్చుంది భామ "హల్లో...." మళ్ళీ పిలిచాడు కృష్ణమూర్తి.

భామ లేచి చపాతీలు చెయ్యసాగింది. తాను కూడా మెల్లగా పెరట్లోని బకెట్ దగ్గరకెళ్ళి ముఖం కడుక్కున్నాడు కృష్ణమూర్తి. టవల్ అందుకోబోయి "అబ్బా.... అమ్మా..." అన్నాడు.

కానీ భామ వినిపించుకోలేదు కసిగా చపాతీలు వత్తుతున్నది. చపాతీ స్థానంలో భర్తను ఊహించు కుందేమో - వేగంగా కోపంగా వత్తుతున్నది.



చేసేది లేక గొంతు సవరించుకుంటున్న పద్ధతిలో సకిలించాడు. భామ అతనివైపు చూసింది. 'తువ్వాలు' అన్నాడు. భామ నృత్యభంగిమలో నడుచుకుంటూ వచ్చి అలా కొంగు అందించి, అతగాడు ముఖం తుడుచుకునే లోగానే మళ్ళీ వయ్యారంగా నడుచుకుంటూ పోయి చపాతీలు చెయ్యసాగింది.

(ఇంకావుంది)

తబలాని తల్చుకోగానే
జాకీర్ హుస్సేన్ - ఆయన్ని తల్చుకోగానే
వాహ్‌తాజ్ గుర్తొస్తాయ్!
కానీ అసలు గుర్తుకురావాల్సింది - వాళ్ళ గురువూ... కన్నతండ్రీ... అల్లారఖా!!

* * *

అసలు తబలాకి చాలా చరిత్ర ఉంది...
కృష్ణ యజుర్వేదంలోని - ఐతరేయ బ్రాహ్మణంలో
"చర్మణా ఆచ్ఛాదిత ముఖం భూగర్భమ్"
అంటే నేలలో ఓ గొయ్యి తవ్వీ దాన్ని చర్మంతో కప్పి వాయించినప్పుడు అద్భుతమైన నాదం వొస్తుందనీ అర్థం. అంచేతే... 'మృత్+అంగం' మృదంగం అన్న పదం పుట్టింది...

పొంగులు వారేది!...
అల్లారఖాకి తబలా... ప్రేయసి.... అంచేతే... నవరసాల్నీ ఆవిష్కరించేసేవాడు....
తబలా కన్య.... బుగ్గమీద చిటికెయ్యగానే... శృంగారంతో గింగిరాలు తిరిగేది!...
మునివేళ్ళతో కితకితలు పెడ్తే... కిలాకిలా హాస్యమొలికించేది
సుతారంగా వాయిస్తే... విషాదంగా... కన్నీరెట్టి తోలుగుండె ..... దడదడలాడేది
తబలా ఉపరితలం... విశాల మైదానమైతే... (బెన్‌హర్‌లా)
రౌద్రవీర భయానకాలు... మూడు గుర్రాలై... దౌడు తీసేవి...
సరే... ఆయన తబలా విన్యాసమే అద్భుతం...
తద్వారా మనం పొందే రసానుభూతి శాంతం -

# తబలా పాదుషా అల్లారఖా



తర్వాత కాలంలో దక్షిణాది మృదంగం... మొఘల్ చక్రవర్తుల కాలంలో... ముఖ్యంగా అమీర్‌ఖుస్రో ద్వారా... రెండుగా చెయ్యబడీ మృదంగం కాస్తా తబలా అయ్యింది!..
ఏదో తాళవాద్య పోటీలో మృదంగాన్ని రెండు ముక్కలు చేసి వాయించినా... తబ్ భీ బోలా (అప్పుడుగూడా పలికింది) అన్నారట!
ఎడమ చేత్తో వాయించే డగ్గా - పురుష వాయిద్యం అయితే
కుడి చేత్తో వాయించే తబలా... స్త్రీ వాయిద్యం అనీ
రెండూ శివ-శక్తుల జంటనీ సంగీతజ్ఞులు భావిస్తారు.

* * *

పంజాబ్‌కి చెందిన పేద రైతు హకీమ్‌కి తొమ్మిది మంది సంతానంలో ఒకడు అల్లారఖా.. గురుదాస్‌పూర్‌లో జన్మించారు. జమ్మూలోని ఒక నాటక సమాజంలో నటుడిగా చేరారు. రామ్‌లీలా-లో ప్రధాన పాత్ర ధరించేవారు... ఆ సమయంలోనే అక్కడి సంగీత విద్వాంసులు - లాల్ మహమ్మద్... ఖాదిర్‌బక్ష్. ఇద్దరి దగ్గర శిక్షణ పొందారు!...
రోజుకి పద్దెనిమిది గంటల సేపు 'రియాజ్' (సాధన) చేసే అల్లారఖాకి... తబలా ఆరోప్రాణం అయిపోయింది...
నిద్రలో ఉన్నా - మెలకువగా ఉన్నా... చేతివేళ్ళు మాత్రం ఏ వస్తువు మీదో నర్తించవలసిందే!...
ఆ వేళ్ళు తబలాని తాకగానే... తబలా పులకించి మెరుపులు మెరిసేది! ఉరుములు ఉరిమేది....
ఆ చెయ్యి తబలా స్పర్శించగానే... తబలా అమృత కలశాలై నాదం

ఇకపోతే... ఆయన ప్రోగ్రాం చూళ్ళేకపోడమే... బీభత్సం -
ఇలా ఆయన తబలిణితో ఆయన దాంపత్యం రసరమ్యం. ధ్వనిగమ్యం -

* * *

జగత్ప్రసిద్ధుడు అయిన సితార్ - మెగాస్టార్ రవిశంకర్‌కి కొన్నివందల సార్లు అల్లారఖా సహకార వాయిద్యం అందించి యావత్ప్రపంచం తిరిగొచ్చాడు... అల్లారఖా.... రవిశంకర్ గోటి మీటు.. అల్లారఖా బీటు... శ్రోతల్ని కెక్కెక్కించేవి!!
ఒకసారి... అల్లారఖా రష్యాలో తబలా ప్రోగ్రాం జరుగుతోంది. ప్రేక్షకులు - శ్రోతలు... టీవీ ఛానెళ్ళు... మోగిపోయాయ్!
తబలా మైదానం మీద అల్లారఖా వేళ్ళు - లేళ్ళై పరుగులు తీస్తున్నాయ్
వేళ్ళు అంత స్పీడుగా కదలడం మీద - ఆశ్చర్యంతో పాటు అనుమానంగా
కొంపతీసి వేళ్ళకి - మినియేచర్ యంత్రమేమన్నా కట్టుకున్నాడా అని... సంగీతజ్ఞులు కొంతమంది వేళ్ళని పరీక్షించారు...
ఏముంది... వేళ్ళలోనూ... కళ్ళలోనూ....
కేవలం!... సాధన... సాధన.... సాధన.
(క్షమించండి... పానకంలో పుడక... ఆ మధ్య ఓసారి ముంబై ఏర్‌పోర్టులో... అర్ధరాత్రి పూట... అల్లారఖా - కొడుకు జాకీర్ హుస్సేన్ నిలబడి ఉంటే... నేను వెళ్ళి స్వపరిచయం చేసుకుని జాకీర్ హుస్సేన్ - వేళ్ళని ముద్దెట్టుకున్నాను -
మై దక్షిణ్ భారత్‌కా.... తెలుగు ఆర్టిస్ హుఁ... అన్నాను... సంతోషించాడు.)

ఇది పానకంలో పుడకా... రవ్వల ముక్కు పుడకా! ?)

* * *

అల్లారఖా... తబలిస్టే కాకుండా... మంచి గాయకుడు కూడా!...

అయితే... అవ్వా... బువ్వా... కుదరదు కాబట్టి... ఒకదాన్నే ఎన్నుకుని దాంట్లోనే... అపారమైన కృషిచేసీ......

దాదాపు ముప్ఫై ఏళ్ళ పాటు... యావత్ప్రపంచమూ పర్యటించడమే కాకుండా చికాగో - కాలిఫోర్నియా... శాన్‌ఫ్రాన్సిస్కో... న్యూయార్క్ నగరాల్లో 'తబలా' శిక్షణా తరగతులు నిర్వహించాడు...

శిష్యులంతా అల్లారఖాని 'అబ్బాజీ' అని పిలుస్తారు. బొంబాయి 'శివాజీపార్క్'లో ఆయనకు కొంత స్థలం ఇచ్చింది ప్రభుత్వం. ఆయన అక్కడ ఎంతోమంది శిష్యుల్ని తయారు చేస్తున్నారు.

అల్లారఖా కొడుకు జాకీర్ హుస్సేన్‌ని డాక్టరైతే చూడాలనుకుంది తల్లి... కానీ తబలా నేర్పించి... ప్రపంచ ప్రఖ్యాత తబలిస్ట్‌ని చేసాడు తండ్రి...

బాల్యంలో తల్లి పాలు తాగుతూ... రెండో రొమ్ము మీద దరువేసేవాడు జాకీర్ హుస్సేన్ అని రాసుకున్నాడు - గొప్ప విషయం!!

ఓసారి మద్రాసులో అల్లారఖా... జాకీర్‌హుస్సేన్ తబలా జుగల్‌బందీ ఏర్పాటయింది! ఎక్కణ్ణించో... బహుశ విదేశాల్లో ఉన్నాడు... ఫ్లైటు రావాలి!!

ప్రేక్షకులు అసహనంగా ఉన్నారు

అల్లారఖా స్టేజీమీదకొచ్చి -

వాడొచ్చేవరకూ ఆగక్కర్లేదు..

నేను వాడి బాబులాగ వాయిస్తా

- ఎంచేతంటే నేనే వాడి బాబుని గనక..

ఘొల్లుమన్నారు ప్రేక్షకులు...

తబలా... మొదలైంది!... నాదవేదం... శబ్దవర్షం...

హృదయం తడిసీ... మనసు కరిగీ... బెంగ వెలిసిపోయింది!!

భారతీయ సంస్కృతికి... సారథి అల్లారఖా

* * *



అల్లా ఆశీర్వాదమే... నా బలం... ఆయనే నా నాదం

అని అరమోడ్పు కనులు కనుల్తో చెప్పారు.

తబలా వాద్యంతో చెవులూరించే

అల్లారఖా... అద్భుతమైన వంట గూడ చెయ్యగలడట!!

ఆయన వొండే 'బిర్యానీ'... నోట్లో నీరూరిస్తుందిట!!

... 1994లో ముంబై - పూణే... కలకత్తా... ఢిల్లీ

.... లండన్.... న్యూయార్క్ నగరాల్లో అల్లారఖా పుట్టినరోజు వైభవంగా నిర్వహించారంటే...

అంతకన్నా కళాకారుడికి... అదృష్టమేముంటుందీ!...

- తనికెళ్ళ భరణి

# బాణీ ముత్యాలు

సేకరణ : పి.గిరి, హైదరాబాద్.



ఆరుద్ర

మంచిని తలపెట్టినచో మనిషికడ్డులేదులే
ప్రేరణ దైవానిదైన సాధించును నరుడే

**చిత్రం** : బాల భారతం
**పాట పల్లవి** : మానవుడే మహనీయుడు



చంద్రబోస్

కలతలు కష్టాల చేదును సహించి
కులుకుల సుఖాల తీపిని గ్రహించి
గొడవల పంతాల వగరును త్యజించి
మధురస బాధల ఎంగిలి భుజించి
యిద్దరూ విందులు చేస్తూ
వందేళ్లుంటే దాంపత్యమేగా

**చిత్రం** : కళ్యాణరాముడు
**పాట పల్లవి** : గుత్తొంకాయా



ఆత్రేయ

కన్ను నీదని వేలు నీదని
పొడుచుకుంటే రాదా రక్తం
రక్తమెంతగా ధారపోసినా
దొరుకుతుందా మళ్లీ హృదయం

**చిత్రం** : సెక్రటరీ
**పాట పల్లవి** : మనసులేని బ్రతుకొక నరకం



సుద్దాల అశోక్‌తేజ

వెళ్లగలిగితే అందని ఆకసం నీదట
చూడగలిగితె ఉన్నది స్నేహమే అంతట
నింగికి నేలకు రంగుల వంతెన ఇంద్రధనువు కాదా
మబ్బులు చల్లిన వానే మట్టికి ప్రేమ గ్రంథమవదా

**చిత్రం** : ఖైదీగారు
**పాట పల్లవి** : చిరునవ్వు చిరునామా మన జీవితం



సిరివెన్నెల

అడుగేస్తే కడలైనా దారిస్తుంది
పిడికిస్తే పొడి ఇసుకైనా నీరుస్తుంది
మనసిస్తే శిల అయినా ప్రేమిస్తుంది
జంటను విడదీసీ జగమెప్పుడు గెలిచింది
జన్మల ముడివేసే కథ ఎప్పుడు ముగిసింది

**చిత్రం** : అడవి రాముడు (ప్రభాస్ హీరో)
**పాట పల్లవి** : జంటను విడదీసీ జగమెప్పుడు గెలిచింది




నలభై ఏళ్లుగా సినీ పరిశ్రమ తీరుతెన్నులపై అధ్యయనం చేసిన రచయిత, జర్నలిస్టు నటుడు

# రావి కొండలరావు

రాసిన వ్యాసమిది



## దేవుడి మహత్యం

రెండుసార్లు వెంకటేశ్వర మహత్యాలు వచ్చిన తర్వాత,ఎన్.టి.రామారావు కూడా తీశారు. తొలిసారి (1939)'వెంకటేశ్వర మహత్యం' తీసిన పి.పుల్లయ్యగారే రెండోసారీ(1960)తీశారు. అయితే మొదటిది ఫేమస్ ఫిలింస్ వారిది. రెండోది ఆయన సొంతమే-పద్మశ్రీ ఫిలింస్.



అందులో లక్ష్మీవేసిన శాంతకుమారి, ఇందులో వకుళ. అందులో శ్రీనివాసుడు సీయస్సార్. ఇందులో తెలిసిన విషయమే-ఎన్.టి.ఆర్ ! రెండు సినిమాలు హిట్లు.

మొదటి సినిమా విడుదల సమయంలో విజయనగరంలోని థియేటర్ ముందు నిలువెత్తు వెంకటేశ్వరస్వామి విగ్రహం పెట్టి, మెడలో పెద్దపూలమాల వేశారు. ఒక్క విజయనగరంలోనే కాదు-అన్ని వూళ్లలోనూ విగ్రహాలు చేయించి పెట్టారు. అక్కడ ప్రేక్షకులు చిల్లర డబ్బులువేసి దండాలు పెట్టుకొనేవారు.

రెండోవారంలో వూళ్లో ఓ అలజడి లేచింది. విగ్రహం మెడలోని పూలమాల గాలి లేక పోయినా, అటూ ఇటూ జోరుగా వూగుతున్నదని! రెండో ఆట సినిమాకి వెళ్ళిన వాళ్లంతా ఈ వింత చూస్తూన్నారని చెప్పుకొన్నారు. రెండో ఆటకి జనం పెరిగారు. కొందరు "ఏం లేదు, అంతా పబ్లిసిటీ స్టంటు" అని కొట్టిపారేశారు. కొందరు మాత్రం మాల ఊగడం 'కళ్లారా చూశాం' అన్నారు. "మాల జోరు జోరుగా ఊగుతోందేగాని, పైకి ఎగిరిపోకుండా వుండడమే మహత్యం" అని కూడా వాళ్లు చెప్పేవారు.

అలాగే రెండోసారి సినిమాకి కూడా వెంకటేశ్వర స్వామి విగ్రహాన్ని థియేటర్ల ముందు పెట్టి హుండీలు కూడా ఏర్పాటు చేశారు. ఈ సారి ఇంకా కథలు వినిపించాయి. కొన్ని వూళ్లలో రాత్రివేళ విగ్రహం అక్కడ వుండడం లేదనీ తెల్లవారేసరికి మళ్లీ ప్రత్యక్షం అవుతోందని. హుండీలూ, గల్లా పెట్టెలు బాగా నిండాయి.

ఒక వూళ్లోని థియేటర్ యజమాని, కరపత్రాల్లో ఓ విశేషం ముద్రించాడు. "వెంకటేశ్వర మహత్యం సినిమా చూసినవాళ్లకి బాగున్నా లేకపోయినా- బాగుందనే చెప్పాలిగాని, బాగులేదని చెప్తే కళ్ళుపోతాయని! అలా బాగులేదని వాదించిన ఒకతని కళ్ళు పోయాయనీ" చెప్పి, అతని ఫొటో కూడా పేపర్లో వేయించాడు! ఇలాంటి కథలు చాలా సినిమాలకి వినిపించేవి. 'రోజులు మారాయి' సినిమాకీ వినిపించాయి. విజయవాడ థియేటర్లో -సాక్షాత్తు కనకదుర్గ మహలక్ష్మి అమ్మవారే కొండదిగి వచ్చి, నాలుగైదుసార్లు ఆ సినిమా చూసిందని !

* * *

## ప్రహ్లాదుడు చెట్టెక్కాడు

మొదటిసారి వచ్చిన 'భక్త ప్రహ్లాద' (1942)లో జి.వరలక్ష్మి ప్రహ్లాదుడి వేషం వేశారు. వేమూరి గగ్గయ్య హిరణ్యకశిపుడూ, వరలక్ష్మి పది,పన్నెండేళ్లది. చాలా విపరీతంగా అల్లరి చేసేదిట, అందర్నీ అల్లరి పెట్టేదిట, ఆవిడే ఒకసారి చెప్పారు, "ఒకరోజు షూటింగులో ఏదో కావాలని అడిగాను, ఇవ్వలేదు. అలిగాను, ఎవరికీ కనిపించకుండా వుండాలని, శోభనాచల స్టుడియోలోని ఒక చెట్టు ఎక్కి, పైన కొమ్మల మధ్యన కూచున్నాను. నాకోసం వెతుకుతున్నారు



అందరూ. మొత్తానికి నన్ను కనిపెట్టి కిందికి దిగమన్నారు. ప్రహ్లాదుడి డ్రస్సు పాడయి పోతుందన్నారు. ఉహూ! నేను దిగలేదు, "నువ్వు దిగకపోతే కెమెరా పట్టుకుని మేమూ చెట్టు ఎక్కుతాం" అన్నారు. నేను గొడవ పెడుతూనే వున్నాను. ఒకాయన "దిగుతావా? పైకొచ్చి నిన్ను కిందకి తోసేయమంటావా?" అని అడిగారు. "తోసేయండి, కొండమీదనుంచి తోసినా, చెట్టుమీదనుంచి తోసినా ప్రహ్లాదుడికేమీ కాదుగా! విష్ణుమూర్తి రక్షిస్తాడు" అన్నాను. నా అమాయకత్వానికి జాలిపడి, బుజ్జగించి ఎలాగో కిందికి దింపారనుకోండి".

* * *

## యమలోక మెరుపు

తెలుగు సినిమాలు పుడుతూనే "పోటీ" ల్లో పుట్టాయి. పుట్టిన రెండేళ్లకే-రెండు "సతీసావిత్రి" (1933) సినిమాలొచ్చాయి. ఒకటి నష్టపోయింది. రెండోది యథాతథ నాటకం గనక, లాభసాటిగా నడిచింది. అప్పుడు సినిమాలు తక్కువ గనక, అవే మళ్లీ మళ్లీ వచ్చి ఆడుతూవుండేవి.

నాకు కాస్త జ్ఞానం కలిగినపుడు ఆ సినిమా చూశాను. నలుపు తెలుపు సినిమాయేగాని, యమలోకం వచ్చినప్పుడు మాత్రం బొమ్మ ఎర్రగా కనిపించేది. అందరికీ ఆశ్చర్యంగా వుండేది. నేను చూస్తూన్నప్పుడు నాకు ఆశ్చర్యం అనే అనిపించిందిగాని, వున్నట్టుండి బొమ్మ తెలుపు-నలుపూ అయిపోయింది. ప్రేక్షకులు గోల చేశారు. "యమలోకం ఎర్రగా రావాలి" అన్నారు. కుదర్లేదు, మర్నాడు, బండి మీద తిరుగుతూ చేసిన ప్రకటన "ఇవాళ యమలోకం పూర్తిగా ఎర్రగా వుంటుందోహో" అని డప్పులు కొట్టారు. మర్నాడు పూర్తిగా ఎర్రగానే వుందిట!

తర్వాత తర్వాత తెలిసిందేవిటంటే, ఎర్రటి గాజురంగు అద్దం ప్రొజెక్టర్ ముందు పెడతారుట. దానివల్ల బొమ్మ ఎర్రగా కనిపిస్తుంది. అయితే నేను వెళ్లిన రోజున, ఆ ఎర్రగాజు ముక్క పట్టుకున్న ఆపరేటరు గట్టిగా పట్టుకోలేదు కాబోలు, అది చేజారి కిందపడి ముక్కలైందిట. అప్పటి కప్పుడు మళ్లీ ఎర్రరంగుది ఎక్కడ దొరుకుతుందీ? ఆ తర్వాత జాగ్రత్తపడి, ఎక్కువెక్కువ గాజు అద్దాలు ఏర్పాటు చేసుకున్నారు. ఉద్యానవనంలో పాటలాంటిది వస్తే, ఆకు పచ్చరంగు గాజు అద్దం పెట్టేవారు!

అసలే సినిమా అంటే తెర మీద బొమ్మ! మోసం! ఇలాంటి మోసాలు అప్పటి జనానికి తెలిసేవి కావు!

* * *

## సర్పబాధ

కె.యస్.ఆర్. దాసుగారి దర్శకత్వంలో నాకో సినిమా వచ్చింది ఏళ్ల క్రితం. సాంఘికమే. షూటింగు డేట్లు, రేట్లూ మాట్లాడారు. అడ్వాన్సు కూడా ఇచ్చారు. షూటింగు రోజు రానే వచ్చింది. వెళ్లాను. వేషం వేసుకోకముందే అది కొత్త సినిమా అయితే డైరెక్టర్‌కీ, ప్రొడ్యూసర్‌కీ కనిపించడం నా అలవాటు.


కె.యస్.ఆర్. దాసు

అలవాటు ప్రకారం దాసుగారికి నమస్కరించాను. ''ఏమిటి కొత్తగా నమస్కారాలు?'' అన్నారు. ''కొత్త సినిమా కదా'' అన్నాను, ''అవునూ ! మీరు పాముని మెడలో వేసుకుంటారు కదా, భయంలేదు కదా! ''అని అడిగాడు దర్శకుడు.

వెయ్యిపడగల శేషుడు ఎదురుగా ప్రత్యక్షమై తోకతో కొట్టినంత భయంతో చూశాను. ''పాము! అంటే సర్పం! స్నేక్?'' అన్నాను - నేను మెడ తడుముకుంటూ. ''ఏం భయమా !'' అని అడిగారు దాసుగారు. ఆ పాత్ర, పాముని మెడలో వేసుకుని తిరుగుతూ వుండే పాత్రట. శివుడు కాడు, పాములవాడూ కాడు గాని, అదో రకం హాస్యపాత్రట. ''ఈ మాట ముందే చెప్పాలి గదా - తీరా షూటింగ్ కొస్తే 'పాము' అంటే ఎలా! మీకో దండం, మీ పాము వేషానికో దండం! నావల్ల కాదు. క్షమించండి -నన్ను వదిలేయండి'' అని ప్రాధేయపడి, వెనకనుంచి పాము తరుముకొస్తున్నట్టు పరుగెత్తి పారిపోయాను.

ఆ తర్వాత ఇంకెవరినో పిలిపించి వేయించారుట. 'జోక్' ఏమిటంటే, ఓ గంట చర్చించిన తర్వాత పాము విషయం వద్దనుకుని, నాకు మళ్ళీ కబురు చేశారుట. నేను దొరకలేదుట. ఇంక నిరీక్షించలేక, ఇంకో అతని చేతనే వేయించారుట. నేను దొరికి వుంటే నేనే వేసేవాణ్ణి 'సర్పబాధ' లేకుండా!

## అదృశ్య సందర్శనం

'దసరా బుల్లోడు' తీస్తున్న సమయంలో వాణిశ్రీ పెద్దస్టారు. షూటింగు హైదరాబాద్ సారథిలో జరుగుతోంది. ఒకరోజు ఎందుకనో కాన్సిలయింది. ''ఏం చెయ్యాలబ్బా'' అనుకుంది వాణిశ్రీ. ఎప్పట్నుంచో సాలార్‌జంగ్ మ్యూజియమ్ చూడాలని ఆశ. వెళ్తే? ఇంకేముంది? ప్రేక్షకులు మ్యూజియమ్‌ను వదిలేసి



తనని చూస్తారు ! తన వెంటపడతారు, ఇక తనేం చూడగలదు? - అమెకో చక్కని, గొప్ప ఆలోచన వచ్చింది. ఆ ఆలోచనని ఆచరణలో పెట్టి, మ్యూజియమ్ అంతా హాయిగా తిరిగొచ్చింది. ఎలా? ఎలాగూ ఇది హైద్రాబాదే కదా! ముస్లిమ్స్ ఎక్కువగా వుంటారుగదా! ఎవరికీ అనుమానం రాదని, ముస్లిమ్ స్త్రీలు వేసుకునే నల్లని దుస్తులు -మొత్తం కప్పేసి వుంటుంది, కళ్లు మాత్రం చూస్తూవుంటాయి. వేసుకుని మ్యూజియమ్‌కి వెళ్లి, వీలైనంత వరకూ యథేచ్ఛగా ఎవరి కంటా తానుగా పడకుండా, తాను మాత్రం అందర్నీ చూస్తూ- ఒకవిధంగా అదృశ్య వ్యక్తిలా తిరిగి, తృప్తిగా హాయిగా తన కోరిక తీర్చుకుంది. వాణిశ్రీ.

* * *

## స్వగతప్పాట

'చూడామణి' అని ఒక సినిమా 1941 లో వచ్చింది. సాంఘికం. అంతబాగా నడవలేదు. సియస్సారు, నారాయణరావు, పుష్పవల్లి-వేశారు. బలిజేపల్లి లక్ష్మీకాంతం రచయిత. రాజాశాండో అని, తమిళంలో చిత్రాలు నిర్మించారు- అంతకు ముందు చాలా శబ్దరహిత చిత్రాలు తీశారు- ఆయన తీశారీ చిత్రం.

మన రాష్ట్రం రఘుపతి వెంకయ్య పేరిట ఏటా ఒక విశిష్టవ్యక్తికి అవార్డ్ ఇస్తున్నట్టు, తమిళనాడు ప్రభుత్వం కూడా ఇస్తున్నది, ఆ అవార్డు రాజాశాండో పేరిట. ''చూడామణి'' చిత్రం ఆరంభంలో ఓపాట వస్తుంది. పుష్పవల్లి పాడింది. వాళ్ల ఇంటి ముందు, పెరటిలోనూ పూలమొక్కలుంటాయి. అవి చూస్తూ


పుష్పవల్లి

స్వగతంలో పాడుకున్నట్టు పాట.

పూల మొక్కల్ని చూస్తూ - ''ఆ పూలమొక్కలెటులున్నవో పోయి చూచెదన్'' అని పాడి, దగ్గరకెళ్లి '' సొలిపోయెనే సూర్యకాంతమూ'' అని పాడుతూ విచారించి, మళ్ళీ అయిడియా రాగా, ''ఆ మూల మొక్కలెటున్నవో పోయి చూచెదన్'' అని ఇంకో మూలకి వెళ్తుంది. ఇలాంటి పాటకి, ఆ రోజుల్లోనే ఎందుకనో నవ్వు వచ్చింది- అప్పటికింకా ప్రేక్షకులు తెలివి మీరక పోయినా. ఇపుడు ఆ పాట తలచుకుంటూ, అలాంటి పాటని ఇప్పుడు పెడితే ఎలా వుంటుందాని....!

## సం'గీతా ' రహస్యాలు

### ఘంటసాల ఘనత

'నిర్దోషి' (గౌతమ్ పిక్చర్స్: 1967) సినిమాకి ఘంటసాల సంగీత దర్శకుడు. సినిమా చివర్లో కార్లు పరుగెత్తడం (ఛేజింగ్) వుంది. దాని మీద రీ రికార్డింగ్ చెయ్యాలి. ఘంటసాల గారు ఆ రీలు చూసి, కార్లషాట్లు మరీ తక్కువగా



ఉన్నాయనీ, అంత తక్కువ నిడివిలో రీరికార్డింగ్‌లో టెంపో రాదనీ చెప్పారు. ఇంకా మరి కొన్ని షాట్స్ తీసి, నిడివి పెంచితేగాని, టెంపోకి అవకాశం వుండదన్నారు ఘంటసాల. సినిమాకి సంబంధించి మొత్తం షూటింగ్ పూర్తయినా, మళ్ళీ కార్లూ, కెమెరా తీసుకుని వెళ్లి చక్రాల షాట్లు, పానింగ్ షాట్లు వంటివి తీసి ఎడిట్ చేసి పాతషాట్స్‌కి కలిపారు. అప్పుడుగాని, రీరికార్డింగ్ చెయ్యలేదు ఘంటసాల. ఒక సంగీత దర్శకుడు ఆదేశం ప్రకారం అదనపు షాట్స్ తీసి, కలపడం అన్నది ఎప్పుడైనా జరిగిందో లేదోగాని, ప్రత్యక్షంగా విన్న సంఘటన అదే. ఘంటసాల గారు సాధించిన ఘనతల్లో అదీ ఒక ఘనతే కదా, అలాంటి 'కమిట్‌మెంట్' వున్న సంగీత దర్శకుడు ఘంటసాల. (ఈ విషయాన్ని 'నిర్దోషి' కి సహకార దర్శకుడిగా పనిచేసిన కె.వి. రావు కూడా నిర్ధారించారు)

\- ఆర్కే

ఇద్దరి మిత్రుల సంభాషణ
"నువ్వు జంటిల్‌మేన్‌వి అనుకున్నాను"
"నేను కూడా నిన్ను అలాగే భావించా"
"అలాగా! అయితే పొరపాటు నాదే! నువ్వే కరెక్టు".





భార్యా భర్తల సంభాషణ
"ఏమండీ నాకు కొత్త చీరలైనా కొనిపెట్టండి లేదా వేరే ఇల్లు ఏదైనా చూడండి మారి పోదాం".
"బీరువా నిండా చీరలు పెట్టుకొని ఈ కోరికేమిటే? వింతగా ఉంది!"
" నాకున్న చీరలన్నీ ఈ వీధిలో వాళ్లంతా చూసేశారండీ...."



పోస్టాఫీసులో -
"ఈ వందరూపాయల నోటును మా అమ్మగారికి మనియార్డరు చేయండి"
"ఇది చిరిగిన నోటు చెల్లదు"
"నోటు నాది, పంపేది మా అమ్మకి, మధ్యలో మీ కేంటి కష్టం?"

**ఈ జోకులను పంపించిన వారు : బి. అరుణ, మంగళ గిరి**



"అబ్బాయి వ్యాపారం మూడు పువ్వులు, ఆరుకాయలుగా ఉందని చెబితే నమ్మి మా అమ్మాయినిచ్చి పెళ్లి చేసి మోసపోయాం"
"ఇంతకూ అబ్బాయి ఏం చేస్తుంటాడేమిటి?"
"ఇల్లిల్లూ తిరిగి పూలు,కూరగాయలు అమ్ముతుంటాడు".



"హలో... అది 23831388 నంబేరేనా?"
"కాదండీ.... 23831387"
"అలాగా..దయచేసి ఏమీ అనుకోకుండా మీ తర్వాతి నంబరు వాళ్లని కాస్త పిలుస్తారా ప్లీజ్"
"..............!..........?....!......."



"ఏ వస్తువు అయినా ఫిఫ్టీ పర్సెంట్ డిస్కౌంటుతో కొనొచ్చుగాని 'చెప్పులు' మాత్రం కొనగూడదని అనుభవపూర్వకంగా తెలుసుకున్నాను".
"ఎలా?"
"నిన్న కొనుక్కుని ఇంటికి వెళ్లి ప్యాకెట్ విప్పి చూస్తే ఒక చెప్పు మాత్రమే ఉంది"

**ఈ జోకులను పంపించినవారు: రెడ్డి.ఎమ్మె. ఒంగోలు.**



నిర్మాత : ఆ పబ్లిసిటీ ఆర్టిస్ట్ ఎవరయ్యా దర్శకత్వం" అని వ్రాయమంటే "ధర్మకత్వం" అని రాశాడు.
దర్శకుడు : అబ్బే ఏం లేదు ఆ పబ్లిసిటీ ఆరిస్ట్‌తో - ఇది నా మొదటి సినిమా ఫ్రీగా డైరెక్షన్ చేస్తున్నానని - చెప్పాను అంతే.



హీరోయిన్ : ఏమండి నిర్మాతగారు "గ్లిజరిన్" లేకుండా ఏడుపు రావటంలేదు. కాస్త తెప్పిస్తారా.
నిర్మాత : గ్లిజరిన్ లేకుండా వచ్చేది ఒక్క నిర్మాతకే కదా! తప్పకుండా తెప్పిస్తా.



నిర్మాత : ఏమండోయ్ డైరెక్టరుగారూ మీరు రికమెండ్ చేసిన ఆర్టిస్ట్ "నిర్మాత" అని వ్రాయబోయి "నిరాత" అని రాసాడండి! ఇప్పుడేం చేయమంటారు.
దర్శకుడు : దాన్నే శకునం అంటారు. నీ రాత బావుంటే నిర్మాత అనే వ్రాసి ఉండేవాడు.

**ఈ జోకును పంపించిన వారు : అనుపోజు భాస్కరరావు, ఏలూరు.**



"యువర్ గుడ్ నేమ్ ప్లీజ్" అంటూ పక్కనున్న ఓ కొత్త వ్యక్తిని పరిచయం చేసుకునేందుకు అడిగాడు రమేష్.
"అంటే నీ ఉద్దేశ్యం నాకో చెడ్డపేరు కూడా ఉందనా?" అంటూ కయ్యిమన్నాడా దుర్వాస మహాముని



"పప్పు అధికంగా తింటే నేను త్వరగా కోలుకుంటానని డాక్టర్ చెప్పాడే " అన్నాడు భర్త.
"సరే అయితే గన్నేరు పప్పు తెమ్మంటారా?" అని అడిగింది భార్య అమాయకంగా.



భర్త : నాకు రాత్రి పక్కింటి రాధ కలలోకి వచ్చిందే.
భార్య : ఒంటరిగానే వచ్చింది కదూ!?
భర్త : అరె.... నీకెలా తెలుసు?
భార్య : ఆమె భర్త నా కలలోకి వచ్చాడుగా మరి.

**ఈ జోకును పంపించిన వారు : టి. సుదర్శన్,రామ్‌నగర్, ఆదిలాబాద్ జిల్లా**



తల్లి : ఏంట్రా అస్తమానం పళ్ళు తోముకుంటున్నా వెందుకు?
కొడుకు : మా టీచర్ నోరు మంచిదైతే ఊరు మంచిదౌతుందన్నారమ్మా అందుకని!



అమెరికా ప్రభుత్వం తన రాకెట్ ప్రయోగానికి అన్ని దేశాల సైంటిస్ట్‌లను ఆహ్వానించింది. తీరా చూస్తే సమయానికి కదలలేదు. కంప్యూటర్లన్నీ అంతా బాగా పనిచేస్తున్నాయని చూపించాయి. అందరు సైంటిస్టులూ ప్రయత్నించి విఫలులై పోయారు. అప్పుడు మన సైంటిస్ట్ వెళ్ళి రాకెట్‌ను కొంచెం ఏటవాలుగా వంచి స్టార్ట్ చేయమన్నాడు. వెంటనే అది ఆకాశంలోకి దూసుకుపోయింది. అది చూసి మిగిలిన సైంటిస్ట్‌లందరూ వచ్చి "ఏ మిస్టేక్ ఐడెంటిఫై చేశార"ని అడిగాడు . "ఏమిలేదు, మా ఇండియాలో స్కూటర్స్ స్టార్ట్ కాకపోతే, ఈవిధంగా వాల్చి, తర్వాత స్టార్ట్ చేస్తాము అంతే" అని సమధానమిచ్చాడు కూల్‌గా.

వైవాహిక జీవితంలో ఎటువంటి ఒడిదుడుకులు లేకుండా సాఫీగా సాగిపోవటానికి ఏదైనా సలహా చెప్పమని ఒకామె ఓ స్వామిజి దగ్గరకు వెళ్ళి అడిగింది.
"చూడమ్మా! నీవు ఎల్లప్పుడూ నీ భర్త అడుగు జాడల్లోనే నడవాలి" అని ఉపదేశించారా సలహానందస్వామి.
"అదెలాసాధ్యం స్వామీ! నా భర్త పోస్ట్‌మేన్ కదా !" ఆశ్చర్యపోయిందా యిల్లాలు.



**ఈ జోకులను పంపించిన వారు: జి. యామిని ఈశ్వర్ కార్తీక్‌సాగర్,వనపర్తి.**



"ఈ బెడ్ షీట్స్ నాకు బాగా నచ్చాయి. కానీ మా వారు ఏమంటారో ఏమిటో ?" అంది కాంతం సేల్స్ మేన్‌తో - ఓ రెండు బెడ్ షీట్స్ చూపిస్తూ.
"అయితే - ఈ రెండూ ఇంటికి తీసుకు వెళ్ళండి మేడమ్ ! మీ వారికి నచ్చక పోతే రేపు ఉదయం రిటర్న్ పంపించేయ్యండి" అన్నాడు సేల్స్‌మేన్.
"ఇదేదో బానే వుందమ్మా... మన చుట్టాలు వుండేది ఇవాళ రాత్రి వరకే కదా...!" అన్నాడు పక్కనే వున్న పుత్రరత్నం.

**ఈ జోకును పంపించిన వారు: బోలెం సత్యనారాయణ, చిన ఓగిరాల(కృష్ణా జిల్లా)**

**ఈ సంచికలోని హ్యూమర్‌బాక్స్‌కి జోకులను పంపిన బి.అరుణ-మంగళగిరి, రెడ్డి.ఎమ్మె-ఒంగోలు, అనుపోజు భాస్కరరావు-ఒంగోలు,టి.సుదర్శన్-ఆదిలాబాద్, జి.యామినీఈశ్వర్ కార్తీక్‌సాగర్ -వనపర్తి, బోలెం సత్యనారాయణ- చిన ఓగిరాల** గార్లకు సోహన్ మ్యూజిక్ వారు 'పెదబాబు' సినిమా పాటల ఆడియో సి.డి.నిబహుమతిగా ప్రకటించారు. అతి త్వరలో ఈ సి.డి.ని పోస్ట్ ద్వారా పంపించడం జరుగుతుంది.

SOHAN
MUSIC



# జంధ్యా మారుతం





'నవ్వటం భోగం
నవ్వించటం యోగం
నవ్వకపోవటం రోగం' అంటూ తెలుగు సినిమా హాస్య ప్రియత్వానికి తారకమంత్రంగా నిలిచిన దర్శకుడు జంధ్యాల.

దర్శకుడిగా ఆయన స్కోరు ...39. ఒకే ఒక్క చిత్రం మినహా అన్నీ సెల్యులాయిడ్ కార్టూన్‌లనదగ్గవే. ఆ ఒక్కటీ మాత్రం ఓ అందమైన నృత్యగేయం.

'శంకరాభరణం' తర్వాత ఆ స్థాయిలో నృత్య, సంగీతాలకు విశేష ప్రాధాన్యతనిస్తూ రూపొందించబడిన చిత్రం 'ఆనందభైరవి'.

హాస్య చిత్రాల రూపకల్పనకు కొత్త ఒరవడిని తీసుకువచ్చిన జంధ్యాల ఎంతో ఇష్టపడి, కష్టపడి రూపొందించిన చిత్రమిది. 'శంకరాభరణం' చిత్ర ప్రభావితుడనై తీసానని జంధ్యాల నిజాయితీగా చెప్పుకున్నాగానీ, అద్భుతమైన సృజనతో పరమ పవిత్రంగా ఈ చిత్రాన్ని రూపొందించి తనలోని సరికొత్త దర్శకుడిని ఆవిష్కరింపచేశారు. జంధ్యాలకిది తొమ్మిదవ చిత్రం. ఈ చిత్రం ద్వారా జంధ్యాల ఉత్తమ దర్శకుడిగా నంది అవార్డు, జాతీయ స్థాయిలో ఉత్తమ ప్రాంతీయ చిత్ర దర్శకుడిగా అవార్డును పొందారు.

'ఆనందభైరవి' కర్ణాటక సంప్రదాయంలో ఒక రాగం పేరు. అదే పేరుని ఆనంద్- భైరవి అని విడగొట్టి ఒక ప్రేమ జంటకు పెట్టారు.

కొండముది శ్రీరామచంద్రమూర్తి రాసిన 'చిరుమువ్వల మరుసవ్వడి' నవల ఆధారంగా ఈ చిత్ర కథను రూపొందించారు జంధ్యాల. కూచిపూడి నాట్యానికి తన జీవితాన్నే అంకితం చేసిన నాట్యాచార్యుడు నారాయణశర్మ పాత్రకు ఎలాంటి ఇమేజ్ లేని నటుడు కావాలని తలపోసారాయన. ఎన్నో తర్జనభర్జనల తర్వాత ప్రముఖ కన్నడ నటుడు, రచయిత, దర్శకుడు గిరీష్‌కర్నాడ్‌ని ఎంపిక చేసారు. ఈ పాత్రని బాగా ప్రేమించిన గిరీష్ కర్నాడ్ పరిపుష్టత కోసం నృత్యం నేర్చుకోవడానికి సిద్ధపడ్డారు. ప్రసిద్ధ నృత్య దర్శకులు శేషు మాస్టారి దగ్గర రెండు నెలలు కూచిపూడి శిక్షణ పొందారు. గిరీష్ కర్నాడ్ ఈ పాత్ర కోసం తన ఒత్తయిన జుట్టును కూడా కత్తిరించుకున్నారు. నారాయణశర్మ ధర్మపత్ని పాత్రకు అలనాటి ప్రముఖ కథానాయిక కాంచనను తీసుకున్నారు. నారాయణశర్మ కొడుకు ఆనందం పాత్రకు యువ నటుడు రాజేష్‌ని ఎంపిక చేసారు.



## పండిత, పామర ప్రశంసలు పొందిన

# ఆనందభైరవి



ఇలా అన్నిపాత్రల ఎంపిక పూర్తయిందిగానీ,

ఒక్క హీరోయిన్ మాత్రం మిగిలిపోయింది. నృత్యం తెలిసినవారే ఈ పాత్రకు అర్హులు. నృత్యం తెలిసిన అందమైన అమ్మాయిలెవరూ సినిమాల్లో చేయడానికి అంగీకరించలేదు. చివరకు బెంగాల్‌కు చెందిన కథక్ నృత్యకారిణి మాళవిక సర్కార్‌ను హీరోయిన్‌గా ఎంపిక చేసారు. తెలుగు రాకపోయినా, కూచిపూడి తెలియకపోయినా మంచిపేరు తెచ్చుకుంది మాళవిక.

ఈ సినిమాకి సంబంధించి ఎక్కువ సన్నివేశాలు రాజమండ్రి సమీపంలోని కోరుకొండలో చిత్రీకరించారు. 'భైరవి' పాత్రధారిణి మాళవిక నృత్యం చేసే ప్రముఖ ఘట్టాలు అక్కడి ఓ దేవాలయంలోని మంటపంలో చిత్రీకరించారు. శిల్ప సౌందర్యం లేక మంటపం బోసిగా వున్నా ఆ లోపం కనిపించకుండా జంధ్యాల మ్యాజిక్ చేసినట్టు మేనేజ్ చేశారు.

ముఖ్యంగా 'పిలిచిన మురళికి' పాట చిత్రీకరణలో యూనిట్ సభ్యులు చాలా శ్రమపడాల్సి వచ్చింది. రాజమండ్రికి 15 మైళ్ళ దూరంలో గల కోరుకొండ వద్ద గల ఎత్తైన కొండమీది గుడి దగ్గర ఈ పాటను చిత్రీకరించారు. ఈ గుడికి గల 600 మెట్ల మీద నూనెతో దీపాలు పెట్టి అలంకరించారు. షాట్ మొదలవగానే అక్కడక్కడా గాలికి దీపాలు ఆరిపోసాగాయి. కొండమీదా, కొండమీది గుడిమీద వరుసగా వెలిగించిన దీపాలు గాలికి కొండెక్కుతున్నప్పుడల్లా వాటిని వెలిగించడానికి పదేపదే కొండ ఎక్కి, దిగి యూనిట్‌వాళ్ళు నానా ఇబ్బందులు పడ్డారు.

క్లైమాక్స్‌లో ఓ పాట వుంది. రాజేష్, మాళవిక నుద్దేశించి 'రా..రా...రా... రాగమై' అంటూ పాడతాడు. ఆ పాట ద్వారా సినిమాలో టెన్షన్ ఏర్పడేలా చిత్రీకరించాలను కున్నారు. అయితే జంధ్యాలకు, కెమెరామెన్ ఎస్.గోపాలరెడ్డి కి ఆ సీన్‌లో ఏదో వెలితి అనిపించింది. ఆ సమయంలో వర్షం వచ్చే సన్నివేశం వుంటే బాగుంటుందని వాళ్ళిద్దరూ అనుకున్నారు. దైవికంగా ఆ సమయంలో నిజంగా వర్షం వచ్చింది. వెంటనే ఆ ప్రకృతిసిద్ధమైన వర్షాన్నే షూట్ చేశారు. ఈ చిత్రానికి గోపాలరెడ్డి ఫొటోగ్రఫీ ఆయువుపట్టుగా నిలిచింది. జంధ్యాలలోని భావుకతకు, గోపాలరెడ్డిలోని వాస్తవికత తోడై ఈ చిత్రం ఓ దృశ్య ప్రబంధంగా రూపొందింది.



ఆనంద భైరవి శతదినోత్సవ సభలో కమలహాసన్, జంధ్యాల

ఈ చిత్రానికి రమేష్ నాయుడు సమకూర్చిన సంగీతం గురించి ఎంత చెప్పినా తక్కువే అవుతుంది. క్లాసికల్ టచ్‌తో పాపులర్ ట్యూన్స్ చేయడంతో పాటలన్నీ సూపర్‌హిట్ అయ్యాయి. సంగీతపరంగానే కాకుండా సాహిత్యపరంగా కూడా పాటలు బాగా జనరంజకమయ్యాయి. ముఖ్యంగా దేవులపల్లి వేంకట కృష్ణశాస్త్రి రాసిన 'కొలువైతివా రంగసాయి', వేటూరి రాసిన 'పిలిచిన మురళికి వలచిన మువ్వకి ఎదలో ఒకటే రాగం అది ఆనందభైరవి రాగం' పాటలు ప్రత్యేక ఆకర్షణగా నిలిచాయి. అసలు 'ఆనందభైరవి' రాగంలో డ్యూయెట్ కంపోజ్ చేయడాన్ని అప్పట్లో గొప్ప ప్రయోగంగా చెప్పుకున్నారు. లలితంగానూ, శాస్త్రీయం గానూ ఏర్చికూర్చిన పాటలన్నీ ఈ సినిమా విలువలని మరింత పెంచాయి. రమేష్‌నాయుడు ప్రతిభను మరో కోణంలో ఆవిష్కరించిందీ చిత్రం.

కూచిపూడి నాట్యకళకు కొన్ని తరాలుగా సేవలు చేస్తున్న వంశానికి చెందిన నారాయణ శర్మ, తన కొడుకు ఆనందశర్మని కూడా నాట్యాచారుణ్ణి చేయాలని ప్రయత్నించి భంగ పడతాడు. మొండివాడైన శర్మ ఓ దొమ్మరి పిల్లను చేరదీసి, ఆ పిల్లకి భైరవి అని పేరుపెట్టి నాట్యంలో నిష్ణాతురాలిని చేస్తాడు. తనను వెలివేసిన గ్రామపెద్దల దగ్గర భైరవి వల్ల తిరిగి గౌరవస్థానం పొందుతాడు శర్మ. ఆనందం, భైరవిల ప్రేమ విషయాన్ని తెలుసుకుని తిరస్కరిస్తాడు. చివరకు ఆనందం, భైరవిలు ఒక్కటి కావడంతో అది తట్టుకోలేక శర్మ ప్రాణం విడుస్తాడు. తండ్రి పట్ల గౌరవాభిమానానికి గుర్తుగా ఆనందం, భైరవిలు తమ కొడుకుని తిరిగి నాట్యకళకు అంకితం చేస్తారు. ఇది క్లుప్తంగా ఈ చిత్ర కథాంశం.

### తారాగణం

| | | |
|---|---|---|
| నారాయణశర్మ | - | గిరీష్ కర్నాడ్ |
| ఆనందశర్మ | - | రాజేష్ |
| భైరవి | - | మాళవిక |
| లక్ష్మీదేవమ్మ | - | కాంచన |
| డా॥ అవధాని | - | సుత్తి వీరభద్రరావు |
| అవధాని కొడుకు | - | సుత్తివేలు |
| చైనులు | - | పుచ్చా పూర్ణానందం |
| కరటకుడు | - | శుభాకర్ |
| అవధానికోడలు లక్ష్మి | - | శ్రీలక్ష్మి |
| కేశవ | - | హేమసుందర్ |
| ప్రియ | - | మహాలక్ష్మి |
| నటరాజన్ | - | జె.వి.రమణమూర్తి |
| చిన్నప్పటి ఆనంద్ | - | మాస్టర్ హరీష్ |
| చిన్నప్పటి భైరవి | - | బేబి కవిత |

ఇంకా జిత్‌మోహన్ మిత్రా, రామమోహనరావు, డబ్బింగ్ జానకి, కాకినాడ శ్యామల, మాస్టర్ హరికృష్ణ, నండూరి సుబ్బారావు, జి.వి.జి., **నృత్య కళాకారులు :** వెంకట్రామమ్మ (కూచిపూడి), శ్రీమతి సేన్ (మణిపూరి), కుమారి జాబి (కథక్), శ్రీరాం (కథకళి)




'ఆనందభైరవి' చైత్రయాత్రను పురస్కరించుకుని అమెరికాలోని తెలుగువారు వెలువరించిన ఆహ్వాన పత్రిక

## 'ఆనందభైరవి' అందుకున్న బహుమతులు

**ఆంధ్రప్రదేశ్ రాష్ట్రప్రభుత్వ 'బంగారునంది' బహుమతులు**
ఉత్తమచిత్రం (బంగారునంది)
ఉత్తమ దర్శకుడు
ఉత్తమ ఫొటోగ్రఫీ
ద్వితీయ ఉత్తమకథ

**ఆంధ్రప్రదేశ్ ఫిలిం జర్నలిస్టుల అవార్డు**
ఉత్తమ చిత్రం
ఉత్తమ దర్శకుడు
ఉత్తమ నటుడు (గిరీష్ కర్నాడ్)

**విజయవాడ ఫిలిం జర్నలిస్టుల అవార్డు**
ఉత్తమ చిత్రం
ఉత్తమ దర్శకుడు
ఉత్తమ సంగీతం

**'వంశీ' అవార్డులు**
ఉత్తమ చిత్రం
ఉత్తమ దర్శకుడు
ఉత్తమ సంగీతం
ఉత్తమ నటి -కాంచన
ఉత్తమ హాస్యజంట - 'సుత్తి' వీరభద్రరావు,వేలు
ఉత్తమ హాస్యనటి - శ్రీలక్ష్మి
ఉత్తమ రచన - శ్రీ కొండముది

**'కళాసాగర్' అవార్డులు**
ఉత్తమ చిత్రం
ఉత్తమ దర్శకుడు
ఉత్తమ సంగీతం
ఉత్తమ కథ
ఉత్తమ హాస్యనటుడు
ఉత్తమ హాస్యనటి

**ఆంధ్రప్రదేశ్ సినీగోయర్స్ అవార్డులు**
ఉత్తమ చిత్రం
ఉత్తమ దర్శకుడు
ఉత్తమ నటుడు
ఉత్తమ సంగీతం
ఉత్తమ నటి
ఉత్తమ హాస్యనటి
ఉత్తమ బాలనటుడు

**హాస్యప్రియ-రేలంగి అకాడమీ అవార్డు**
ఉత్తమ హాస్యనటి

**మద్రాసు ఫిలిం ఫ్యాన్స్**
ఉత్తమ దర్శకుడు.

సినిమా షూటింగ్ పూర్తయి ఫస్ట్‌కాపీ చేతికొచ్చాక అసలు కష్టాలు మొదలయ్యాయి. ప్రాజెక్షన్ కొచ్చిన వాళ్ళంతా రిస్కీ ప్రాజెక్ట్‌గా తీసిపారేశారు. బిజినెస్ చేయడానికి ఇందులో పేరొందిన ఆర్టిస్ట్ ఎవరూ లేరాయె. దాంతో నిర్మాతలు నాగభూషణరావు, భరద్వాజ్‌లు డీలాపడి పోయారు. ఆ తర్వాత 'వెండితెర' సినీ వార పత్రిక ఎడిటర్ స్వర్గీయ బి.ఎ.వి. శాండిల్య చిత్రం నెగిటివ్ రైట్స్‌ని సొంతం చేసుకున్నారు.

సినిమాని రిలీజ్‌కి సిద్ధం చేస్తున్న సమయంలో రాష్ట్ర ప్రభుత్వం నంది అవార్డులని ప్రకటించింది. 'ఆనందభైరవికి' ఉత్తమ చిత్రం, ఉత్తమ దర్శకుడు, ఉత్తమ కథా రచయిత, ఉత్తమ ఛాయా గ్రాహకుడు అవార్డులు దక్కాయి.

నంది అవార్డులతో 'ఆనందభైరవి'కి కొత్త కళ వచ్చింది. సినిమా కొనడానికి చాలామంది ఉత్సాహపడ్డారు. 1984లో లక్ష్మీఫిలింస్ ద్వారా ఈ చిత్రం విడుదలైంది. కళాత్మక చిత్రాలు ప్రజా విజయం సాధించలేవనే అపప్రధను తొలగిస్తూ ఈ చిత్రం జయప్రదంగా విజయవిహారం గావించింది. కూచిపూడి నృత్య వైశిష్ట్యాన్ని చాలా సులభ శైలిలో హృదయాలకు హత్తుకునేలా చిత్రీకరించిన జంధ్యాల ప్రతిభకు ప్రేక్షకులు బ్రహ్మరథం పట్టారు. పండితులతో పాటు పామరులు కూడా ఈ సినిమాని బాగా ఆదరించారు.

ఈ కథని తెరకెక్కించినన్ని రోజులూ తన మనసులో కె.విశ్వనాథ్‌నే ప్రతిష్టింపచేసుకున్నారు జంధ్యాల. 'విశ్వనాథ్ గారు నన్ను ఆవహించి ఇంత అందమైన చిత్రాన్ని తీయించారు' అని సభాముఖంగానే ప్రకటించారు జంధ్యాల. ఈ చిత్రాన్ని ఆయన కె.విశ్వనాథ్‌కే అంకితమిచ్చారు. సినిమా ప్రారంభంకాగానే మొదటికార్డు ఇదే పడుతుంది.

ఈ చిత్రాన్ని తిలకించిన జ్ఞానపీఠ అవార్డు గ్రహీత సి.నారాయణరెడ్డి 'గిరీష్ కర్నాడ్, నారాయణశర్మ పాత్ర కోసమే పుట్టారా అని అనిపించిందని' అభినందించారు. కన్నడ దర్శక సామ్రాట్ పుట్టణ్ణ గారు - భారతీయ సంస్కృతిని ఇందులో జంధ్యాల పూర్తిగా ఆవిష్కరించి, సంప్రదాయ విలువలను పెంచారని ప్రశంసించారు.

గిరీష్‌కర్నాడ్‌కి ఎస్పీ బాలసుబ్రహ్మణ్యం డబ్బింగ్ చెప్పడం వల్ల పువ్వుకి తావి అబ్బినట్టయింది.

సుప్రసిద్ధ కూచిపూడి నర్తకి శోభానాయుడు

## సాంకేతిక బృందం

| | |
|---|---|
| బేనర్ | : కళ్యాణి ఆర్ట్ ఫిలిమ్స్ |
| నిర్వహణ | : బి.ఎ.వి. శాండిల్య |
| సమర్పణ | : డి. సీతాపద్మరాజు |
| మూలకథ | : కొండముది శ్రీరామచంద్రమూర్తి |
| గీతరచన | : కీ॥శే॥ దేవులపల్లి కృష్ణ శాస్త్రి, డా॥ మంగళంపల్లి బాలమురళీకృష్ణ, వేటూరి, బి.ఎల్.ఎన్.ఆచార్య |
| నేపథ్యగానం | : యస్పీ బాలసుబ్రహ్మణ్యం, యస్.జానకి, యస్పీ.శైలజ, పూర్ణచందర్, వింజమూరి కృష్ణమూర్తి |
| సంగీతం | : రమేష్ నాయుడు |
| నిశ్చల ఛాయాగ్రహణం | : శ్యామ్ ప్రసాద్ |
| సహాయ ఛాయాగ్రాహకులు | : దివాకర్, కె.శ్రీనివాసరెడ్డి |
| సహకార దర్శకులు | : ఈదర సత్యనారాయణ, బత్తుల రామకృష్ణ |
| సహాయ దర్శకుడు | : జె.పుల్లారావు |
| కళ | : భాస్కరరాజు |
| నృత్య దర్శకులు | : శేషు, కృష్ణమూర్తి రాజు |
| కూర్పు | : గౌతంరాజు |
| ఛాయాగ్రహణం | : ఎస్.గోపాల్‌రెడ్డి |
| నిర్మాత | : అశ్వనీ కార్తీక చిత్ర |
| రచన,దర్శకత్వం | : జంధ్యాల |



## ఆనందభైరవి చిత్రంలోని ఓ యుగళ గీతం

రచన: వేటూరి సుందర రామమూర్తి
గానం: ఎస్.పి.బాలసుబ్రహ్మణ్యం, ఎస్.జానకి

అ: పిలిచిన మురళికి వలచిన మువ్వకి
ఎదలో ఒకటే రాగం అది ఆనందభైరవి రాగం
ఆ: మురిసిన మురళికి మెరిసిన మువ్వకి ఎదలో ప్రేమ పరాగం
మది ఆనందభైరవి రాగం
అ: కులికే మువ్వల అలికిడి వింటే కళలే నిద్దురలేచే ॥2॥
ఆ: మనసే మురళీ ఆలాపనలో మధురా నగరిగ తోచె
అ: యమునా నదిలా పొంగినది స్వరమే వరమై సంగమమై
ఆ: మురిసిన మురళికి మెరిసిన మువ్వకి ఎదలో ప్రేమ పరాగం
మది ఆనందభైరవి రాగం
అ: పిలిచిన మురళికి వలచిన మువ్వకి
ఎదలో ఒకటే రాగం అది ఆనందభైరవి రాగం
అ: ఎవరీ గోపిక పద లయ వింటే ఎదలో అందియ మోగే ॥2॥
ఆ: కదమే పదమై మదిలో ఉంటే ప్రణయాలాపన సాగే
అ: హృదయం లయమై పోయినదీ లయలే ప్రియమై జీవితమై
ఆ: మురిసిన మురళికి మెరిసిన మువ్వకి ఎదలో ప్రేమ పరాగం
మది ఆనందభైరవి రాగం
అ: పిలిచిన మురళికి వలచిన మువ్వకి
ఎదలో ఒకటే రాగం అది ఆనందభైరవి రాగం

సుబ్రహ్మణ్యం, శ్రీదేవి, కమలహాసన్, వాణీగణపతి, ప్రముఖ దర్శకుడు పుట్టణ్ణ కణగళ్, తమిళ దర్శకుడు భారతీరాజాలు ముఖ్య అతిథులుగా పాల్గొన్నారు.

మద్రాసు కళాసాగర్ భారీ యెత్తున ఈ చిత్ర యూనిట్‌కి సత్కారసభ ఏర్పాటు చేసింది. ఆ తర్వాత 1985లో అమెరికాలోని తెలుగువారి ఆహ్వానం మేరకు అమెరికా వెళ్ళారు. జంధ్యాల దంపతులు, నిర్మాత శాండిల్య, సీతాదేవి, శివ, ఎస్.పి.బాలసుబ్రహ్మణ్యం దంపతులు, ఎస్.పి.శైలజ, మాధవపెద్ది సురేష్ దంపతులు, ఆర్కెస్ట్రా సభ్యులు అందరూ అమెరికా వెళ్ళారు. ఈ అమెరికా పర్యటనలోనే జంధ్యాల మదిలో 'పడమటి సంధ్యారాగం' సినిమా కథ పుట్టింది.

'ఆనందభైరవి' తెలుగుతోపాటు కన్నడంలో కూడా ఏకకాలంలో నిర్మాణమైంది. నటుడు ద్వారకేష్ నిర్మించిన ఆ చిత్రానికి కన్నడంలో

'ఆనందభైరవి' జైత్రయాత్రను పురస్కరించుకుని అమెరికాలోని తెలుగువారు వెలువరించిన ప్రత్యేక సంచిక కవర్‌పేజీ


ANANDA BHAIRAVI
U. S. A. TOUR

ఆనందభైరవి అమెరికా జైత్రయాత్ర

ప్రత్యేక సంచిక

ANANDA BHAIRAVI NIGHTS COMMITTEE
MARYLAND
U. S. A.

## 'ఆనంద భైరవి' సినిమాలో వీరభద్రరావు పాత్రకి జంధ్యాల రాసిన సంభాషణలలో మచ్చుకు కొన్ని...

★ మింగినట్టున్నావు ఆవకాయతో కొండంత వాయ

★ ఆవకాయలో వేడుంటుంది. ఆ వేడి నాలాంటి వాడిగల వైద్యునికి నాడిలో తెలుస్తుందిరా... బోడి!

★ కోడలేదంటే గోడలకేసి, నీడలకేసి చూస్తావేరా, ఊడల జుట్టు వెధవా...

★ మనకా ఈలల గోల యేల!? ఈ ఈలన్నది ఇలలో కలలో మన ఇంటా వంటా లేని విద్యయే.

★ ఇప్పుడే బుర్రలో ఓ మెరుపు మెరిసిందిరా. కొత్త ప్రాస కనిపెట్టాను. 'క'తో ఇస్తా... ఏ కాకి... కాకీక కాకికి కోక... ఆకాకీక కాకికి కాక కోకికా కుక్కకా...!? ఇందులో 24 'క' లున్నాయి ఎలా ఉంది?

★ పోనీ ఇంకోటి ఇస్తా... 'న' మీద...!
నాని నాని... నీనూనె నీనూనె నానూనె నానూనె... నేనై నేను నీనూనె నా నూనేనని, నా నూనె నీనూనేనని నిన్న నేనన్నానా... నోనో... నేనన్నానా నున్నని నాన్నా... నైనైనై.
ఇందులో 56 'న'లున్నాయి. లెక్క చూసుకో కావాలంటే.

★ అయ్యా... సర్వేశ్వర శాస్త్రిగారూ. మీ సిగ్గు బొగ్గులవ్వ... ఆ రోజు శర్మగారి మీద నెగ్గిన గర్వంతో దిగ్గున లేచి భగ్గున మండి పడ్డారు కదా!? ఈ రోజు నిగ్గు తేలిన ప్రభతో, ప్రతిభతో ఈ మల్లెమొగ్గ నెగ్గింది. మీ బుగ్గ వాచేలా జవాబు చెప్పింది. ఇక మీరు తగ్గేసి, మాటకు తల ఒగ్గేసి ఊరంతా ముగ్గేసి శర్మగారిని సన్మానించండి. ఆ తర్వాత మీకు సిగ్గనిపిస్తే... ఆ దగ్గు ఆపేసి నాదగ్గరకురండి ఓ ఉగ్గు గిన్నెడు మందిస్తాను, జగ్గు నీళ్ళు కలిపి, ఉగ్గు తాగినట్టు తాగి, రగ్గు కప్పుకుని పడుకుందురుగాని. ఇప్పుడు ఆయన కాళ్ళు కడగండి, చేతికి కంకణం తొడగండి.

★ మొక్కుబడికి బుక్కులెన్ని చదివినా బక్కచిక్కిన కుక్కగొడుగు మొక్కలా... చెదలు కొట్టేసిన చెక్కముక్కలా... కుక్క పీకేసిన పిచ్చి మొక్కలా బిక్క మొహం వేసుకుని... వక్క నోట్లో కుక్కుతూ బొక్కుతూ డెక్కుతూ చుక్కలు లెక్కపెడుతూ... ఇక్కడే ఈ ఉక్కలో గుక్కపెట్టి ఏడుస్తూ... ఈ చుక్కల చొక్కా వేసుకుని డొక్కు వెధవలా గోళ్ళు చెక్కుకుంటూ నక్క పీనుగులా చక్కిలాలు తింటూ... అరటి తొక్కలా... ముంగిట్లో తుక్కులా... చిక్కు జుట్టు వేసుకుని... ముక్కు పొడి పీలుస్తూ... కోపం కక్కుతూ... పెళ్ళాన్ని రక్కుతూ... పెక్కు దిక్కుమాలిన పనులు చేస్తూ... రెక్కలు తెగిన అక్కుపక్షిలా నక్కి నక్కి ఈ చెక్కబల్ల మీద బక్కచిక్కలా పడుకోకపోతే... ఏ పక్కకో ఓ పక్కకు వెళ్ళి... పిక్కబలం కొద్ది తిరిగి... నీ డొక్కశుద్ధితో వాళ్ళని ఢక్కాముక్కీలు తినిపించి... నీ లక్కు పరీక్షించుకుని ఒక్క చక్కటి ఉద్యోగం చిక్కించుకొని ఒక్క చిక్కటి అడ్వాన్సు చెక్కు చెక్కుచెదరకుండా పుచ్చుకుని తీసుకురావచ్చు కదరా తిక్క సన్నాసి... ఇందులో 56 'క్క'లు ఉన్నాయి తెలుసా.

ఈ చిత్రాన్ని చూసి పులకించిపోయారు. 'సీరియల్‌గా ప్రచురితమవుతూ వచ్చిన 'చిరుమువ్వల మరుసవ్వడి' నవలను వారం వారం చదివేటప్పుడు ఆ పాత్రలన్నీ రూపుదాల్చి కళ్ళముందుకొస్తే ఎంత బావుణ్ణు అనిపించేది. 'ఆనందభైరవి' నా ఊహను నిజం చేసింది. మధురమైన అనుభూతిని కలిగించింది. నారాయణశర్మలో నాకు మా గురువుగారైన వెంపటి సత్యంగారు, లక్ష్మీదేవమ్మగారిలో మా గురువుగారి శ్రీమతి కనిపించారు. మాళవిక తనది కథక్ బాణీ అయినా, కూచిపూడి నృత్యాన్ని చక్కగా చేసి ఒప్పించింది' అని 'ఆనందభైరవి' గురించి ప్రత్యేకంగా ప్రశంసించారామె.

కథారచయిత కొండముది శ్రీరామచంద్ర మూర్తి అయితే 'ఆనందభైరవి' చూసి తెగ పొంగిపోయారు. 'నేనిచ్చిన మట్టిముద్దను అద్భుతమైన కళాఖండంగా తీర్చిదిద్ది రంగులు వేసి అందించారు జంధ్యాల' అని ప్రస్తుతించారు.

ఈ చిత్ర శతదినోత్సవం 1984 జులై 29న మద్రాసు లోని వల్లవర్‌కొట్టంలో జరిగింది. నాటి సమాచారశాఖామంత్రి చేగొండి హరిరామ జోగయ్య, ఎమ్మెన్‌రెడ్డి, ఎస్.పి. బాల రెండవ ఉత్తమ చిత్రంగా రాష్ట్ర ప్రభుత్వం అవార్డునిచ్చింది.

అమెరికా పర్యటనలో బిజీగా వుండటం వల్ల శాండిల్య ఈ చిత్రాన్ని జాతీయ అవార్డులకు పంపడం మరచి పోయారు. లేకుంటే ఈ చిత్రం ఖచ్చితంగా జాతీయ అవార్డుని సొంతం చేసుకునేదేమో! ఈ చిత్రం పదవ అంతర్జాతీయ చలనచిత్రోత్సవంలో ఇండియన్ పనోరమాకు సెలక్ట్ కాకపోయినా, ఫిలిం మార్కెటింగ్ విభాగంలో ప్రవేశాన్ని పొంది, అక్కడ జరిగిన ప్రదర్శనలతో దేశ, విదేశీ ప్రతినిధులను

పలువురిని విశేషంగా ఆకర్షించింది.

సంగీత ప్రధాన చిత్రమైనాగానీ జంధ్యాల అవకాశం దొరికినప్పుడు మాత్రం తన ఛమక్కులను ప్రదర్శించారు. సినిమా ప్రారంభంలో ఆనందం చదివే స్కూల్ ఫంక్షన్‌కి విచ్చేసిన ఓ రాజకీయనాయకుడు "ప్రియమైన మిత్రులారా.. ఇవ్వాళ నా జీవితంలో ఓ దుర్దినం. బాధతో నోట మాట రావడంలేదు" అంటూ పొరపాటున వేరే స్లిప్ చదివి నాలిక్కర్చుకునే సన్నివేశం జంధ్యాల మార్కు హాస్యానికి అద్దం పడుతుంది. అలాగే సుత్తిజంట వీరభద్రరావు, వేలుల కామెడీ హుషారు పుట్టించింది. వేలు తండ్రిగా వీరభద్రరావు డాక్టరు పాత్రలో రకరకాల ప్రాసల్తో మాట్లాడుతూ నవ్వించారు, కవ్వించారు. 'నాని నాని... నీ నూనె నీ నూనె నా నూనె నా నూనె, నా నూనె నీ నూనేనని నిన్న నేనన్నానా...' నోనో... నేనన్నానా నున్నని నాన్నా... నైనైనై అంటూ 'న' ప్రాసలోనూ, 'ఏ కాకి... కాకీక కాకికి కోక... ఆ కాకీక కాకికి కాక కోకికా కుకూకా...!?' అంటూ 'క' ప్రాసలోనూ వీరభద్రరావు తెగ నస పెడుతుంటే నవ్వని ప్రేక్షకుడు లేడంటే అతిశయోక్తి కాదేమో! అలాగే ఎక్కువ సంతోషం గానీ, బాధగానీ కలిగితే తనకు తెలియకుండానే ఈలవేసే శ్రీలక్ష్మి ఎపిసోడ్ కూడా ప్రేక్షకులను అలరించింది.

56 'జ'లు వచ్చేట్టుగా ఇష్టసుత్తి పేరుతో ఓ సన్మానపత్రం రాశారు 'హాసం' రాజా. జంధ్యాల ఈ ఇష్టసుత్తిని చాలా ఇష్టపడిపోయి తనకి సన్మానం జరిగిన ప్రతీచోటా ఈ సన్మానపత్రాన్ని చదివించుకున్నారు.

నేటి ప్రముఖ దర్శకుడు ఇ(ఈదర) వివి సత్యనారాయణ ఈ చిత్రానికి అసోసియేట్ డైరెక్టర్. అలాగే బాలాజీ ఆర్ట్స్ నిర్మాణ సంస్థ సమర్పకుడు, 'జూనియర్స్' చిత్ర దర్శకుడు జె.పుల్లారావు ఈ సినిమాకి అసిస్టెంట్ డైరెక్టర్.

కూచిపూడి నృత్య వైశిష్ట్యాన్ని వివరించిన ఈ సినిమా చివర 'శుభం' కార్డుకు బదులు 'నృత్యాంజలి' అని వేయడం సముచితం సమయోచితం.

**- పులగం చిన్నారాయణ**

'ఆనందభైరవి' సినిమాలో వీరభద్రరావు పాత్రకి ఓ విచిత్రమైన మేనరిజాన్ని జంధ్యాల కల్పించారు. ఆ పాత్ర అక్షరాల్తో, కవిత్వంతో రకరకాల ప్రయోగాలు చేస్తూ మాట్లాడుతుంది. ఆనందభైరవి విడుదలకాగానే జంధ్యాలకి ఆంధ్రదేశమంతటా విపరీతంగా సన్మానాలు జరిగాయి. హైదరాబాద్‌లో సన్మానం జరిగినప్పుడు ఆయన చేసిన ప్రయోగం గుర్తొచ్చేలా జర్నలిస్టు రాజా (ప్రస్తుతం 'హాసం' సంపాదకుడు) కొత్త తరహాలో "ఇది ఇష్ట సుత్తి సుమా" అంటూ జంధ్యాల గార్ని వేదిక మీదికి ఇలా ఆహ్వానించారు:

## ఇష్టసుత్తి



"జగజ్జెట్టీలు, జమా జెట్టీలు ఝుమ్‌ఝుమ్ అంటూ
జంకు లేకుండా జవజవ లాడిపోతున్న కవిత్వాన్ని
జనం మీదికి జాడించేస్తున్న ఈ రోజుల్లో
జడత్వాన్ని పోగొట్టేట్టుగా జనం నాడిలో
జవసత్వాల్ని నింపి ఝుంకార నాదాన్ని పూరిస్తూ
జండా ఎగరేసిన ఝంఝామారుత జమీందారు;
జరజరా జరిగే మాటల జాతరతో
ప్రేక్షకుల జానెడు గుండెల జాగాని,
జప్తుచేసి జలగలా పట్టుకునే జతగాడు;
జాజి గురించైనా, జాబిల్లి గురించైనా
జాతీయత గురించైనా... జూలోనైనా, జంగిల్‌లోనైనా
జూబిలీ సినిమాలు జయప్రదంగా తీసి
జయ జయ ధ్వానాలను అందుకోగల అజయ శివుడు;
తన రసఝరితో జబర్దస్తీగా జంపాల లూగించి
జనహృదయాల్ని ఝంఝూటి రాగంతో
జంపె తాళంతో ముడివేసి జమ ఖాతలో
వేసుకోగల ముద్దుల జామాత
అయిన శ్రీ జంధ్యాలగార్ని వేదికపైకి ఆహ్వానిస్తున్నాం"

అని పిలిచి, "జంధ్యాల గారూ ఏదో మా జంఝాటం కొద్దీ 'జ' లతో జమిలిగా కాస్త జంతర్ మంతర్ చేశాం. మొత్తం ఇందులో 56 'జ'లున్నాయి. లెక్కపెట్టుకోండి" అని చెప్పి నూతనంగా నవ్వించా రందర్నీ.

# ఎలుక వచ్చె ఇల్లు భద్రం



ఇలపావులూరి మురళీమోహనరావు

**32**

**హెచ్చరిక**

విరగబడి నవ్వితే గుండె చిక్కబట్టి ఊపిరాడక అవస్థపడేవారు కామెడీ యాక్ట్ 2003 ప్రకారం ఈ సీరియల్‌చదవడం నిషేధం.

ఒకవేళ మీ పొట్టచెక్కలైతే పత్రిక నుంచి ఎలాంటి పరిహారం రాదు. ఈ హెచ్చరిక ఈ సీరియల్ పూర్తయ్యేంత వరకు అమలులో ఉంటుంది.





**జరిగిన కథ**

వెంకట్రావు, సుందరిల ఇంట్లో ఓ ఎలుక చేరి నానా రభసా చేస్తుంది. దాన్ని చంపడానికి పెట్టిన ఎలుక మందును వాళ్ల పాప రుచిచూడడంతో ఉత్తుత్తి పరీక్షల పేరిట డాక్టర్లు వేలాది రూపాయలు ఖర్చు పెట్టిస్తారు. ఎలుకను చంపడానికి పిల్లిని తెస్తే పిల్లికూనలు పెడుతుంది. వాటిలో ఒకటి చస్తుంది. ప్రాయశ్చిత్తం అంటూ తూతూమంత్రాలతో పురోహితుడు దోచుకుంటాడు. ఈ కష్టాలన్నిటికీ వాస్తు సరిగ్గా లేకపోవడం కారణమంటూ వాస్తుపండితులు భయపెడతారు. చుట్టపు చూపుగా వచ్చిన వక్రతుండం వీరి ఇల్లు అమ్మే ప్రయత్నాలు చేస్తున్నాడని విని వెంకట్రావు ఇంటికి దారితీశాడు.

(ఇక చదవండి)

శాస్త్రిగారు మీద చొక్కా కూడా లేకుండా మోటార్ సైకిల్ పై వస్తున్నారు. ఇంటి ముందుకు రాగానే రోడ్డు దాటుతున్న పిల్లి ఒకటి శాస్త్రిగారి మోటార్ సైకిల్ కిందపడి పచ్చడైంది.

సడన్ బ్రేక్ వేశాడు వెంకట్రావు.

"అయ్యయ్యో శాస్త్రిగారూ...పిల్లి .... శ్రీకృష్ణుడి అవతారం ..మహాపాపం.. " అన్నాడు వెంకట్రావు.

పకపక నవ్వారు శాస్త్రిగారు. హెల్మెట్ ఉండటంతో వెంకట్రావును గుర్తించలేదు.

"ఎవడండీ చెప్పిన ఆ సన్యాసి గాడిద? శతక కారుడేమన్నాడు?

**అతినీచము కడుదుష్టము**
**అతిహేయము ఇంటిపీడ అది ఏదన్నన్**
**మతిగలిగిన ప్రతివాడూ**
**గతి తప్పక చెప్పుగాద గండు బిడాలమే!**

అని గంట గొట్టి గంటసేపు చెప్పాడు. పిల్లి పొరబాటున మనవల్ల చస్తే ఈడ్చి ముళ్ళ కంపలో పడెయ్యమన్నాడు" అంటూ శవాన్ని ఎడం చేత్తో ఎత్తి విసిరి అవతల పడేశారు శాస్త్రిగారు.

హెల్మెట్ తీశాడు వెంకట్రావు.

అంతే! యాక్సిలేటర్ చివరి కంటా తిప్పి అలాగే పట్టుకున్నారు శాస్త్రిగారు.

"ఓరి దుర్మార్గుడా ..శాస్త్రం నీకొకటి మాకొకటి? దొరక్కపోవురా... అప్పుడు చచ్చిన తరువాత కాదు.... బతికుండగానే నీ కండలను చీల్చి శనగపిండిలో కలిపి వేయిస్తాను" పళ్ళు కొరుక్కున్నాడు వెంకట్రావు బండి స్టార్ట్ చేసి.

వెంకట్రావు ఇంటి ముందు గుంపులు గుంపులుగా ఉన్నారు జనం. అంతా ఆ వీధిలోని వారు, కాలనీవారు.

"ఏవండీ....ఏవండీ..కొంపమునిగింది.. మనింటిని మా బాబాయి మనకు తెలియకుండా




వీరందరికీ అమ్మేసి అడ్వాన్సులు పుచ్చుకున్నాడట.. మాకు రిజిస్టర్ చెయ్యాలంటే మాకు రిజిస్టర్ చెయ్యాలని వీళ్ళంతా గొడవచేస్తున్నారు. నాకు చెమటలు వడుతున్నాయి. బీపీ పెరుగుతున్నది" రొప్పుతూ చెప్పింది సుందరి.

వెంకట్రావు కళ్ళు అగ్నిగోళాలయ్యాయి. "ఏమిటండీ...ఇదంతా ఏంటి? ఇల్లేంటి? అమ్మడమేంటి? ఎవరమ్మారు?ఎలా అమ్మారు? ఎవరు కొన్నారు? ఎలా కొన్నారు? ఏంటిగోల? వెళ్లండి" అరిచాడు.

"ఏవండోయ్..మర్యాదగా మాట్లాడండి.. ..సాక్షాత్తూ మీ మామగారు అమ్మారు... మీరు ఇబ్బందుల్లో ఉన్నారు. ఇంటినిండా వాస్తు

లోపాలున్నాయంటే నేను కొన్నాను. పేకాటలో ఓడిపోయిన డబ్బులు కూడా అందులోనే జమకట్టాడు. మీరు ప్లేటు తిరగేస్తున్నారు." కోపంగా అన్నాడు ఆనందరావు.

"నాకు పేకాటలో పదివేలు బాకీ పడ్డాడు. నాకూ అమ్మాడు" సుబ్బారావు అన్నాడు.

"నాతో పేకాడి పాతికవేలు అప్పుపడ్డాడు. నాక్కూడా ఇల్లమ్మాడు. లక్షరూపాయలు బయానా తీసుకున్నాడు" రంగారావు అరిచాడు.

"ఇల్లు మీకే అమ్మాలన్నాడు మా అల్లుడు అని చెప్పి నా దగ్గర ఏభైవేలు పుచ్చుకున్నారు మీ మామగారు" ఆక్రోశించాడు సూర్యారావు.

వెంకట్రావు ఆవేశంతో రగిలిపోయాడు.

"మామాగాడు దోమాగాడు. పెద్ద వెధవని పేరు పెట్టి పిలిస్తే బాగుండదని వరస కలిపి పిలిచా. నాలుగు రోజులింత పిండం పడేశా. నేను పెట్టిన పిండం తిని నా అండ పిండాలు పగలగొడతాడని నేనూహించలేదు. బిలీవ్ మి. వాడికి మాకూ ఏ సంబంధం లేదు. మీ లావాదేవీలలో నాకు నిమిత్తం లేదు" పెద్దగా అన్నాడు వెంకట్రావు.

"ఏవండోయ్ వెంకట్రావుగారూ... ఆయన పదిరోజుల నుంచీ మీ ఇంట్లో ఉండటం, మామయ్యగారూ అని మీరు, బాబాయ్ అని సుందరీ పిలుస్తుండటం రోజూ మా చెవులారా వింటూనే ఉన్నాం. ఇపుడు మామ కాదంటారేం? ఏ సంబంధం లేనివాడు ఇన్నాళ్ళనుంచి మీ ఇంట్లో ఎలా ఉంటున్నాడు? డబ్బు ఆయన చేతికిచ్చి దాటవేయించారు" కోపంగా అన్నది ఆండాళ్ళమ్మ.

"ఎక్కడ ఆ గాడిద కొడుకు? వాడి తిత్తి తీస్తాను. ఎక్కడే మీ బాబాయ్..ఛీ..ఛీ... ఆ దున్నపోతు.... జూదంలో సొంత ఇళ్ళూ వాకిళ్ళు అమ్ముకోవడం అయిపోయి ఊళ్ళో వాళ్ళ మీద పడ్డాడన్నమాట...." సుందరిని చూసి అరిచాడు వెంకట్రావు.

"ఏమో మరి. పొద్దుట్నించి కనిపించడం లేదండీ" చెప్పింది సుందరి.

"వెంకట్రావుగారూ. అదంతా మాకు తెలియదు. మర్యాదగా మా డబ్బు మాకు కక్కండి. లేకపోతే చీటింగ్ కేసుపెట్టాల్సొస్తుంది" హెచ్చరించాడు మరొకాయన.

"బాబూ...మా ఇంటివాస్తు దివ్యంగా ఉంది. మూఢనమ్మకాల బారిన పడి ఒక దశలో ఇల్లు అమ్ముకోవాలనుకున్న మాట నిజం. కానీ నాకు వాస్తు చెప్పిన వాడు దొంగ ముండాకొడుకన్న విషయం తెలిసిన తరువాత నా కలాంటి నమ్మకాలు పోయాయి. ఎలా జరగాల్సుంటే అలా జరుగుతుంది పదండి మీతో పాటు నేను కూడా పోలీసుస్టేషన్‌కు వస్తాను" అన్నాడు వెంకట్రావు.

"అవసరంలేదు" అన్నమాట వినిపించింది.



అందరూ అటువైపు చూశారు. మీసాలు మెలిదిప్పుతూ కనకలింగం, అతని చంకలో పిల్లిలా వణుకుతూ వక్రతుండం!

"పాతగోతాం భుజాన వేసుకుని బస్టాండులో తచ్చాడుతుంటే ఎవడినైనా మర్డర్ చేసి పార్శిల్ తీసుకెళ్ళుతున్నాడేమోనని అనుమానం వచ్చిపట్టుకున్నా. విప్పి చూస్తే నోట్ల కట్టలు. నాలుగు ఉతకగానే చెప్పాడు. నిజమోకాదో అని లాక్కొచ్చాను" చెప్పాడు కనలింగం.

"ఆ డబ్బు...మాదే... వాడిని కొట్టండి .. నరకండి... చంపండి...."అరిచారు అందరూ.

"నో...ఆపని చెయ్యడానికి మేమున్నాం. చట్టం మీ చుట్టం కాదు. కోర్టుకొచ్చి మీ మీ డబ్బులు తీసుకెళ్ళండి....అయ్యా..బాబూ... పదిహేనేళ్ళుగా హెడ్‌కానిస్టేబుల్ పదవిలో వేలాడుతున్నాను. మీకు పుణ్యం ఉంటుంది. కొంచెం మీరంతా నన్ను యస్సై పోస్టుకు రికమెండ్ చెయ్యండి" దణ్ణం పెట్టాడు కనకలింగం.

"యస్సై ఏం ఖర్మ... మిమ్మల్ని యస్పీ చెయ్యాలని స్టేషన్ ముందు ధర్నా చేస్తాం. పదండి" అన్నారందరూ ఆనందంతో.

"అయ్యా కనకలింగంగారూ.. తమరనుమతిస్తే ఒక్క మనవిచేస్తా" అన్నాడు వక్రతుండం తలవంచుకుని.

"ఏంట్రా? నా యిల్లు కూడా అమ్మేస్తావా?" అన్నాడు కనకలింగం లాఠీ ఎత్తి.

"కాదు బాబూ...కాదూ...అందరూ వినండి బాబూ....పేకాటవల్ల నేను పతనమై పోయాను. ఈగతి పట్టాను. కనుక మీరెవ్వరూ జన్మలో పేక ముక్కల వంక చూడద్దు. అలాగే దొంగబాబాలు, దొంగస్వాములు వంటివారి బారిన పడొద్దు. ఎవడైతే డబ్బునాశిస్తాడో వాడు స్వామేకాదు. ఇది నా సందేశం" అన్నాడు వక్రతుండం.

అందరూ పోలీస్‌స్టేషన్‌కు వెళ్ళారు.

వెంకట్రావు సుందరిని గిరగిర తిప్పాడు సంతోషం పట్టలేక.

"ష్...ఇది పబ్లిక్ ప్లేసు. బెడ్‌రూమ్‌లో వాస్తు అద్భుతంగా ఉంటుంది" అంటూ నవ్వింది సుందరి.

(సమాప్తం)

## అందమైన అనుభవానికి వందన సమర్పణ

'వాన చినుకు సముద్రంలో పడితే చిరునామా లేకుండా పోతుంది. ముత్యపు చిప్పలో పడితే ముత్యమై భాసిస్తుంది.' అన్న ఆర్యోక్తి నా సీరియల్ విషయంలో నూటికి నూరు పాళ్ళు నిజమైందని నా భావన.

ఇది నా తొలి సీరియల్. 'తొలి' అనేదానికి మనజీవితంలో చాలా ప్రాధాన్యముంటుంది. తొలిరేయి, తొలిసంపాదన, తొలిరచన...ఇలా జీవితంలో మొదటిసారిగా సంభవించే పరిణామాలు ఎంతో మధురంగా ఉంటాయి. నాకు ఈ సీరియల్ అలాగే.

కీర్తిశేషులు జంధ్యాల ఆదేశం మేర ఓ టెలీ సీరియల్ కోసం రచించిన ఈ నవల తొలిపాఠకుడు, నామకరణకర్త జంధ్యాలగారే. అందుకే ఈ నవలను వారి దివ్య స్మృతికి అంకితం గావిస్తున్నానని సీరియల్ తొలిభాగం ప్రచురణ అయిన సంచికలోనే ప్రస్తావించాను.

అయితే జంధ్యాల హఠాన్మరణంతో నా సీరియల్ దిక్కులేని అనాథ అయింది. సెక్సు, క్రైమ్ సీరియల్స్‌ను తప్ప హాస్యధారావాహికలను ప్రచురించే సాహసం చెయ్యని పత్రికలున్న తెలుగు రాష్ట్రంలో - నా శ్రమంతా వృథాయేనా అని బాధ పడుతున్న తరుణంలో 'హాసం' ప్రాదుర్భవించింది. మనకు మంచి రోజులొచ్చాయని నూటారు డిగ్రీలకు టెంపరేచర్ పెరిగింది. కానీ దీనికి సంపాదకుడు శ్రీరాజాగారని తెలిసిన తరువాత - విషయసూచికలోని ఘనాపాఠీల పేర్లు చూశాక - ఈ పత్రికలో మనబోంట్లు ఉత్తరం రాసినా అచ్చుకాదని గ్రహించి టెంపరేచర్ తొంభై ఎనిమిది పాయింట్ నాలుగుకొచ్చింది. నలుపు చేసిన నూట ఎనభై పేజీలను నలిపి కట్టగట్టి-మాయాబజార్లో ఘటోత్కచుడు దుసటచతుసటయాన్ని కట్టగట్టి హస్తినలో విసిరేసినట్లు- అటక మీద విసిరేశాను.

ఆ తరువాత నాలుగు మాసాలకు తెగించి- కొండకు వెంట్రుక ముడేసి లాగితే, వస్తేకొండ పోతే వెంట్రుక - అని తలంచి మళ్ళీ అటక ఎక్కాను. నా 'నూటెనభై పేజీల' ఎలుక వచ్చే ఇల్లుభద్రం' ఏ ఎలుక దంతయాత్రకు గురికాకుండా భద్రంగా 'ఎక్కడ వేసిన గొంగళి అక్కడే' మాదిరిగా పడిఉంది. అలాగే పార్శిల్ చేశాను 'హాసం' వారికి.

నెలరోజుల తరువాత రాజాగారినుంచి ఫోన్! క్లైమాక్స్‌ను మార్చి రాయమన్నారు. తు.చ. (అంటే అర్థం నాకు తెలియదు. అందరూ అంటూంటారు కాబట్టి అంటున్నాను) తప్పక పాటించాను. ఫలితం తెలిసింది! ఈ సీరియల్‌కు నామకరణం చేసిన జంధ్యాలగారు కూడా క్లైమాక్స్ మార్చమని సూచించారు. వేర్వేరు రంగాలలో శిఖరాలందుకున్న వారి అభిప్రాయాలు ఒకే రకంగా ఉండటం యాదృచ్ఛికమేమో! ఈ సీరియల్ ముగింపు సందర్భంగా ఈ క్రింది మహనీయులందరికీ కృతజ్ఞతాంజలులు సమర్పించుకుంటున్నాను.

రచయిత పేరు ప్రతిష్టలతో సంబంధం లేకుండా రచనను ప్రోత్సహించిన సంపాదకులు శ్రీరాజాగారికి, ఈ సీరియల్‌కు అందమైన ఇలస్ట్రేషన్స్ అందించిన శ్రీ కరుణాకర్‌గారికి (ఇతర పత్రికలలో వచ్చిన నా అనేక కథలకు వీరే చిత్రకారులు.), ఈ సీరియల్‌ను స్పాన్సర్ చేసిన కె.యం.సి. కన్‌స్ట్రక్షన్స్ అధినేత శ్రీరాజమోహన్‌రెడ్డి గారికీ, మధ్యలో ఒక క్విజ్ కార్యక్రమంలో పాల్గొని 'డ్రా'తీసిన ఆధునిక రేలంగి, సుప్రసిద్ధ హాస్యనటుడు శ్రీబ్రహ్మానందం గారికీ, హాసం సిబ్బందికీ- ముద్రారాక్షసాలను ఎక్కువగా అనుమతించని డి.టి.పి. సిబ్బందికీ, క్రమం తప్పకుండా చదువుతూ తమ అభిప్రాయాలను నిర్మొహమాటంగా తెలియజేసిన మిత్రులు, పెద్దలు, ముఖ్యంగా 'అభినవనారన' శ్రీగాడేపల్లి సీతారామమూర్తి కవి (అద్దంకి)గారికీ.

సుందరి పాత్రకు చాలా డైలాగులందించిన నా ప్రియసతి శారదకు ఆశీస్సులు.

ఎందరో మహానుభావులు. అందరికీ వందనములు.

## భిన్నత్వంలో ఏకత్వం




# హేమా సర్దేశాయ్ గాత్రం



పుట్టింది : ముంబాయ్

పెరిగింది : గోవా

**అవార్డులు & అఛీవ్ మెంట్స్**

- 1989లో జర్మనీ లో జరిగిన ఇంటర్నేషనల్ పాప్ సాంగ్ ఫెస్టివల్‌లో 'గ్రాండ్ ప్రిక్స్' అవార్డును గెలుచుకుంది. 'ఇండియన్ నైటింగేల్' గా ప్రశంసలందుకుంది.
- 1989 లోనే బెల్‌గ్రేడ్‌లో జరిగిన 'యునిసెఫ్ కన్సర్ట్' లో భారతదేశం తరపున పాల్గొంది.
- 1993లో హిందీ పాప్‌సాంగ్ 'ఛూతే.....నా' ద్వారా యం.టీవీ ఏసియా లోకి అడుగుపెట్టింది.

**పాడిన పాపులర్ జింగిల్స్**

- లిరిల్, పాండ్స్ డ్రీమ్ ఫ్లవర్ టాల్కంపౌడర్, మెలోడీ చాక్లెట్స్,సీతల్ దివా, మ్యాంగో ఫ్రూటీ, కోల్గెట్ జెల్, యాక్షన్ షూస్........

**గాత్రాన్నిచ్చిన సీరియల్స్**

- 'యహ్‌హై రాజ్', 'దునియా కే సితారే', 'రాహీ', 'హిప్ హిప్ హుర్రే...'

**మరువలేని జ్ఞాపకాలు**

- 1997 లో భారత స్వాతంత్ర్య స్వర్ణోత్సవాల సందర్భంగా న్యూఢిల్లీలోని విజయ్ చౌక్‌లో ఈ దేశాన్ని కీర్తిస్తూ' మై కౌన్ సా గీత్ సునావూ...' పాట పాడటం.
- ఎ.ఆర్.రెహమాన్ సంగీత దర్శకత్వంలో 'సప్నే' చిత్రం కోసం పాడిన 'ఆవారా..' అనే పాట దాదాపు 12 వారాల పాటు అన్ని మ్యూజిక్ కౌంట్ డౌన్ షోలలో ప్రథమ స్థానంలో వుండటం.

**టీవీ ఛానల్స్ లో కనిపించిన కార్యక్రమాలు**

- క్లోజ్ -అప్ అంత్యాక్షరి
- టివియస్ సరిగమ
- బోర్నవిటా క్విజ్ కాంటస్ట్
- స్టార్ యా కలాకర్
- పబ్లిక్ డిమాండ్

**తొలి ఆల్బమ్**

- 'హిందుస్తానీ గుడియా' (1998)

ఒకే ఒక పాటతో దేశవ్యాప్తంగా సంచలనం సృష్టించింది హేమా సర్దేశాయ్! దాదాపు ఆరేడు సంవత్సరాలు చిత్రసీమలో గుర్తింపు కోసం నానా అగచాట్లు పడిన హేమ, రాజీవ్ మీనన్ దర్శకత్వంలో రూపుదిద్దుకున్న 'సప్నే' (తెలుగులో 'మెరుపుకలలు)చిత్రంలోని 'అవారా....' అనే పాటతో రాత్రికి రాత్రి గుర్తింపును తెచ్చేసుకుంది. ఎ.ఆర్.రెహమాన్ స్వరపరిచిన ఆ పాట అప్పట్లో కౌంట్‌డౌన్ ప్రోగ్రామ్స్‌లో పది పన్నెండు వారాలకు పైగా టాప్ పొజిషన్‌లో ఉంది.

అయితే హేమానర్దేశాయ్ మాత్రం భారత్‌లోని భిన్నత్వంలో ఏకత్వానికి ప్రతీకగా మనం చెప్పుకోవచ్చు. ఆమె కంఠహారంలో హిందు,ముస్లిమ్, క్రిస్టియన్ మతాలకు సంబంధించిన ప్రతీకలుగా ఓమ్,786, క్రాస్ ముద్రలు ఉంటాయి. అంతేకాదు చేతికి శిక్కుల పవిత్ర తోరణం కట్టి ఉంటుంది. కేవలం వస్త్రధారణలోనే కాదు, గాత్రధారణలోనూ ఆమె ఈ భిన్నత్వంలో ఏకత్వాన్ని ప్రదర్శిస్తుంది.

ముంబాయిలో పుట్టి గోవాలో పెరిగిన హేమా నర్దేశాయ్ 1989లోనే 16వ అంతర్జాతీయ పాప్ సాంగ్ ఫెస్టివల్‌లో పాల్గొని జర్మనీలో గ్రాండ్ ప్రిక్స్ అవార్డు అందుకుంది. అనేక దేశాల నుండి వచ్చిన గాయనీ గాయకులలో ఆమె అతి పిన్నవయస్కురాలు కావడం ఓ విశేషం అయితే, అక్కడి న్యాయనిర్ణేతలు ఆమెను 'ఇండియన్ నైటింగేల్'అని సంబోధించడం, అలానే అదే వేదికపై 'ఆడియన్స్ డార్లింగ్' అవార్డునూ హేమా అందుకోవడం మరో విశేషం. అదే మాదిరిగా వివిధ దేశాల వారు పాల్గొనగా బెల్‌గ్రేడ్‌లో జరిగిన యునిసెఫ్ కన్సర్ట్‌కు కూడా భారత దేశపు ప్రతినిధిగా హేమా హాజరయ్యింది.

తనకు గుర్తింపు తెచ్చిపెట్టిన 'సప్నే' చిత్రంలోని పాట పాడినప్పడి రోజుల్ని తలుచుకుంటూ, "రాజీవ్ మీనన్ నన్ను ఆ చిత్ర సంగీత దర్శకుడు ఎ.ఆర్.రెహమాన్‌కు సిఫార్స్ చేశారు. మరో ఆలోచన లేకుండా రెహమాన్ నాతో ఫోన్‌లో మాట్లాడి, మర్నాడు విమానంలో చెన్నై రమ్మని చెప్పారు. ఊహించని ఈ అవకాశానికి నిజంగానే నేను సంభ్రమకు లోనయ్యాను. కళ్ళముందు కనిపించని శక్తి ఏదో నన్ను ఆ దిశగా నడిపించిందనే నాకు అనిపించింది. అప్పటికే రెహమాన్‌కు చక్కటి సంగీత దర్శకుడిగా పేరుంది. ఆ కారణంగా తొలుత కొంత టెన్షన్ ఫీలయ్యాను. అయితే ఆయన కనీసం నా వాయిస్‌ను టెస్ట్ కూడా చేయకుండానే పాట సన్నివేశాన్ని, పాడాల్సిన విధానాన్ని చెప్పి డైరెక్ట్‌గా రికార్డింగ్ ప్రారంభించారు. ఆ తర్వాత ఆ పాట ఎంత సంచలనం సృష్టించిందో అందరికీ తెలిసిందే. బాలీవుడ్‌లోని టాప్50పాటల్లో ఇది కూడా ఒకటిగా నిలిచింది"అని చెప్పింది హేమ.

అయితే ఆ తర్వాత వరుసగా కొన్ని అవకాశాలు వచ్చినా, హేమకు అంత పేరు తెచ్చిపెట్టే పాట మరేది రాలేదు. దానికి కారణం చెబుతూ,"నేను దేవుడ్ని విశ్వసిస్తాను. మనకి ఏది ఎంత ప్రాప్తమో దానిని ఆయన అందిస్తారు. నా విషయంలో ఓరకంగా చెప్పాలంటే రెహమాన్ సారే దేవుడు. ఆయన ఇచ్చిన బ్రేక్ వల్లే నేనీ రంగంలో ఇంకా కొనసాగుతున్నాను. అయితే పాటలు పాడేందుకు సంగీత దర్శకుల్ని కలవడం,వాళ్ళని అవకాశం కోసం ప్రాధేయపడటం నాకిష్టం ఉండదు. నాకు వచ్చిన అవకాశాల్ని మాత్రం నేను సద్వినియోగ పరుచుకుంటాను. అందువల్లే ఇప్పటికీ నాకంటూ ఓ స్థానం బాలీవుడ్ సంగీత ప్రపంచంలో ఉంది. మంచి సంగీత దర్శకులు రెహమాన్, రాజేష్ రోషన్,విజు షా, నదీమ్-శ్రావణ్, అనుమలిక్,దిలీప్ సేన్-సమీర్ సేన్,విశాల్ భరద్వాజ్,అదేశ్ శ్రీవాత్సవ్,సంజీవ్-దర్శన్ తదితరులందరి చిత్రాలకూ నేను పాటలు పాడటం జరిగింది" అని చెబుతోంది.



తన తల్లిదండ్రులు సంగీత రంగంతో పరిచయం లేని వారని చెబుతూ,"ఆరేళ్ళ వయసులో మా స్కూల్లో టీచర్ నాకు చక్కటి గొంతు ఉందని గ్రహించింది. ఆవిడ ప్రోత్సాహం కారణంగానే పాటలు పాడటం మొదలు పెట్టాను. తొలి ప్రదర్శన ఎనిమిదేళ్ళ వయసులో నవరాత్రి ఉత్సవాలకు ఇచ్చాను. ఖాళీ ఉన్నప్పుడల్లా ఇంటి పెరటిలో లతా మంగేష్కర్, ఆశాల పాపులర్ పాటల్ని గొంతెత్తి పాడుతూ ఉండేదాన్ని. వీధిన వెళ్ళేవాళ్ళు వాటిని విని, మీ అమ్మాయి గొంతు చాలా బాగుంది అంటూ మా నాన్నగారికి చెప్పేవాళ్ళు. దాంతో ఆయన కూడా నన్ను గాయనిగా ప్రోత్సహించడానికి సిద్ధపడారు. ఆ క్రమంలో నేను గోవన్,లాటిన్, పోర్చుగీస్ నంగీతాలను అధ్యయనం చేసే అవకాశం కలిగింది. ఆ తర్వాత భారతీయ శాస్త్రీయ సంగీతాన్ని అధ్యయనం చేశాను. ఇంగ్లీష్,హిందీతో పాటుగా ఇతర భారతీయ భాషల్లోనూ పాటలు పాడాను" అని చెప్పింది.

## పాప్‌రంగంలోకి అడుగు

పాప్ సింగర్‌గా కెరీర్‌ను ప్రారంభించి, ఆ గుర్తింపుతో సినీ నేపథ్య గానంలోకి కొందరు గాయనీ గాయకులు ప్రవేశిస్తే అందుకు భిన్నంగా, నేపథ్యగానం నుండి హేమా సర్దేశాయ్ పాప్ ప్రపంచలోకి అడుగుపెట్టింది. నేపథ్యగాయనిగా వచ్చే పేరు గొప్పదే అయినా, ప్రైవేట్ ఆల్బమ్‌లోవచ్చే గుర్తింపు మరింత ఎక్కువని ఆ సక్సెస్ ఇచ్చే అనుభూతే వేరు అని హేమా చెబుతోంది.

అయితే ఆడియో రంగంలో ప్రముఖ సంస్థలైన వీనస్,టిప్స్ రెండింటికీ హేమా ఆల్బమ్స్ చేసి పెట్టింది. ఆ విషయంలోనూ ఈ రెండు సంస్థల మధ్య కొంత స్పర్థ ఏర్పడింది. దాని తెర వెనుక కథను చెబుతూ,"సప్నే సినిమాలో నేనే పాట పాడక ముందే వీనస్ సంస్థ నాతో ఓ ప్రవేట్ ఆల్బమ్ చేయడానికి ముందుకు వచ్చింది. ఎప్పుడైతే 'సప్నే' లోని 'ఆవారా...' పాట సక్సెస్ అయ్యిందో టిప్స్ సంస్థ కూడా మంచి పారితోషికాన్ని ఇస్తామని నన్ను అప్రోచ్ అయ్యింది. అయితే ముందుగా ఇచ్చిన మాట మీద నిలబడి నేను వీనస్ సంస్థ కోసం 'హిందుస్థానీ గుడియా'ఆల్బమ్ చేశాను. ఆ ఆల్బమ్ గ్రాండ్ నక్సెస్ అయ్యింది. ఐదువారాల పాటు టాప్‌టెన్‌లో ప్రథమస్థానంలోనిలిచింది. ఆ యేడాది ఇటు సినిమాల్లోనూ నేను పాడిన పాటలు బాగా సక్సెస్ అయ్యాయి. ఆ తర్వాత 1999 లో టిప్స్ కోసం 'పియా సే మిల్కే ఆయే నయన్" ఆల్బమ్ చేశాను. ఆ సీజన్ అది గ్రాండ్ సక్సెస్‌ను పొందింది" అని చెప్పింది.

ఆ తర్వాత హేమా 'సజన్' అనే ఆల్బమ్‌ను విడుదల చేసింది. దీనిని టిప్స్ సంస్థే విడుదల చేసింది. జవహార్ వట్టల్ నంగీతాన్ని అందించగా, పాటల్ని సమీర్ రాశారు. ఈ ఆల్బమ్ కూడా హేమా సర్దేశాయ్‌కు ఇండీ పాప్ రంగంలో మంచి గుర్తింపును తెచ్చి పెట్టింది. ఇందులో ఫోక్ ట్యూన్స్, సెమీ క్లాసిక్,బాలే... ఇలా అన్ని రకాల పాటలకు హేమ చోటిచ్చింది. అంతేకాదు ఇంటర్నేషనల్ పాప్ రంగంలో ఇండీపాప్‌కు ప్రత్యేక స్థానం కల్పించాలన్నది తన సంకల్పంగా చెబుతున్న హేమ 'కాల్ మీ ఎటర్నిటీ' అనే ఓ ఇంగ్లీష్ ఆల్బమ్‌నూ విడుదల చేసింది. ఎప్పటికైనా తాను పాడే ఇంగ్లీష్, హిందీ పాటల ద్వారా గ్రామీ అవార్డును అందుకోవాలన్నదే తన ధ్యేయమంటోంది హేమా సర్దేశాయ్.

**- వి.అరుణ సత్యవతి**

న్యూస్ వ్యూస్

# 'నువ్వొస్తానంటే నే ఒద్దంటానా'

## ఎమ్మెస్ రాజుతో ఆడియో కంపెనీలు



నటుడు, డ్యాన్స్‌మాస్టర్ అయిన ప్రభుదేవా దర్శకత్వంలో ప్రముఖ నిర్మాత ఎమ్మెస్‌రాజు ఓ చిత్రాన్ని నిర్మిస్తున్న సంగతి దాదాపు సినీ ప్రేక్షకులందరికీ తెలిసిన విషయమే. డ్యాన్స్ మాస్టర్లు దర్శకులుగా మారటం పరిశ్రమకు కొత్తకాదు. అప్పట్లో వేదాంతం రాఘవయ్య, కె.యస్.రెడ్డి, ఈ మధ్య లారెన్స్, ఇవాళ ప్రభుదేవా! ఎమ్మెస్ రాజు నిర్మించిన 'దేవి' చిత్రం ద్వారా సంగీత దర్శకుడైన దేవీశ్రీప్రసాద్ 'వర్షం' తర్వాత ఈ చిత్రానికి కూడా సంగీతాన్నిస్తున్నారు. 'వర్షం'లో 'ఇన్నాళ్లగ్గుర్తొచ్చానా వానా' పాటలోని **'నువ్వొస్తానంటే నే ఒద్దంటానా'** అనే 'హుక్‌లైన్' నే ఈ సినిమాకి టైటిల్‌గా నిర్ణయించటం, ఆ పాటకి కొరియోగ్రఫీ అందించినది కూడా ప్రభుదేవాయే కావటం ఇవన్నీ ఒకదానికొకటి అనుకోకుండా కలిసొచ్చినవి.

కలిసొచ్చే రోజులొస్తే నడిచొచ్చే కొడుకు పుడతాడన్నట్టుగా 'ఈ సినిమా ఇలా చేస్తున్నాం' అంటూ ప్రెస్‌మీట్ పెట్టిన రోజే మూడు ఆడియో కంపెనీలకు చెందిన ముగ్గురు ప్రముఖ వ్యక్తులు ఆడియో రైట్స్ కోసం ఎమ్మెస్ రాజుగారి ఆఫీసుకి వచ్చారు. ప్రెస్‌మీట్ అవుతున్నంతసేపూ ఎదురుచూస్తూనే ఉన్నారు. అందులో ఒకాయన మధ్యలో వెళ్లిపోయారు. ఆయన అలా వెళ్లిపోయిన కాస్సేపటికి ఎమ్మెస్‌రాజుగారి సెల్‌కి ఓ మెసేజ్ వచ్చింది. 'కొంచెం అర్జెంటు పని ఉండటం వల్ల వెళ్లాల్సి వచ్చింది. మీ టేబుల్ మీద సంతకం చేసిన ఓ బ్లాంక్ చెక్ వదిలి వెళ్లాను. మీ ఇష్టం వచ్చిన ఫిగర్ వేసుకుని ఆడియో రైట్స్ ఫైనలైజ్ చేయండి' అన్నది ఆ మెసేజ్ సారాంశం. దీన్ని బట్టి ఊహించుకోవచ్చు - ప్రభుదేవా -దేవీశ్రీ ప్రసాద్‌లతో ఎమ్మెస్ రాజు చేయబోతున్న ఈ చిత్రం ఆడియోపట్ల అప్పుడే ఎన్ని అంచనాలు మొదలయ్యాయో!?





# వందేమాతరం...వందేమాతరం...వందేమాతరం

సినీపరిశ్రమలో ఎవ్వర్‌స్మైలింగ్ ఫేస్ ఎవరిదని ఎవర్నడిగినా వచ్చే సమాధానం - వందేమాతరం శ్రీనివాస్‌దనే ! ఆయనింకా సంగీత దర్శకుడు కాకముందు ఓసారి బాలుగారు ఆయన్ని ఈ పత్రిక సంపాదకుడికి పరిచయం చేస్తూ "మీరు కత్తిపెట్టి పొడిచెయ్యండి... ఆ ముఖంలో నవ్వు అలాగే ఉంటుంది" అని అన్నారు జోక్ చేస్తూ. "చూస్తూ ఉండండి... భవిష్యత్తులో అదే అతనికి శ్రీరామరక్ష అవుతుంది" అని కూడా అన్నారాయన ఆనాడు ప్రశంసాపూర్వకంగా.



నవ్వుతూ అందర్నీ పలకరించే వందేమాతరంలోని వినయం పరిశ్రమలోని వారిని తెగ ఆకట్టుకుంటోంది. హాస్యనటుడు వేణుమాధవ్ అయితే ఏకంగా 'ఎకో ఛాంబర్' అని వందేమాతరంకి ఓ నిక్‌నేమ్ తగిలించాడు కూడా. ఎందుకంటే - మనం ఒకసారి నమస్కారం పెడితే - తిరిగి ఆయన 'నమస్కారమండీ నమస్కారమండీ నమస్కారమండీ' అని మళ్లీ మనం వద్దనే వరకూ నవ్వుతూ నమస్కారం పెడతాడట. (ఏదైనా ఒక సౌండ్ వస్తే ఆ సౌండ్‌కి రీసౌండ్ పలుమార్లు రావటాన్ని ఎకో ఎఫెక్ట్ అని అంటారు సినీ భాషలో) ఇంతకీ ఈ 'ఎకో ఛాంబర్' పేరు బైట పడిందెప్పుడంటే ఎమ్మెస్ నారాయణ దర్శకత్వం వహించిన 'కొడుకు' ఆడియో రిలీజ్ ఫంక్షన్‌లో. 'మన ఎకో ఛాంబర్ వందేమాతరం శ్రీనివాస్ గారిని వేదిక మీదకి రావలిసిందిగా కోరుకుంటున్నాను' అని ఆహ్వానించి ఎకోఛాంబర్ వృత్తాంతాన్ని వివరించాడు వేణుమాధవ్. ఈ ఫంక్షన్‌లో జరిగిన మరో సరదా సంఘటన ఏమిటంటే - ఆడియో రిలీజ్ చేసిన అక్కినేని నాగార్జున క్యాసెట్‌లను వేదిక మీదున్న ప్రముఖులకు ఒక్కొక్కరికీ యిస్తూ బ్రహ్మానందంకి మాత్రం క్యాచ్ పట్టమన్నట్టు విసిరారు. బ్రహ్మానందం బ్రహ్మాండంగా క్యాచ్‌పట్టి థమ్సప్‌లా బొటనవేలు చూపించారు. వెంటనే నాగార్జున కూడా అదే పద్ధతిలో 'గెలిచావ్' అన్నట్టు రియాక్షన్ ఇచ్చారు. ఇది చూసి వందేమాతరం శ్రీనివాస్ తన రెగ్యులర్ ధోరణిలో ఎకో స్మైలింగ్ ఇచ్చారు.

రచన: చంద్రబోస్ (1) గానం: శంకర్ మహదేవన్

ఢం ఢమారే ఢం ఢమారే ఢం ఢమారే ఢం ॥3॥
సాంబ హే సాంబ సాంబ హే సాంబ
ఢం ఢమారే ఢం ఢం ఢం ఢం ఢమారే ఢం ఢం
దద్దరిల్లె అడుగుల శబ్దం సాంబ హై సాంబ
గుం గుమారె గుం గుం గుండెలోనే కైలాసం
గుట్టువిప్పే మూడో నేత్రం సాంబ హై సాంబ
చిన్నోడినే... చిన్నోడినే నీ చూపులో
ఉన్నోడినే నీ నీడలో
ఎదురింటి చంటిని పొరుగింటి పండుని
మీయింటి గూటిలోన నేను ఒక్కణ్ణి
మనసింటి రాజుని మమతింటి బంటుని
మీ ప్రేమ మందిరాన వీర భక్తుణ్ణి హో... ॥ఢం ఢమారే ఢం॥
ధీం త నం త తర తన్న ధీం త నం త తర తన్న హో..హో.. హో..
అటేమో చెల్లెమ్మ ఇటేమో బుల్లెమ్మ
చెల్లెమ్మ చెయ్యట్టి బుల్లెమ్మ బుగ్గట్టి లాలించనా హో...
అటేమో పేదోడు.. ఇటేమో పెద్దోడు
పేదోణ్ణి పెంచేసి పెద్దోణ్ణి చేసేసి ముందుంచనా
ఏకకాలంలోన ఎన్నో జరిపించనా
ఎదురేది అనిపించనా
ఏది సాధించినా ఏంతో పేరొందినా
మీ ఎదమూల ఒదిగుండనా ॥ఢం ఢమారే ఢం॥
జాబిల్లి ఓ కంట సూరీడు ఓ కంట
వెన్నెల్లి ఓ చోట నిప్పుల్ని ఓ చోట కురిపించనా హో..
పువ్వుంది ఓ చేత పిడిబాకుంది ఓ చేత
గంధాలు ఓ చోట పందాలు ఓ చోట రగిలించనా
కొంచెం తీపున్నది కొంచెం పులుపున్నది
రెండింట్లో రుచి ఉన్నది
మంచి గుణమున్నది మొండితనమున్నది
మాటల్లో మనసున్నది
శిరసొంచినేనిలా చెయ్యెత్తి మొక్కనా
దైవాలు మీరె కాదా నాకు లోకానా
మీ ప్రేమకు నే సదా బానిసనై ఉండనా
ఈ భూమి ప్రపంచ పటాన ఉన్నంత కాలానా॥ఢం ఢమారే ఢం॥



రచన: భువనచంద్ర (2) గానం: యస్.పి.చరణ్, గంగ

కో: చికు చికు మామా చికు మామా
చికు చికు మామా చికునా చికునా ॥చికు॥
ఆ: తగిలినది రబ్బా తీపి తొలిదెబ్బ
అదిరినది రబ్బా జివ్వుమని జబ్బా
అ: ఉలికిపడకమ్మా రామచిలకమ్మా
వలపు గిలి పుడితే ఊగదటెకొమ్మా ఆ: ॥తగిలినది॥
అ: హృదయాలు పెనవేయాలి పరువాల పల్లకిలో ॥2॥
ఎదలోతు కనిపెట్టేలా సరదాల తాకిడిలో
ఆ: చూపులకు మాటొస్తే కథలు చెబుతాయేమో
పెదవులకు చనువిస్తే మధువొలుకుతాయేమో
అ: కలలు కురిపించే కన్నె సిరి బొమ్మా
సొగసు పనిపెడతా కాస్త ఇటు రామ్మా ఆ: ॥తగిలినది॥
కో: చికు చికు మామా చికు మామా
చికు చికు మామా చికునా చికునా
లా లా లాలల లల లా లాలల లా
లా లాలల లల లా లాలల
ఆ: మీసాలు ఉన్నోళ్లంతా మొనగాళ్లు కారంట ॥2॥
మొనగాళ్లు ఎందరు ఉన్నా నీకు సరికారంట
అ: నీ వాలు కళ్లల్లో నేను ఒదిగుంటాలే
నీ గుండె సవ్వడినై నేను తిలకిస్తాలే
ఆ: మధన ప్రియ రాగం నీకు వినిపిస్తా
పరమ సుఖమిచ్చే ప్రేమ తినిపిస్తా ॥తగిలినది॥

రచన: సుద్దాల అశోక్‌తేజ (3) గానం: మనో, స్వర్ణలత

కో: కిత కిత కిత కిత కిత కిత ॥3॥
అ: కితకితలు పెట్టమాకు అందాల అత్తకూతురా
ఆ: కుతకుత ఉడికించమాకు గుండెల్లో పాలు చక్కెరా
అ: నడుము నరంలో పడుచు జ్వరంలో
అదుపు తప్పిందే మనసు ఇవ్వాళ
ఆ: ఒడిసి పట్టేసే ఒడుపు ఉందయ్యో
ఇపుడే అటో ఇటో ఎటో కానీయ్ రో
అ: అరె ఎదురుంగ వచ్చెనే సిల్కుసితారా
ఇక మెల్లంగ గోటితో మీటేకుంటా రా
ఆ: మరి మోగించి చూసుకో ఈడు నగారా
నను ఊరించి వెళ్లకు మామ కుమారా అ: ॥కితకితలు॥
కో: చికు చికు చికా చికా చికు చికు చా ॥3॥
అ: కనికట్టు చేయకే కొరమేనా
రసపట్టు ఆపకే నెరజాణ
ఆ: తొడపైన కూర్చునే సమయాన
జడపట్టి లాగితే పడిపోనా
అ: ఢీ అంటే ఢీ కొట్టే
నాతోనే తమాషా నిను గిలకొట్టే పూల గిలాసా
ఆ: కిత కిత కిత కితా కితా కిత కిత కితరా
అ: కుత కుత కుతా కుతా కుత కుత కుతలే
ఆ: కిత కిత కిత కితా కితా కిత కిత కితరా
అ: కుత కుత కుతా కుతా కుత కుత కుతలే ॥కితకితలు॥
అ: గదిలోకి నన్నిలా పిలిచాక గడియేసి నాకిలా తగిలాక
ఆ: కొరికేసే చూపుతో చూశాక నమిలేసే కౌగిలి ఇచ్చాక
అ: బాగుందా నచ్చిందా నిజంగా వరంగా
నాకు దొరికావే మధుర ఫలంగా
ఆ: కిత కిత కిత కితా కితా కిత కిత కితరా
అ: కుత కుత కుతా కుతా కుత కుత కుతలే
ఆ: కిత కిత కిత కితా కితా కిత కిత కితరా
అ: కుత కుత కుతా కుతా కుత కుత కుతలే ॥కితకితలు॥

రచన: భువనచంద్ర (4) గానం: యస్.పి.చరణ్, సుజాత

ఆ: నందమూరి చందమామకెంత ఊపో
కన్నెపూవు చేతికిస్తే ఎంతకైపో ॥నందమూరి॥
అ: బ్రెడ్డుముక్కలాంటి బుగ్గ ఎంత తీపో
బొడ్డు కింది చీరకట్టు ఎంత సోకో
ఆ: తెలిసే రైక గుట్టుమీద ముక్కుపుడక
చూసెయ్ వాయిదా చీరమీద సిగ్గుమొలక
అ: ఒక్కసారి గట్టు దాటితే పిల్లగుట్టు కంచికే భామ
ఆ: రెచ్చిరేగి జోల పాడితే రాతిరంత జాతరే మామా॥నందమూరి॥
అ: ఆకుచాటు పండు చూస్తే ఆకలేయ్‌దా ఊర్వశి
ఆ: జంటచేరి పంచుకుంటే తెలిసిపోదా ఆ రుచి
అ: ఆకుచాటు పండు చూస్తే ఆకలేయ్‌దా ఊర్వశి
ఆ: జంటచేరి పంచుకుంటే తెలిసిపోదా ఆ రుచి
అ: ఓ...చెలి..ఇలా... సవాలు చేసి
రా...అని.. యమా హుషారుగుంటే
నీ..పని.. అలా... పట్టేసి నిను బరిలో దింపేయ్‌నా
ఆ: రా..రయ్యో.. నీతో... పందాలు కట్టి
జో..రుగా ఇలా.. పంతాలు పట్టి
నా సొతే...అహో పణంగా పెట్టి ఊగే దెట్టాగ
అ: బ్రెడ్డుముక్కలాంటి బుగ్గ ఎంత తీపో
బొడ్డు కింది చీరకట్టు ఎంత సోకో
ఆ: నందమూరి చందమామకెంత ఊపో
కన్నెపూవు చేతికిస్తే ఎంతకైపో
ఆ: నిన్ను చూస్తే కంటిమీద కునుకురాదు పిల్లడో
అ: మత్తులోన పడకముందే ముద్దులిచ్చి పారిపో
ఆ: నిన్ను చూస్తే కంటిమీద కునుకురాదు పిల్లడో
అ: మత్తులోన పడకముందే ముద్దులిచ్చి పారిపో
ఆ: హో...ప్రియా...ప్రియా..ఇలాగ నన్ను
పో...అని...అహో...అన్నాక నేను..
ఓ...సుఖం సదా కావాలి అంటూ వేగేదెట్టాగా...
అ: కో...పమా చెలీ.. కవ్వించుకుంటే
తా..పమా మరి తమాషా చేస్తా హాయిగా... ఇలా
ఒళ్లోకి వస్తే స్వర్గం చూపెయ్‌నా ఆ: ॥నందమూరి॥

రచన: సాహితి (5) గానం: కార్తీక్, మహాలక్ష్మి

అ: లర్గంబర్గ్ లక్స్ సుందరీ ఓ సారియ్ వే కిస్ క్యాడ్‌బరీ
చేసేస్తా నే నీ స్వీటు లిప్ చోరీ వా...వారీ...మదనారీ
ఆ: లర్గంబర్గ్ లక్స్ సుందరీ లైనేవేస్తే పడదుగా మరి
టేకిటీజీ ఐ యామ్ సో సారీ పోహోయీ...బ్రహ్మచారి
అ: ఓ...ఓ...నీ సారీ నాకు తెలుసులే ఈ సారి ఊరుకోను అసలే
ఆ: ఓ...ఓ...ఓ... నాదసలే దోర వయసులే
నీ చూపు రేగిపోయె సెగలే
అ: కిందా పైనా లోనా తెగ చలిగా ఉన్నా
ఆ: అమ్మో...రమ్మంటున్నా బరి తెగించి వస్తానా
అ: నువ్వే నై నై అన్నా నిను విడనే మైనా
ఆ: ఆశే...సైసై అన్నా కసిగులాబి ఇస్తానా అ: ॥లర్గంబర్గ్॥
అ: మల్లెల పొద్దుల చందమామ మాపటికొస్తే విందుభామ
అడిగింది ఇక నిన్నే ఇంకా వీడబోనమ్మా
ఆ: చేయకు మారం చిన్ని రామ పైటె లాగకు బాలభీమ
చేయ్యేవేస్తే మువ్వేనాది జివ్వుమందమ్మా
అ: ఓ...ఓ...ఓ...కన్నెస్తే నిదరపోనులే కమ్మేస్తా సన్నజాజి వలలే
ఆ: ఓ...ఓ...ఓ...కన్నుల్లో కలల వరదలే మరదలైన కథలే
అ: వయ్యారంగా ఉంగా జత హరిలోరంగా
ఆ: తీరంగా నీ బెంగ మరి ఒకింతదూరంగా
అ: నీకే ఇంతటి సిగ్గా నను పెనవేయంగా
ఆ: పో పోరా సారంగా పై పడొద్దు కారంగా
ఆ: సింగన కొండ సింగమామ హంగులు చూసి లొంగనమ్మా
సందె ఇస్తే కొంగే దోచే దొంగే నీవమ్మా
అ: వన్నెలు చూస్తే పండునిమ్మా వెన్నెల నాతో పంచుకోమ్మా
నీ ఒడి కోసం ఒకటే ఒకటే తొందరగుందమ్మా
ఆ: ఓ...ఓ...ఓ.. నువ్వే నా మల్లె తీగవి పూలిస్తే పంపుతాను కబురే...
అ: ఓ...ఓ...ఓ.. రేపే నీ బుగ్గ చిగురునే కోసేస్తే అబ్బ ఎంత సుఖమే
ఆ: నడు నడు బావా చాల్లే నీ జడ కోలాటం
అ: నడుమే వాటెయ్ మందే నా భుజాల బులపాటం
ఆ: మరి మరి పెంచొద్దయ్యో నా పెదవారాటం
అ: ఒకపరి మురిపించమ్మో నీ రవంత శృంగారం ॥లర్గంబర్గ్॥

రచన: చంద్రబోస్ (6) గానం: టిప్పు, చిత్ర

ఆ: నమస్తే...నమస్తే..నీకు నమస్తే
నీ ఇంటి తలుపు తెరిస్తే
అ: నమస్తే...నమస్తే..నీకు నమస్తే
నా ఒంటి ఉడుకు భరిస్తే
ఆ: చారణా ఇస్తా ఆఠాణా ఇస్తా
నా పుట్టు మచ్చలన్నీ తెల్లగ చేచ్చేస్తే
అ: ఏదైనా ఇస్తా ఎంతైనా ఇస్తా
పెదవుల్లో పెదవులకి గొళ్లెం వేస్తే
ఆ: తే..తే..తే... పువ్వుల గుత్తే... వరిస్తే ..తే..తే...తే...పచ్చని పుస్తే
అ: తే..తే..తే..తే...సోకుల కత్తే...అరి స్తే..తే..తే..తే..నాకూ కొత్తే
ఆ: నమస్తే...నమస్తే..నీకు నమస్తే
నీ ఇంటి తలుపు తెరిస్తే
అ: నమస్తే...నమస్తే..నీకు నమస్తే
నా ఒంటి ఉడుకు భరిస్తే
అ: క తోటి మొదలయ్యే కన్ను కొట్టేస్తే
కి తోటి మొదలయ్యే కిస్సు కొట్టేస్తా
ఆ: అరె చా...చా..చా..చా...చాటుకొస్తావా...
తెగించి చీ చీ చీ చీ చిందులేస్తావా
అ: న తోటి మొదలయ్యే నవ్వు నువ్విస్తే
ని తోటి మొదలయ్యే నిప్పు పుట్టిస్తా
ఆ: అరె...జ..జ..జ..జ.. జంటకొస్తావా
ఆరెంజు..జు...జు...జుర్రేస్తావా
అ: త థ ద ధ రావే నా పాపా రాసకేళి సాగించాలా
ఆ: ప ఫా బా భా నా యారా లవ్వా వారెవావా అనిపించాలా
అ: లే లే లే లే జాజిమల్లే అరె యారె లే లే జారుడు బల్లే
ఆ: లే లే లే లే మన్మథుడల్లే విరగాలే లే లే మంచంకోళ్లే
కో: నమస్తే...నమస్తే..నీకు నమస్తే
ఆ: మీ ఇంటి తలుపు తెరిస్తే
కో: నమస్తే...నమస్తే..నీకు నమస్తే
అ: నా ఒంటి ఉడుకు భరిస్తే
కో: తక్ హరిణి కుహు అందచంద తక్ తక్ కుహు హరిణి॥3॥
అ: పెంచావే పరువాలు ఉట్టిపడేలా
గుంజావే నా గుండె ఊడిపడేలా
ఆ: భలే చూస్తావయ్యో మనసుపడేలా
వలే వేసావయ్యో వెనకపడేలా
అ: రావాలే రాత్రిళ్లు హింసపడేలా
ఇరుగోళ్లు పొరుగోళ్లు ఈర్ష్యపడేలా
ఆ: చలి పెంచావయ్యో బెంగపడేలా
చలాయించాలయ్యో రంగు పడేలా
అ: యవ్వనంలో ఎన్నెన్ని పడులో
పడుతూ లేస్తూ ఏం చెయ్యాలో
ఆ: పడకటింట్లో ఇంకెన్ని పడులో
పాటుపడితే అంతే చాలు
అ: స స స స సందిస్తావా భరోసా...సా...సా...సా.... అందిస్తావా
ఆ: సా సా సా సా సాగిస్తావా పఖా సా..సా..సా సా చేరుస్తావా॥నమస్తే॥

పాటల పుస్తక ప్రియులకోసం సినీ సంగీత విశ్లేషకుడు 'రాజా' పర్యవేక్షణలో 'హాసం' అందిస్తున్న ప్రత్యేక కానుక ఇది.




## తారాగణం

ఎన్టీఆర్, భూమిక, జెనీలియా డిసౌజా, ప్రకాష్‌రాజ్, నాజర్, మన్సూర్ అలీఖాన్, తనికెళ్ళ భరణి, సితార, షర్మిల, సుకన్య, చలపతిరావు, ఆహుతి ప్రసాద్, ఎం.ఎస్.నారాయణ, ఎల్.బి.శ్రీరామ్, ఆలీ, వేణుమాధవ్, మల్లాది రాఘవ, హేమంత్ రావణ్, రాజీవ్ కనకాల, సుత నూతన్‌కుమార్, ప్రసన్నకుమార్, శేఖర్ (సింహాద్రి), మాస్టర్ తేజ, కళ్యాణి, జైపాల్‌రెడ్డి, ప్రశాంత్‌సింగ్, హరి


కొడాలి శ్రీ వెంకటేశ్వరరావు (నాని)


వి.వి.వినాయక్


మణిశర్మ


భువనచంద్ర


చంద్రబోస్

## సాంకేతిక నిపుణులు


సుద్దాల అశోక్‌తేజ


సాహితి

| | | | |
|---|---|---|---|
| కథ | : జి.ఎస్.రావు | పి.ఆర్.ఒ. | : బి.ఎ.రాజు |
| మాటలు | : కోన వెంకట్ | ఫైట్స్ | : విజయ్ |
| పాటలు | : చంద్రబోస్, భువనచంద్ర, సుద్దాల అశోక్‌తేజ, సాహితి | ఛీఫ్ కో-ఆర్డినేటర్ | : తోట రామకృష్ణ |
| | | కో-డైరెక్టర్ | : పుల్లారావు |
| కెమెరా | : రవీంద్రబాబు | ప్రొడక్షన్ | : డి.బ్రహ్మానందరావు |
| సంగీతం | : మణిశర్మ | ఎగ్జిక్యూటివ్ ప్రొడ్యూసర్ | : శివాజీ |
| ఆర్ట్ | : శ్రీనివాసరాజు | నిర్మాత | : కొడాలి శ్రీ వెంకటేశ్వరరావు (నాని) |
| ఎడిటింగ్ | : గౌతంరాజు | | |
| పబ్లిసిటి | : బుజ్జి పోస్టర్స్ | స్క్రీన్‌ప్లే, దర్శకత్వం | : వి.వి.వినాయక్ |




నటుడిగా, హాస్య నటుడిగా అందరికీ తెలిసిన ఎమ్మెస్ నారాయణ మంచి రచయిత అని కొందరికి మాత్రమే తెలుసు. ఆది, ఠాగూర్, సాంబ చిత్రాల ద్వారా సక్సెస్‌ఫుల్ డైరెక్టర్‌గా పేరు తెచ్చుకున్న వి.వి.వినాయక్, ఎమ్మెస్ నారాయణ కలిసి తమ తొలి రోజుల్లో ఎన్నో కథలు తయారు చేసేవారు. ఈ సమీక్షకుడికి కూడా ఎమ్మెస్ నారాయణతో మొదటి పరిచయం రచయితగానే....!

ఇంత ఉపోద్ఘాతం ఎందుకంటే శ్రీ మారుతీ ఫిలింస్ పతాకంపై నిర్మించబడిన 'కొడుకు' చిత్రంకి కథ, మాటలు ఎమ్మెస్ నారాయణే కాబట్టి... అంతేకాదు ఈ చిత్రం స్క్రీన్‌ప్లే, డైరెక్షన్ బాధ్యతలను కూడా ఆయనే చేపట్టారు. ఇదంతా ఎందుకంటే ఆయన కుమారుడు విక్రమ్ ఈ చిత్రంతో హీరోగా పరిచయం అవుతున్నాడు కాబట్టి. ఈ చిత్రం ఆడియో సుప్రీమ్ రికార్డింగ్ కంపెనీ ద్వారా విడుదలైంది. వందేమాతరం శ్రీనివాస్ ఈ చిత్రానికి సంగీత దర్శకుడు.

ఆడియోలో తొలి గీతంగా 'పరిమళమే పువ్వు పరిమళమే' పాటను శంకర్ మహదేవన్, స్నేహపంత్ పాడేరు. సినిమాలో శంకర్ మహదేవన్ పాట గనుక ఉంటే ఆ పాటతోనే ఆడియో మొదలవటం ఈ మధ్య ఒక సంప్రదాయంగా వస్తోంది. అదే సెంటిమెంట్ ఈ ఆడియోలో కూడా కనిపిస్తుంది. శంకర్ మహదేవన్‌తో పాటు గొంతు కలిపిన స్నేహపంత్ గళం చాలా బావుంది. మంచిపాటలు కనుక పడితే శ్రియాఘోషల్ లాగ ఈ అమ్మాయి కూడా తెలుగులో బిజీ అయ్యే అవకాశాలున్నాయి. ఈ పాటను రాసింది ఆంగోత్ భీమ్స్. ఇతను వరంగల్‌కి చెందినవాడు. ఇదివరకు రాజశేఖర్ హీరోగా ఎన్.శంకర్ తీసిన 'ఆయుధం' సినిమాలో 'ఎయ్ రాజు కన్నుల్లో నీవే' అనే పాటను రాశాడు. ఈ 'కొడుకు' చిత్రంలోని 'పరిమళమే పువ్వు పరిమళమే' పాటను అతను ఎప్పుడో రాసుకున్నాడు. అతని పాటలను పరిశీలించిన ఎమ్మెస్ నారాయణ ఈ పాటను చూడగానే సినిమాలో తను తియ్యబోయే సన్నివేశానికి అనుగుణంగా ఉందనిపించి వెంటనే సెలెక్ట్ చేసేసుకున్నారు. క్యాచీ పల్లవి జతపడిన ఈ పాట సాహిత్యాన్ని ఓ కాగితంపై రాసుకొని పరిశీలించండి. 'పైరగాలికి ఎగిరిపోయే పరికిణీ సవరిస్తే పరిమళం' లాంటి ఫ్రెష్ థాట్స్, 'బంగారమల్లె మెరిసిపోయే సైకతసీమే పరిమళం' లాంటి చక్కని భాష కనిపిస్తాయి. ఈయన కాస్త బిజీ అయిపోతే 'సైకతసీమ' లాంటి పదాల్ని మనవాళ్ళు వాడనివ్వరు.

రెండో చరణంలో 'నీలికాంతుల సాగర తీరం పారవశ్యపు హాయి పరిమళం' లెంగ్త్ పరంగా కొంచెం ఎక్కువున్న వాక్యం. మీటర్ చెడకుండా ఆ లెంగ్త్‌ని తన ట్యూన్‌తో బాగా ఎడ్జెస్ట్ చేశాడు వందేమాతరం.




విడుదల : సుప్రీమ్
వెల : రూ. 25/-

క్యాసెట్‌లో రెండవ పాట - స్టూడంటంటే రాకెట్టు మైకేల్ జాక్సన్ క్యాసెట్టు! ఈ పాటను ఎమ్మెస్ నారాయణే రాశారు. నిజానికిది చంద్రబోస్ రాయవలసినది. 'స్టూడంటంటే రాకెట్టు' అంటూ ఓ చిన్న మాటని రాసుకుని చంద్రబోస్‌కి చూపించారు ఎమ్మెస్ నారాయణ. 'చాలాబావుందండీ ఇదే పల్లవిగా మొదలు పెట్టి పాట రాస్తాను' అన్నారు చంద్రబోస్. తర్వాత చిత్ర నిర్మాణంలో ఎమ్మెస్ నారాయణ బిజీ అయిపోయారు. ఈలోగా చంద్రబోస్‌తో పాటలు రాయించుకునేవారు ఆయన్ని వేరే ఊళ్ళకి తీసుకువెళ్ళి రాయించుకుంటూ ఉండటంతో అసలే యమా బిజీగా ఉండే చంద్రబోస్ హైద్రాబాద్‌లో కొన్నాళ్ళపాటు దొరక్కుండా పోయారు. సరిగ్గా అదే సమయానికి ఈ పాట చిత్రీకరణ షెడ్యూలు ముందుకొచ్చేసింది, ముంచుకొచ్చేసింది. 'పోనీ ఈ పాటని తర్వాత షూట్ చేసుకుందాంలే' అని పోస్ట్‌పోన్ చేద్దామంటే సినిమాలో విక్రమ్‌ని చూపించే కొన్ని సీన్లలో అతను గుండుతో కనిపించే కొన్ని సన్నివేశాలు తర్వాతి షెడ్యూల్‌లో ఉన్నాయి. ఆ సీన్లలో విక్రమ్‌ని నిజం గుండుతోనే చూపించాలనుకున్నారు ఎమ్మెస్ నారాయణ. ఇన్ని ఒత్తిళ్ళ మధ్య గత్యంతరం లేని పరిస్థితుల్లో తనే పాట రాసేసుకున్నారాయన. 'స్టూడంటంటే రాకెట్టు మైకేల్ జాక్సన్ క్యాసెట్టు భారత్ మాతకు లాకెట్టు క్రిమినల్ బ్రెయిన్స్‌కి బుల్లెట్టు' అంటూ పల్లవిలోనూ - గాంధీజీ, నేతాజీ, శరశ్చంద్రుడు, కాళిదాసు, కారల్‌మార్క్స్ కలిస్తేనే స్టూడెంటూ రెండో చరణం చివర్నా - స్టూడెంట్స్ మీద మంచి ఎక్స్‌ప్రెషన్స్‌ని ఇచ్చాడాయన. టిప్పు చేత ఉచ్చారణా పరంగా ఇంకొంచెం బాగా పాడించవచ్చుననిపిస్తుంది ట్యూన్‌తో పాటను వింటే!

కుమార్‌సాను, సాధనా సర్గమ్ పాడిన 'మిలామిలా మెరిసే మెరుపుల్లో నువ్వే' పాట వినడానికి, పాడుకోడానికి ఎంతో హాయిగా ఉంది. 'మెలొడీ అంటే ఇలా ఉండాలి' అనే విధంగా పాటకి సంగీతం, సాహిత్యం తోడై నిలిచాయి. పాటలోని సంగీతానికి, సాహిత్యానికి మధ్య చక్కని సమన్వయం ఉండేలా తీసుకున్న శ్రద్ధ ప్రత్యేకంగా కనిపిస్తుంది. మొదటి చరణం చివర్న 'పరవశమంటే అదే అదే కాదా' అనే లైన్‌కున్న ట్యూన్ - రెండో చరణం చివర్న వచ్చే 'అధరం మథనం అమృతం కాదా' లైనుకి సరిగ్గా నప్పదు. అంచేత కొంచెం శ్రద్ధ చూపిస్తేగానీ బాగా అమరదు. ముందు పేర్కొన్న సమన్వయం అంటే అదే! అలాంటి శ్రద్ధను చూపించినది వందేమాతరమే అయితే ఆ క్రెడిట్ అతనిలోని గాయకుడి ఎకౌంట్‌లో పడుతుంది. ఎందుకంటే పాడేవాళ్ళకే ఆ కష్టనష్టాలు తెలుస్తాయి. లేక ఆ శ్రద్ధ ఎమ్మెస్ నారాయణదే అయితే ఆ క్రెడిట్ ఆయనకున్న అభిరుచి ఎకౌంట్‌కి వెళ్ళిపోతుంది. ఈ మధ్య వస్తున్న పాటలలోని సంగీత సాహిత్యాల గురించి ఓ సారి ఓ ఆడియో రిలీజ్ టైం లో ఎమ్మెస్ నారాయణ మాట్లాడుతూ 'షకలకబేబీ' పాటలో 'ఒక కోకో కోలాలో రెండు స్ట్రాలు వేసి సాయంకాలం దాక తాగుతుందామా' అనే లైన్‌ని పాడడానికి ఎన్ని తిప్పలు పడాలో చెప్పిన వైనాన్ని - ఆ ఫంక్షన్‌ని టీవీలో చూసినవారు ఈ సందర్భంగా ఓసారి గుర్తుకు తెచ్చుకుంటే ఆయన అభిరుచి ఏమిటో తెలిసిపోతుంది.

లోగడ 'ఓ మహాత్మా ఓ మహర్షి', 'కొంతమంది కుర్రవాళ్ళు పుట్టుకతో వృద్ధులు' వంటి శ్రీశ్రీ రచనలు సినిమాలలో పాటలుగా చోటుచేసుకున్నా ఇటీవల విడుదలైన 'ఠాగూర్'లో శ్రీశ్రీ గారి 'నేను సైతం' పల్లవిని ఉపయోగించుకున్నాక ఈ తరంలో మళ్ళీ శ్రీశ్రీ క్రేజ్ వచ్చిందనుకోవచ్చు. మహాప్రస్థానంలో శ్రీశ్రీ రాసుకున్న 'కావాలోయ్ నవకవనానికి' అనే రచనను సంపూర్ణంగా ఆయనకు క్రెడిట్స్ ఇస్తూ

ఈ చిత్రంలో ఉపయోగించుకోవటం అందుకు మరో తాజా ఉదాహరణే కాదు ఎమ్మెస్ నారాయణ అభిరుచికి అద్దం పట్టేది కూడా! 'ఎన్ని తరాలకైనా సరిపోయే విధంగా ఆ రోజుల్లోనే శ్రీశ్రీ గారు రాసేరన్న విషయాన్ని చెప్పడానికే ఆ గీతాన్ని ఉపయోగించుకున్నాను' అన్నారు ఎమ్మెస్ నారాయణ 'హాసం'తో! శుభపంతువరాళి రాగం ఆధారంగా స్వరపరచబడిన ఈ గీతాన్ని ఆలపించినది యస్.పి.బాలసుబ్రహ్మణ్యం.

ఉదిత్ నారాయణ్, స్నేహపంత్ పాడిన 'మాట నవ్వితే పాట మల్లె నవ్వితే తోట' పాట ఓల్డ్ మెలొడీల స్కూల్‌లోకి చేర్చదగ్గ మంచి వినసొంపైన గీతం. ఒకసారి వింటే చాలు ఈ పాట ట్యూన్ వెంటాడుతూనే ఉంటుంది. 'ఇదివరకు చంద్రబోస్ తన పాటలో స్కీముల్ని తెలివితో చేసేవాడు. ఇప్పుడు తెలుగుతో చేస్తున్నాడు' అని అనిపిస్తుంది - ఈ పాట సాహిత్యాన్ని వింటే ! నిజంగా చాలా బాగా, బాలెన్స్‌డ్‌గా రాశారు బోస్. కాకపోతే ట్యూన్ మాత్రం ఉత్తరాది గాయనీ గాయకుల గొంతులో పడి వినూత్న అందాలను బదులు విచిత్ర అందాలను సంతరించుకుంది. ఆ విచిత్ర అందమే పాటకు ప్రత్యేక ఆకర్షణగా మారినా ప్రజెంట్ ట్రెండ్‌లో ఆశ్చర్యం లేదు.

శంకర్ మహదేవన్, కౌసల్య, ఉష పాడిన 'మావిళ్ళు పూసినాయి... పిల్లో సందమామ - మారాకు తొడిగినాయి... పిల్లా' పాట తెలుగు సినీ గీతాల చరిత్రలో చోటుచేసుకోదగ్గ చక్కటి జానపద గీతం. ఈ పాట సాహిత్యాన్ని వింటూ తప్పుల్లేకుండా రాసుకోవడానికి ప్రయత్నించి చూడండి. జానపద సాహిత్యంలో ఎన్ని అందాలు, ఎన్ని సొగసులు ఒదిగున్నాయో అర్థం అవుతుంది. నాటి శాస్త్రీయం నుంచి నేటి పాప్ వరకూ - పాట - ఎన్ని పోకడలు పోయినా జానపద రూపానికొచ్చే సరికి ఎందుకంత ఆకర్షణీయంగా ఉంటుందో - అసలు ఎందుకింకా సజీవంగా ఉందో - అర్థం అవుతుంది. గోరంట్ల వెంకన్న ఈ గీత రచయిత. చక్కటి శృంగారభావన కలిగిన ఇంతమంచి జానపద గీతాన్ని బాక్సాఫీస్ ఫార్ములా కోసం శృతిమించనీయకుండా అందించిన గోరంట్ల వెంకన్న నుండి ఎమ్మెస్ నారాయణ వరకు టీమ్‌లో ప్రతి ఒక్కరినీ అభినందించి తీరాలి. మరో చిన్న సంగతేమిటంటే ఈ పాట పల్లవిలోని ట్యూన్‌ని మనం ఇదివరకు 'భట్టి విక్రమార్క' సినిమాలో 'కన్నెపిల్లా సొగసూ చూడు మహరాజ వన్నెలాడి నగవు నాది' అనే పాట ద్వారా విన్నాం.

## మార్కెట్లో ఉన్న ఆడియో క్యాసెట్లు




విడుదల : ఆదిత్య మ్యూజిక్
వెల : రూ.20/-




విడుదల : ఆదిత్య మ్యూజిక్
వెల : రూ.30/-




విడుదల : టాలీవుడ్ మ్యూజిక్
వెల : రూ.32/-




విడుదల : టాలీవుడ్ మ్యూజిక్
వెల : రూ.32/-




విడుదల : హెచ్.ఎం.వి.
వెల : రూ.80/-




విడుదల : హెచ్.ఎం.వి.
వెల : రూ.80/-




విడుదల : ఆదిత్య మ్యూజిక్
వెల : రూ.25/-




విడుదల : మారుతి మ్యూజిక్
వెల : రూ.35/-

# రసగంగతో ఉరకలేస్తున్న పిల్ల వాయువు... యంగ్ తరంగ్...

# చైత్ర





**పౌ**లకడలిపై శేషతల్పమున....

పిల్లలూ దేవుడూ చల్లనివారే....

జీవము నీవే కదా బ్రోచేభారము నీవే కదా....

బూచాడమ్మా బూచాడు...

పాటల్ని విన్నప్పుడు సుశీల గొంతు చిన్నపిల్లలకు కూడా ఎంత బాగా నప్పింది అని అనుకున్నాం.

కృష్ణా నువ్వెక్కడా...

గోవుల్లు తెల్లన....

పాటల్ని విన్నప్పుడు 'జానకి అచ్చం చిన్నపిల్లలాగే ఎలా పాడింది...!?' అంటూ ఆశ్చర్యపోయాం.

తరువాత

'అమ్మ ఒక బొమ్మ నాన్న ఒక బొమ్మ' అంటూ 'దేవతలారా దీవించండి'లో సంగీత దర్శకుడు చక్రవర్తి - గీత అనే ఓ చిన్న అమ్మాయి చేత పాడించినప్పుడు - పిల్లలకు పిల్లలే పాడటం కూడా బాగానే ఉందనుకున్నాం.

అయితే ఓ చిన్నపిల్ల చేత పెద్దవాళ్లకు పాడించటం ఎక్స్‌పరిమెంటా...!? రిస్కా..!? కాకలుతీరిన సింగర్‌లా ఆ అమ్మాయి పాడటం... కలా..!?...నిజమా !?

ఏదయితేనేం అదొక అద్భుతమే !!!

ఆ అద్భుతాన్నే 'అందరూ దొంగలే' చిత్రంలో 'తొలి తొలిగా..' పాట ద్వారా మన ముందుంచారు సంగీత దర్శకుడు చక్రి. ఆ పాట పాడింది చైత్ర. ఆమెకు పన్నెండేళ్లు.

'పిట్ట కొంచెం కూత ఘనం' అన్నట్లు వయసుకు చిన్నదే అయినా ఆమె పాట మాత్రం ఎంతో అనుభవం ఉన్న గాయని పాడినట్లే ఉంటుంది. అదే ఆమె పాలిట వరం కూడా అయిందేమో ! చక్కటి క్రమశిక్షణ, నేర్చుకోవాలన్న తపన, ఉన్నత శిఖరాలను అధిరోహించాలనే పట్టుదలతో ముందుకు సాగిపోతున్న చిన్నారి చైత్రతో పాటు ఆమె తలిదండ్రులతో 'హాసం' జరిపిన ఇంటర్వ్యూలోని విశేషాలివి...

**రమణమూర్తి (తండ్రి)**

నేను సిండికేట్ బ్యాంక్‌లో మేనేజర్‌గా పనిచేస్తున్నాను. మా ఆవిడ కూడా సిండికేట్ బ్యాంక్‌లోనే క్లర్క్‌గా చేస్తున్నారు. ఉద్యోగరీత్యా గత 5 సంవత్సరాలుగా మేం బెంగుళూరులోనే ఉన్నాం. ప్రస్తుతం హైదరాబాద్‌కి ట్రాన్స్‌ఫర్ చేయించుకుని వచ్చేశాం. నాకు మ్యూజిక్ అంటే ఇష్టం. అయితే నేను పెద్ద మ్యుజిషయన్ని మాత్రం కాదు. అందుకే మాఅమ్మాయి చైత్రకి సంగీతంలో శిక్షణనిప్పించాను.

చైత్రకు 5 సంవత్సరాల వయస్సప్పుడే టీవీలో వచ్చే ఫల్గుణి పాఠక్, శుభాముద్గల్ పాటలను బాగా ఇష్టపడటమే కాక ఆ పాటలను పాడేది. మొదట్లో మేం బాగా ఎంజాయ్ చేశాం. ఆమె అలా పాడుతున్నప్పుడే ఒకసారి బాగా అబ్జర్వ్ చేయటం జరిగింది. ఒరిజనల్ సింగర్ ఎలా పాడిందో అలాగే పాడటం, అంతేగాక గొంతులో కూడా కొద్దిపాటి తేడాను గమనించాం. దాంతో నంగీతంలో శిక్షణనిప్పిస్తే బాగుంటుందన్న ఆలోచన వచ్చింది. 1998లో మొదటిసారిగా క్లాసికల్ మ్యూజిక్‌లో శిక్షణకు పంపించాం. అప్పుడు ఓ మూడు, నాలుగు నెలలు మాత్రమే నేర్చుకున్న తర్వాత మేం ఉద్యోగ రీత్యా వేరేచోటకు మారటంతో ఆ ప్రయత్నానికి గండిపడింది.

మా నాన్నగారు మోహన మురళీకృష్ణ గారు. ఆయనకు సినిమా పాటంటే బాగా ఇష్టం. ఆయన మా అమ్మాయి చేత సినిమా పాటలు పాడించాలని పట్టుబట్టేవారు. అంతేకాక పాత సినిమా పాటలను చైత్ర చేత పాడించేవారు. ఆయన ప్రోద్బలంతోటే నాకు కూడా సినిమా పాటలను నేర్పించాలన్న ఆలోచన వచ్చింది. అందుకే 2000వ సంవత్సరం నుండి సీరియస్‌గా హిందుస్తానీ సంగీతంలో శ్రీమతి గీతా హెగ్డే గారి వద్ద శిక్షణనిప్పించటం ప్రారంభించాం.

కర్ణాటక శాస్త్రీయ సంగీత ప్రభావం అధికంగా ఉంటుంది. అంటే గమకాలు అవీ మనకు తెలియకుండానే పడిపోతుంటాయి. అవి సినిమా పాట పాడటానికి ఒక్కోసారి ఇబ్బంది అవుతాయి. అదే హిందుస్తానీ సంగీతం అయితే ఆ ప్రభావం సినిమా సంగీతం పాడుతున్నప్పుడు పడదు. అందువల్ల నేను మా అమ్మాయికి హిందుస్తానీ సంగీతంలో శిక్షణనిప్పించటానికే ప్రాధాన్యత నిచ్చాను.

చైత్రకు మేం ఎక్కువగా పాత పాటలనే నేర్పించాం. పాత పాటలలోని సాహిత్యం, ట్యూన్, పాడే విధానం అన్నీ డిఫరెంట్‌గా ఉంటాయి. అంటే కొత్త పాటలలో లేవా అంటే ....కొత్త పాటలు కూడా బాగుంటాయి. అయితే పాతపాటల్లో ఉన్నంత క్లిష్టత కొత్త పాటల్లో ఉండదు. అంతే కాక పాత పాటలను పాడాలంటే శృతి, లయ ఖచ్చితంగా తెలియాలి. లేకపోతే పాడటం కష్టం అవుతుంది.

చైత్ర 6వ తరగతి పూర్తిచేసిన తర్వాత హాలిడేస్‌లో రోజుకో పాట నేర్పాలని అనుకున్నాం. స్కూలు వర్కింగ్ డేస్ అయితే కొద్దిగా కష్టమే

# చైత్రకి ఛాన్సెలా వచ్చిందంటే....



రామానాయుడు స్టూడియోలో 'అందరూ దొంగలే' ఓపెనింగ్ అనుకుంటా. ఈ చైత్ర అనే అమ్మాయి గౌను వేసుకుని చుడీదార్ వేసుకున్న ఒకావిడతో వచ్చింది. వచ్చి సి.డి. క్యాసెట్ ఇస్తుంటే చుడీదార్ వేసుకున్న అమ్మాయి సింగర్ అనుకుని '...మీరు సింగరాండి' అని సి.డి. తీసుకున్నాను. 'తనండీ సింగర్ ...8వ తరగతి చదువుతోంది...'అని చెప్పింది చుడీదార్ వేసుకున్నావిడ. 'ఇంత చిన్నమ్మాయా, ఏం పాడుతుందండి....ఛైల్డ్ వాయిస్ ఏమన్నా ఉంటే పాడిస్తాన్లెండి' అని అన్నాను. 'మ్యూజిక్ నేర్చుకుంటున్నావా' అని అడిగితే 'నేర్చుకుంటున్నానంకుల్' అందా అమ్మాయి.

సరే నాకు ఏ అవకాశం రాలేదు. ఓ 5, 6 నెలలు గడిచాక... ఓ పాట పాడించటానికి ఓ కొత్త వాయిస్, పెక్యులర్‌గా వెరైటీగా ఉండే వాయిస్ కావాలని అనుకుంటున్నప్పుడు.... ఆ రోజు వాళ్లిచ్చిన సీడీ తీసి విన్నాను. కొత్త సింగర్స్ ఇచ్చిన క్యాసెట్స్, సి.డీ.లు నా టేబుల్‌పైన ఎప్పుడూ ఉంటాయి. ఇంత చిన్న అమ్మాయి వాయిస్ ఇదేనా అని డౌట్ వచ్చి సి.డి.మీద చూసాను. కరక్టే ...చైత్ర అని ఉంది. నో డౌట్. ఆ అమ్మాయే. అప్పుడు నాకు గుర్తొచ్చింది. ఆ అమ్మాయిది కొద్దిగా మెచ్యూర్డ్ వాయిస్‌లాగా ఉంటుందని వాళ్లు చెప్పిన విషయం. ఓ.కె.అనుకుని మా మేనేజర్‌తో చెప్పి వాళ్లకి ఫోన్ చేయించాను. అప్పుడు వాళ్లు బెంగుళూరులో ఉన్నారు. ఆంధ్రప్రదేశ్ వాళ్లే కానీ, జాబ్ మీద బెంగుళూర్ వెళ్లారు. 'సాంగ్ ఉందండి, పాడాలి. నాకు నచ్చితే డైరక్టర్‌గారికి వినిపిస్తాను.ఆయనకు కూడా నచ్చితే సినిమాలో ఉంటుంది' అని చెప్పాను. 'అప్పటి వరకూ ఇది ట్రాక్ అండి' అని కూడా అన్నాను. వాళ్లు 'సరేనండి. మాకు ఈ అవకాశం రావడమే గ్రేట్, కానీ మా పాపకి నెక్స్ట్ డే ఎగ్జామ్ ఉందండి' అన్నారు. 'కానీ తప్పదండీ,అర్జంటుగా మిక్సింగ్‌కి వెళ్లిపోవాలి' అని చెప్పాను. అప్పుడు వాళ్లు ఎలాగోలా వచ్చేస్తామని చెప్పారు. నేను ఆ అమ్మాయితో మాట్లాడాను. 'చైత్రా బాగున్నావా' అని విష్ చేసి నువ్వు ఏం చేస్తావంటే ఈ రెండు రోజులూ బాగా చదువుకో... సాంగ్ పాడేసి వెళ్లి ఎగ్జామ్ రాసేయ్' అన్నాను. అలాగే బాగా చదివిందా అమ్మాయి. వచ్చిన తర్వాత ఆ అమ్మాయికి సాంగ్ నేర్పించి పాడించాను." అంటూ చైత్రకుఎలా అవకాశం వచ్చిందన్న విషయాన్ని వివరించారు చక్రి.



తలిదండ్రులు రమణమూర్తి, పద్మప్రియలతో చైత్ర

కానీ, ఆదివారాలు, సెలవు రోజుల్లో మాత్రం ఖచ్చితంగా రోజుకో పాట నేర్చుకుంటుంది. చైత్రలో ఉన్న గొప్పతనం ఏమిటంటే ఓ పాట విందంటే 80 శాతం ఇట్టే పట్టేస్తుంది. ఎక్కడైనా తప్పుపాడినా, గమకాలు సరిగా పడకపోయినా అది ఇలా పాడాలి అని చెప్తుంటాను.

మా మిసెస్‌కు కూడా సంగీతంలో కొద్దిపాటి ప్రవేశం ఉంది. అది కూడా మా అమ్మాయికి శిక్షణ నివ్వటంలో ఎంతో ఉపయోగపడ్తోంది.

హిందుస్తానీ సంగీతం ఓ వైపు, సినిమా పాటలు ఓ వైపు నేర్పిస్తున్నా చైత్ర ఎప్పుడూ విసుగు ప్రదర్శించలేదు. పాటను డిఫరెన్షియేట్ చేసి చూడగలదని నా భావన. అందుకే ఓ టిపికల్ సాంగ్ నేర్చుకోమ్మని ఇచ్చినప్పుడు దానిని ఎలాగైనా నేర్చుకోవాలనే చూస్తుంది కానీ, నాకు రాదని ఎప్పుడూ చెప్పలేదు.

పాత పాటల సాహిత్యాన్ని నేను బుక్స్‌లోనూ, పాటల పుస్తకాలలోనూ చూసి రాసిన తర్వాత, వాటిని ఆడియో క్యాసెట్‌తో కంపేర్ చేస్తాను. తర్వాత దానిని కంప్యూటర్‌లో టైప్‌చేసి తప్పులు లేవనుకుని నిర్ధారించుకున్న తర్వాత ప్రింట్ అవుట్ ఇచ్చి ఆ పాటల్ని స్పైరల్ బైండింగ్ చేసి ఉంచుతాను. వాటినే చైత్ర పాడుతుంది. మనం ఎన్ని పాటలను నేర్చుకున్నాం అన్నదానికన్నా ఎంత క్వాలిటీతో పాడుతున్నాం అనేది ముఖ్యం. నాకు ఈ విషయంలో 'హాసం' పత్రిక ఎంతో హెల్ప్ అవుతోంది. 'గోపాలా నందగోపాలా' పాటలో 'పాలనుముచ్చిలి' అన్నదానికి అర్థం 'హాసం'లోని 'ఆపాత మధురం' చూసిన తర్వాత కరెక్ట్ చేసుకున్నాను.

నాకు పాత పాటలంటే ఇష్టమే కానీ... అవి మాత్రమే ఆమె గొంతులో వినాలని నాకేం లేదు. ఓ సింగర్‌కు కావల్సిన క్వాలిటీస్ అన్నీ ఆమెలో ఉండాలన్నదే నా తాపత్రయం.

సినిమా పాట పాడించాలని మాకు మొదటిసారిగా అనిపించినది 2003 సంవత్సరంలో.

చైత్ర మొదటి పాట 'అందరూ దొంగలే' చిత్రం కోసం 'తొలి తొలిగా...' అంటూ చక్రిగారితో కలిసి పాడింది. అసలా పాట పాడటానికి అవకాశం రావటమే అదృష్టం. ఆ సినిమా ఓపెనింగ్ రోజున మేం చైత్ర పాడిన పాటలతో రికార్డు చేసిన ఓ సి.డి.ని చక్రిగారికి ఇచ్చాం. అవకాశం వచ్చినప్పుడు తప్పకుండా పిలుస్తానని ఆయన అన్నారు. ఓ ఆర్నెల్లు అయింది. చక్రిగారి దగ్గర నుండీ ఏ పిలుపూ లేదు. ఆయన మర్చిపోయుంటారని అనుకున్నాం. అలాంటి సమయంలో ఆయన ఓ రోజు ఫోన్ చేసి 'మీ అమ్మాయిని తీసుకురావాలి' అని అన్నారు. వాయిస్ టెస్ట్ చేసి ఓ.కె. అని ఆ పాడించారు.

చక్రిగారికి చాలా పేషన్స్. ఆయనకు కావల్సిన విధంగా పాట రావటం కోసం ఎంతో కృషి చేస్తారు. చైత్ర పాడుతున్న పాట రికార్డింగ్ టైమ్‌లో మేం చాలా టెన్షన్‌కు గురయ్యాం - ఎక్కడ ఎక్కువ టేకులు తింటుందో... చక్రిగారికి కోసం వస్తుందేమో... ఇలా ! అయితే రికార్డింగ్



8 సంవత్సరాల వయసులో మొదటిసారిగా గురుపూర్ణిమ నాడు స్టేజ్‌పై క్లాసికల్ మ్యూజిక్ పాడుతున్న చైత్ర

పూర్తయిన తర్వాత చక్రిగారు చాలా బాగా పాడిందని మెచ్చుకోవటం మరచిపోలేని అనుభూతినిచ్చింది. ఓ చిన్నపిల్లకు అవకాశం ఇవ్వటం.... అద్భుతంగా పాడించటం...హేట్సాఫ్ టు చక్రిగారు.

**పద్మప్రియ (తల్లి)**

తనకు పూర్తిగా పాట వచ్చేవరకూ చైత్ర తీవ్రంగా కృషి చేస్తుంది. అది హిందీ కావచ్చు, తెలుగు, ఇంగ్లీషు ఏదయినా కావచ్చు. ఇది మొదటిసారి నేను అబ్జర్వ్ చేసింది బెంగుళూరులో ఓ కార్యక్రమంలో లతా పాడిన 'జో వాదా కియా వో నిభానా పడేగా' పాటలో...! ఆ పాట పాడుతున్నప్పుడు 'హమ్ అప్‌నీ వఫా పే నా ఇల్‌జామ్ లేంగే' అనే లైన్‌లో 'లేంగే' అని వచ్చే చోట తనకి గమకాలు సరిగా పడలేదు. పాట పాడటం అయిపోయిన తర్వాత అందరూ బాగా పాడావని అభినందించినా ఈమె మాత్రం ఏడుస్తూ కూచుంది. ఏమైందని అడిగితే ఆ పాటలో తను సరిగా పాడలేదని, ఏదో విధంగా ఎడ్జెస్ట్ చేసి పాడానని బాధపడుతూ చెప్పింది. అంతేకాదు ఆ పాట మళ్లీ సరిగ్గా పాడటం వచ్చేవరకూ ప్రాక్టీస్ కూడా చేసింది.

తను పాడేది ఏమిటో తనకు బాగా తెలుసు. సరిగా పాడగలుగుతుందో లేదో కూడా జడ్జ్ చేసుకోగలదు.

కష్టం అంతా మా వారిదే ! చైత్రకు పాటలు స్క్రిప్టు తప్పులు లేకుండా ఇవ్వటం, వాటిని కంప్యూటర్‌లో ఫీడ్ చేయటం అన్నీ ఆయనే చేస్తుంటారు. నిజానికి ఆయన చేసే హోమ్ వర్క్ చాలా ఎక్కువ.

ఓ పాట నేర్చుకోమని చైత్రకు ఇచ్చిన తర్వాత ఆ పాట ఆయన అనుకున్న టైమ్‌లో రాక పోయినా ఎప్పుడూ విసుగు చెందరు. ఎక్కడ సరిగా రాలేదో గుర్తించి, దానిని ఆమెకు అర్థమయ్యేటట్లు వివరించి, అవసరమైతే ఆయన పాడి మరీ చెప్తుంటారు.

8 సంవత్సరాల వయసులో మొదటిసారి చైత్ర గురుపూర్ణిమ రోజు స్టేజ్ ఫెర్ఫార్మెన్స్ క్లాసికల్ మ్యూజిక్‌లో ఇచ్చింది.

ఈ టీవీ కన్నడలో వచ్చే 'భావసంగమ' కార్యక్రమంలో కూడా పాల్గొంది.

ఎస్పీ బాలసుబ్రహ్మణ్యం గారంటే చైత్రకు ఎంతో అభిమానం. ఆయన ముందు ఇప్పటిదాకా పాడలేదని ఎప్పుడూ ఫీల్ అవుతూ ఉంటుంది. అయితే మొదటిసారి సినిమా పాట పాడేముందు ఓ కార్యక్రమంలో పాల్గొనటానికి వచ్చిన బాలు గారి ఆశీస్సులు మా అమ్మాయికి లభించాయి. అప్పుడు ఆయనతో చెప్పాం- మీ ప్రోగ్రాంలో పాడలేకపోయానని అమ్మాయి ఫీలవుతోందండీ - అని. దానికాయన 'ప్రోగ్రాం లోనే ఏంటి సినిమాలో కూడా కలిసిపాడితాం మనం' అని అనటం మరిచిపోలేని మధురానుభూతి.

వాయిస్‌కి సంబంధించిన ఎక్సర్‌సైజుల గురించి మొదట్లో మాకు అంతగా తెలీదు. ఇటీవలనే తెలునుకుని వాయిస్ ఇంకా బాగుండటం కోసం 10 రోజులపాటు బ్రీతింగ్ ఎక్సర్‌సైజులు చేయించాం.

మార్కెట్లోకి వచ్చే కొత్త ఆల్బమ్స్‌ని చైత్ర టీవీలో చూసి అడుగుతుంది. ఆమె ఏది అడిగితే అది మేం కొనిపెడతాం. ఆ పాటలను ఆమె సొంతంగా ప్రాక్టీస్ చేస్తుంది.

**చైత్ర**

నా బర్త్‌డే ఫిబ్రవరి 11, 1992. మా అమ్మగారి పేరు పద్మప్రియ. నాన్నగారు అంబడిపూడి రమణమూర్తి.

నాకు కొత్త పాటలు అంటే ఇష్టం. చిన్నప్పుడు ఫల్గుణి పాఠక్ పాడిన యాద్ పియా.... పాట, శుభాముద్గల్ పాటలను ఎక్కువగా ఇష్టపడేదాన్ని.

పాత పాటలను కూడా ఇష్టపడతాను. మా తాతగారి దగ్గరకు వెళ్లినప్పుడు ఆయన పాత పాటలను బాగా వినిపించే వారు. ఆ పాటలు కూడా నాకు బాగా నచ్చాయి. మా నాన్నగారు కూడా పాత పాటలను బాగా నేర్పుతారు.

మా నాన్నగారు ఫలానా పాట ఖచ్చితంగా నేర్చుకోవాలని ఎప్పుడూ ఫోర్స్ చేయరు. నాకు బోర్‌గా ఉందంటే వెళ్లి కొద్దిసేపు ఆడుకుని, తర్వాత ప్రాక్టీస్ చేయమంటారు. నేను ప్రాక్టీస్ చేసేటప్పుడు ఏమైనా తప్పులు వస్తే సరిచేస్తారంతే!

యాక్టింగ్ చేసే ఆలోచనే నాకు లేదు. సింగర్‌గానే స్థిరపడాలనుకుంటున్నాను. అయితే క్లాసికల్ కచ్చేరీలు కూడా చేయాలని ఉంది.

నా ఫస్ట్ మేజర్ లైవ్ కాన్సర్ట్ రవివర్మ రమణి గార్లతో భీమవరంలో చేశాను.

చిత్రగారు నా అభిమాన గాయని. ■



| | |
|---|---|
| చిత్రం | : 'మైఁ హూఁ న' |
| రచన | : జావెద్ అఖ్తర్ |
| సంగీతం | : అనూ మలిక్ |
| గానం | : సోనూ నిగమ్, శ్రేయాఘోషాల్ |
| అభినయం | : షారుఖ్ ఖాన్, జాయెద్ ఖాన్, అమృతారావు, సుస్మితాసేన్ |

# అర్థం చేసుకుందాం ఆస్వాదిద్దాం



అ: కిస్‌కా హై యే తుమ్ కో ఇంతజార్, మైఁ హూఁ నా
దేఖ్‌లో ఇధర్ తో ఏక్ బార్, మైఁ హూఁ నా
ఖామోష్ క్యోఁ హో, జో భీ కెహనా హై కహో
దిల్ చాహె జిత్‌నా, ప్యార్ ఉత్‌నా మాంగ్‌లో
తుమ్‌కో మిలేగా ఉత్‌నా ప్యార్, మైఁ హూఁ నా

కభీ జో తుమ్ సోచో కి తుమ్ యే దేఖో
అరె కిత్‌నా ముఝ్‌కో తుమ్‌సే ప్యార్ హై
తో చుప్ మత్ రెహనా, యే ముఝ్‌సే కెహనా
అరె కోయీ క్యా ఐసా భీ యార్ హై
దిల్ హీ నహీఁ దే, జాన్ భీ దే జో తుమ్హే (2)
హో...తో మైఁ కహూంగా సర్‌కార్ మైఁ హూఁ నా
ఆ: ॥కిస్‌కా హై యే తుమ్‌కో॥
అ: కెహనే కీ హో దిల్ మేఁ కోయీ బాత్, ముఝ్‌సే కహో
కోయీ పల్ హో, దిన్ హో యా హో రాత్, ముఝ్ సే కహో
కోయీ ముష్కిల్ కోయీ పరేషానీ ఆయే
తుమ్హే లగే కుఛ్ ఠీక్ నహీఁ హాలాత్, ముఝ్‌సే కహో
కోయీ హో తమన్నా యా హో కోయీ అర్ జూ
హో.... రెహనా కభీన బేకరార్ మైఁ హూఁ నా ॥కిస్‌కా హై యే తుమ్‌కో॥

మహిళా దర్శకులు తీసిన చిత్రాలలో రికార్డులన్నీ మొదటి వారంలోనే చెరిపేసి అద్భుత విజయం సాధించిన చిత్రం 'మైఁ హూఁనా'. ఫరాఖాన్ తొలిసారి దర్శకత్వం వహించిన ఈ చిత్రం అందరినీ అలరిస్తోంది. దర్శకురాలు కావాలనే కోరిక చిన్నప్పటి నుంచీ ఉన్న ఫరాఖాన్ నృత్యదర్శకురాలిగా పదేళ్ళు పనిచేసి చక్కని విజయాలు అందుకున్నారు. షారుఖ్ ఖాన్ చిత్రాలలో చాలా వాటికి ఆమె నృత్యం కంపోజ్ చేశారు. వారిద్దరూ మంచి స్నేహితులయ్యారు. ఫరా తయారు చేసుకున్న కథతో సినిమా తీయాలని అనుకున్నపుడు షారుఖ్ తనే నిర్మాతగా ఆ చిత్రం తీస్తానని అన్నాడు. ఆమెకు పూర్తి స్వేచ్ఛను ఇచ్చాడు. బడ్జెట్ మించిపోతోందని ఆమె కంగారు పడినా మరేం ఫర్వాలేదని అతను ప్రోత్సహించాడు. ఆ చిత్రం ఇపుడు కమర్షియల్‌గా మంచి విజయం సాధించింది.

ఈ చిత్రం కథ అవాస్తవికంగా ఉందని విమర్శకులు అభిప్రాయపడినా వినోదాత్మకంగా ఉందని ఒప్పుకున్నారు. ఫరా కూడా వినోదమే లక్ష్యంగా ఈ చిత్రాన్ని రూపొందించారు. రామ్, లక్ష్మణ్ అనే ఇద్దరు అన్నదమ్ముల కథ ఇది. రామ్ అక్రమ సంతానం. అతని కారణంగా అతని సవతి తల్లి తన కొడుకుని

తీసుకుని భర్తను వదిలి వెళ్ళిపోతుంది. రామ్ తండ్రి ఆర్మీ ఆఫీసర్. రామ్ కూడా ఆర్మీలో చేరి మేజర్ అవుతాడు. పాకిస్తాన్‌తో సత్సంబంధాలు ఏర్పరచాలని వారి కోరిక.

కానీ రాఘవన్ అనే టెర్రరిస్టు పాకిస్తాన్‌ని నమ్మకూడదని ఈ ప్రయత్నాలకు అడ్డుపడతాడు. ఆ సంఘర్షణలో రామ్ తండ్రి మరణిస్తాడు. చివరి కోరికగా తన భార్యను, చిన్న కొడుకును కలుసుకుని వారి బాగోగులు చూసుకోమంటాడు. వారు డార్జిలింగ్‌లో ఉన్నారని చెబుతాడు. రామ్ పై అధికారి కూతురు డార్జిలింగ్‌లోనే చదువుతూంటుంది. ఆమెకు టెర్రరిస్టుల నుంచి అపాయం రాకుండా ఆమెను అంటిపెట్టుకుని ఉండటానికి రామ్‌ను డార్జిలింగ్ స్కూల్‌కు విద్యార్థిగా పంపిస్తాడు. రామ్ అక్కడికి వెళ్ళి వారి అభిమానాన్ని చూరగొంటాడు. తాను లక్ష్మణ్‌కు అన్ననని చెప్పలేక మథనపడుతుంటాడు. చివరికి తన సవతి తల్లి, తమ్ముడిని ఎలా ఒప్పిస్తాడో, టెర్రరిస్టులను ఎలా ఎదుర్కొంటాడో అనేది మిగతా కథ.

ఈ చిత్రానికి అనూ మలిక్ సంగీతం అందించారు. ఆర్.డి.బర్మన్ శైలిలో సంగీతాన్ని అందించాలనే ఫరా కోరిక మేరకు అనూమలిక్ ప్రయత్నం సాగింది. మంచి సంగీతం సమకూరింది. 'తుమ్‌సే మిల్‌కే దిల్‌కా' పాట చాలా కాలానికి ఒక కవ్వాలీగా రూపొందింది. ఆర్.డి. స్వరపరచిన కొన్ని పాటలను కూడా వాడుకున్నారు. 'జానె జాఁ' (జవానీ దివానీ), 'చాంద్ మేరా దిల్' (హమ్ కిసీసే కమ్ నహీఁ), 'ఏక్ లడ్‌కీ కో ధేఖా' (1942 ఎ లవ్ స్టోరీ), 'యే లడ్‌కా హాయ్ అల్లా' (హమ్ కిసీ సే కమ్ నహీఁ) పాటల సందర్భానికి అనుగుణంగా వినిపించి అలరించారు. స్కూల్‌లో కెమిస్ట్రీ టీచర్ చాంద్‌నీ పాత్రను పోషించిన సుస్మితాసేన్‌ను ఒక ఊహాసుందరిగా చూపిస్తూ 'చాంద్ మేరా దిల్, చాంద్‌నీ హో తుమ్' పాట వినిపించి చక్కని ఎఫెక్ట్ రాబట్టారు. రామ్‌గా షారుఖ్ ఖాన్, లక్ష్మణ్‌గా జాయెద్ ఖాన్, లక్ష్మణ్‌ను ప్రేమించే డాలీగా అమృతా రావు నటించారు.



తన తమ్ముడు ఎవరో తెలిసినపుడు రామ్ మనసులోని భావాలకు రూపమే 'మైఁ హూఁ నా' టైటిల్ సాంగ్. డాలీ లక్ష్మణ్‌కు తన ప్రేమ సంగతి చెప్పలేకపోతోందని తెలిసి రామ్ ఆమెకు ఆసరా అందిస్తాడు. ఈ పాటలో పల్లవి ఒకసారి లక్ష్మణ్‌ను ఉద్దేశించి రామ్ పాడితే ఒకసారి లక్ష్మణ్‌ను ఉద్దేశించి డాలీ పాడుతుంది.

ఇంతజార్ అంటే ఎదురుచూపు, నిరీక్షణ . ఖామోష్ అంటే మౌనం. మాంగ్‌నా అంటే అడగటం. 'మైఁ హూఁ నా' అంటే 'నేనున్నాను కదా' అని



**'ఎవరి కోసమీ ఎదురుచూపు, నేనున్నాగా**
**ఓసారిలా చూడు కాస్త, నేనున్నాగా**
**ఈ మౌనమేల, మదిలోని మాట చెప్పవా**
**కావలసినంత ప్రేమ అడిగి తీసుకో**
**అంత ప్రేమా ఇస్తాను, నేనున్నాగా,**

తండ్రి ప్రేమకు దూరమైన లక్ష్మణ్ ఏదో వెలితితో బాధపడుతున్నాడని తెలిసి రామ్ తానున్నాని భరోసా ఇస్తున్నాడు. తను అతని అన్నని చెప్పకపోయినా ఎంత ప్రేమైనా ఇస్తానని చెబుతూన్నాడు. మనసులోని మాటను తనతో పంచుకోమని కోరుతున్నాడు. ఇదే పల్లవి డాలీ పాడితే లక్ష్మణ్ పట్ల తన ప్రేమను వ్యక్తపరిచింది. తన ప్రేమంతా అతనికే అని అంటోంది.

సోచ్‌నా అంటే ఆలోచించటం. 'చుప్ రహ్‌నా' అంటే మౌనంగా ఉండటం. జాన్ అంటే ప్రాణం. సర్‌కార్ అంటే ఏలినవారు.

**'నాకు నువ్వంటే ఎంత ప్రేమో**
**ఎపుడైనా నువ్వు చూడగలిగితే**
**అపుడు నన్నడుగు**
**మనసే కాదు,ప్రాణమూ ఇచ్చేవారుంటారా అని**
**అపుడు నేనంటా-చిత్తం నేనున్నాగా అని'**

తమ్ముడంటే అతనికి ఎంత ప్రేమో ఆ తమ్ముడికి తెలిస్తే, నమ్మకం కుదరకపోతే తననే అడగమంటున్నాడు. మనసే కాదు, ప్రాణమైనా ఇవ్వటానికి సిద్ధంగా ఉన్నానంటున్నాడు.

బాత్ అంటే మాట. పల్ అంటే క్షణం. ముష్కిల్ అంటే కష్టం. పరేషానీ అంటే చికాకు. హాలాత్ అంటే పరిస్థితులు. తమన్నా అంటే ఆశ. ఆర్ జూ అన్నా ఆశ, కోరికే. బేకరార్ అంటే చింతపడటం.



**'ఏమన్నా చెప్పాలంటే నాతో చెప్పు**
**ఏ క్షణమైనా, పగలైనా రేయైనా నాతో చెప్పు**
**ఏ కష్టమొచ్చినా నష్టమొచ్చినా**
**మనసు బాగాలేకున్నా నాతో చెప్పు**
**ఏదన్నా ఆశ ఉన్నా, కోరిక ఉన్నా**
**చింతపడొద్దు, నేనున్నాగా'**

డాలీ చెప్పలేక సతమతమవుతోందని తెలిసి తనతో చెప్పమని అంటున్నాడు రామ్. ఎప్పుడైనా, ఎలాంటి పరిస్థితిలో అయినా తన ఆశలు, కోరికలు తనతో చెప్పమని అంటున్నాడు. ఇలా అన్ని పరిస్థితుల్లో ఒక తోడు ఉంటే ఎవరికైనా ఏం కావాలి?

తానెవరో చెప్పకుండా తన సవతి తల్లికి, తమ్ముడికి చేరువవుతాడు రామ్. వారికి వేరొకరి ద్వారా నిజం తెలిశాక వారు అతన్ని అపార్థం చేసుకుని వెళ్ళిపొమ్మంటారు. ఆ సమయంలో దుఃఖంలో ఉన్న రామ్ భావాలు ఈ పాట రెండో వెర్షన్‌లో వస్తాయి.

గానం:అభిజిత్

ఖోయా హై పాకే జిస్ నే ప్యార్, మైఁ హూఁ నా
బేచైన్ మైఁ హూఁ, బేకరార్ మైఁ హూఁ నా
కోయీ తో హో ఐసా జిస్‌కో అప్‌నా కెహ్ సకూఁ ॥2॥
కోయీతో కెహ్‌తా ఏక్ బార్ మైఁ హూఁనా

జో బంధన్ టూటే, జో అప్‌నే రూఠే
పాస్ ఆ జాయే ఫిర్ సే దూరియాఁ
యే క్యూఁ హోతా హై కి దిల్ రోతా హై
బేబస్ హో జాతీ హై యే జబాఁ
అప్‌నే తో సారే ఇస్ కినారే రెహ్ గయే
తన్హా చలా జో ఉస్ పార్ మైఁ హూఁ నా

జహాఁ భీ మై జావూఁ, జహాఁ భీ మైఁ దేఖూఁ
సారే చెహరే బేగానే సే హైఁ
కభీ కోయి థా, జో మేరా హీ థా
యే కిస్సే అబ్ అఫ్‌సానే సే హైఁ
కల్ జిందగీ నే ఖేల్ ఖేల్ థే నయే
కుఛ్ లోగ్ జీతే, జీత్‌కే సబ్ లే గయే
హిస్సే మేఁ ఆయీ జిస్‌కే హార్ మైఁ హూఁ నా

ఖోనా అంటే పోగొట్టుకోవటం. పానా అంటే పొందటం. బేచైన్ అన్నా, బేకరార్ అన్నా శాంతి కరువవటం.

'ప్రేమను పొంది పోగొట్టుకున్నవాడిని నేనేగా
కుదురు లేదు, శాంతి లేదు నాకు
నావారనే వారు ఎవరైనా ఉంటే బావుణ్ణు
ఎవరి మదిలోనైనా ఉండగలిగితే బావుణ్ణు
ఎవరన్నా ఓసారి అంటే బావుణ్ణు 'నేనున్నా'నని'

ప్రేమను అందిపుచ్చుకుని పోగొట్టుకున్న తన దురదృష్టానికి బాధపడుతున్నాడు. అప్పుడతనికి ఇక నా అనే వారెవరూ లేకపోయారు. ఎవరైనా తనకు తోడుగా ఉంటే బావుణ్ణని అంటున్నాడు.

బంధన్ అంటే బంధాలు. రూఠ్‌నా అంటే అలగటం. 'పాస్ ఆనా' అంటే దరిజేరటం. దూరియాఁ అంటే దూరాలు. రోనా అంటే ఏడవటం. బేబస్ అంటే అదుపులో లేనిది. జబాఁ అంటే నాలుక. కినారా అంటే తీరం. 'ఉస్ పార్' అంటే 'ఆ దరి'. తన్హా అంటే ఒంటరి.

'బంధాలు తెగిపోతే, మనవారు అలిగితే
దూరాలు మళ్ళీ దరిజేరేను
మది కన్నీరు పెడుతుంది
ఈ పెదవులపై మాటే రాదు
నావారందరూ ఈ తీరాన ఉండిపోయారు
ఒంటరిగా ఆ దరికి వెళ్ళేది నేనేగా,

బంధాలన్నీ తెగిపోతే, మనవారే మనపై అలిగితే దూరాలు పెరుగుతాయి. మనసు కన్నీరు పెడుతుంది. పెదవులపై మాటేరాదు. తనవారే తనను కాదంటే అతని ఒంటరిగా మిగిలిపోయాడు. ఈ దరిన అందరూ ఉండిపోగా ఆ దరికి ఒంటరిగా పోతున్నాడని చక్కగా చెప్పారు రచయిత జావెద్ అఖ్తర్.

చెహరా అంటే ముఖం. బేగానా అంటే పరిచయం లేనివాడు. కిస్సా అంటే సంఘటన అఫ్‌సానా అంటే కథ. జిందగీ అంటే జీవితం. ఖేల్ అంటే ఆట. జీత్‌నా అంటే గెలవటం. హిస్సా అంటే భాగం. హార్ అంటే ఓటమి.

'ఎటు వెళ్ళినా ఎటు చూసినా
పరిచయమున్న వారెవరూ లేరే
ఒకప్పుడు తోడు ఉండేది
అదంతా ఇప్పుడు కథలా ఉంది
జీవితం కొత్త ఆటలాడింది
కొందరు అంతా గెలుచుకు వెళ్ళారు
ఓటమి మిగిలింది నాకేగా'

ఇప్పుడతనికి అందరూ కొత్తవారిలాగే కనిపిస్తున్నారు. తనవారు కొందరు ఉండేవారనే మాట ఇప్పుడు కథలా ఉంది. జీవితం ఆడిన ఆటలో తనవారందరూ తన సర్వస్వం దోచుకుని వెళ్ళారు. అతనికి మిగిలింది ఓటమి మాత్రమే.

'మైఁ హూఁ నా' చిత్రం ఏప్రిల్ లో విడుదలయింది. అదే నెలలో తెలుగులో 'నేనున్నాను' చిత్రం వచ్చింది. ఈ రెండు చిత్రాల పేర్లు ఒకేలా ఉన్నా కథలు మాత్రం భిన్నమైనవే.

**- పి.వి.సత్యనారాయణ రాజు**

# తాతా ధిత్తై తధిగిణతోం

సీరియల్ 15

| పాత్రలు | నటీనటుల సజెషన్ |
|---|---|
| వీరభద్రం | - కోట శ్రీనివాసరావు |
| విష్ణుమూర్తి | - నూతన్‌ప్రసాద్ |
| శ్రీరామ్ | - తరుణ్ |
| అశ్విని | - శ్రియ |
| పార్వతమ్మ | - అన్నపూర్ణ |
| హనుమంతు | - గుండు హనుమంతరావు |
| అనంత్ | - గోపీచంద్ |

పైన ఉదహరించిన నటీనటులను మనసులో ఉంచుకుని ఈ సీరియల్‌ను మీ మనో నేత్రాలతో తిలకించండి.

- జీడిగుంట రామచంద్రమూర్తి

## జరిగిన కథ

విష్ణుమూర్తి అనే బిజినెస్‌మెన్ కూతురు అశ్విని. తనతోపాటు కాలేజీలో చదువుతున్న పల్లెటూరి యువకుడు శ్రీరామ్‌ను ప్రేమించింది. తండ్రంటే భయపడే అతనికి ధైర్యం నూరిపోసింది. విష్ణుమూర్తి స్వయానా వెళ్లి అడిగినా అవమానించి పంపిన తండ్రితో పోట్లాడి శ్రీరామ్ తన పంతం సాధించుకుంటాడు. ఈ లోగా విష్ణుమూర్తి ఇంటికి అమెరికాలో స్థిరపడ్డ బావమరిది హనుమంతు తన కొడుకు గోపాలంతో సహావస్తాడు.

- ఇక చదవండి



"ఇప్పుడు నా కర్తవ్యం కూడా తెలిసొచ్చింది బావా!.. అందుకే, ఇక ఇక్కడే వుండి ఏదైనా వ్యాపారం చేసుకుందామన్న ఆలోచనతో-అక్కడి వ్యవహారాలన్నీ సెటిల్ చేసి మరీ వచ్చేశాను... రేపు పేపర్లో 'మ్యాట్రిమోనియల్ కాలమ్'లో 'వధువు కావాల'ని ఓ ప్రకటన ఇచ్చి-వెంటనే మా గోపాలానికి పెళ్లికూడా చేసెయ్యాలనుకుంటున్నాను"-చెప్పేడు హనుమంతు.

ఆ మాట విన్న విష్ణుమూర్తి మననులో-ఓ ఆలోచన మెరుపులా మెరిసింది... దాన్ని వెంటనే బయట పెట్టకుండా- అతనివైపు చూసి యదాలాపంగా అడిగేడు-

"మరి మీ అబ్బాయి కూడా ఇండియాలోనే వుండిపోతాడా?"

"అది వాడిష్టం! ఎలాగా ఎమ్.బి.ఎ. చదివేడు.. తల్చుకోవాలేగానీ రాజాలాంటి ఉద్యోగం ఇక్కడ దొరక్కపోదు..వాడు కూడా ఇక్కడే వుంటే, నేను హాయిగా వాడి నీడన కాలం గడిపేస్తాను.. ఒకవేళ వాడికి మళ్లీ అమెరికా మీదకు గాలిమళ్లితే -వాడు వెళ్లిపోతాడు... అప్పుడు నేను ఏ కాశికో,రామేశ్వరానికికో పోయి,'కృష్ణా-రామా' అనుకుంటూ కాలం గడిపేస్తాను..."

హనుమంతు అలా చెప్తూంటే -విష్ణుమూర్తి మనసులో అంతకు ముందు మెరిసిన ఆలోచన ఓ రూపు దిద్దుకోసాగింది...

అప్పుడే అక్కడకు వచ్చికూర్చున్న గోపాలాన్ని చూసి అడిగేడు-"ఏవోయ్!నీ ఉద్దేశ్యం ఏమిటి?...పెళ్లయ్యాక అమెరికా వెళ్లిపోతావా?" లేక మీనాన్నతోపాటు ఇండియాలోనే వుండి పోతావా?"

"అంతా మా డాడీ ఇష్టం సార్....ఆయన ఎలా చెప్తే అలా చేస్తాను!"వినయంగా సమాధానం ఇచ్చాడు గోపాలం.

"ఒరేయ్ బడుద్ధాయ్!..ఈయన నాకు బావైతే-నీకు మావయ్యవుతార్రా! 'సార్' అంటా




వేమిటీ?"-మధ్యలో కల్పించుకుంటూ కొడుకును మందలించాడు హనుమంతు...ఆ తర్వాత విష్ణుమూర్తి వైపు తిరిగి నవ్వుతూ చెప్పేడు-

"దూరంగా వుంటే బంధుత్వాలు కూడా బరువైపోతాయి బావా!.. దగ్గరగా వున్నప్పుడే అవి బలపడతాయి."

"అదీపాయింటేనయ్యా బావమరిదీ! ఇపుడిక మీరు ఇండియా వచ్చారుగా... దగ్గరైపోదాం!"- అంటూ అతని భుజంమీద చేయివేశాడు విష్ణుమూర్తి. అంతలో వంటమనిషి మంగమ్మ ట్రేలో కాఫీ కప్పులు పెట్టుకొచ్చి-వాటిని ముగ్గురికీ అందించింది...

కాఫీ తాగుతూ-కొన్ని క్షణాల తర్వాత చెప్పాడు విష్ణుమూర్తి-

"నిజంగా మీ చెల్లాయి పంపినట్టే వచ్చావనిపిస్తోంది బావమరిదీ..!..నా బిజినెస్ వ్యవహారాలన్నీ చూసుకునేందుకు ఓ నమ్మకమైన కుర్రాడు కావాలని చాలా రోజులుగా అనుకుంటున్నాను..ఇప్పుడు ఆ కుర్రాడు-నీ కొడుకవుతాడు!.....అలాగే నా కూతుర్ని పువ్వుల్లో పెట్టి చూసుకునేందుకు ఓ చాకులాంటి అల్లుడు కావాలని కూడా కోరుకుంటున్నాను.ఆ అల్లుడు కూడా నీ కొడుకే అవుతాడు.... అప్పుడిక మీరు హాయిగా ఇక్కడే వుండచ్చు!"

ఆ మాటలు విన్న తండ్రీ కొడుకులిద్దరూ ఒకరి ముఖాలొకరు చూసుకున్నారు. కొన్ని క్షణాలు ఉలుకూ పలుకూ లేకుండా అలాగే వుండిపోయారు.

"అదేం?..మాట్లాడరేం?.....నా ప్రపోజల్ బాగాలేదా?....మీకు ఇష్టం లేదా?"- అడిగేడు విష్ణుమూర్తి ఆందోళనగా.

"భలేవాడివి బావా!..బందరు లడ్డూలాంటి 'ప్రపోజల్' ఇచ్చావ్!.. ఇష్టం లేదని ఎలా అనగలం?.... కావలసిన సంబంధం!.. రావాల్సిన సమయానికే వచ్చాం..! ముఖ్యంగా మా చెల్లాయి ఆత్మ ఎంతో సంతోషిస్తుంది.. ఒక్కమాటలో చెప్పాలంటే మా రొట్టె విరిగి సాంబారులో పడినంత సంబరంగా వుందనుకో"! జేబులోంచి సిగిరెట్టు తీసి-అందులోంచి ఓ 'సిగార్' లాగి నోట్లో పెట్టుకుంటూ చెప్పాడు హనుమంతు.

"మి చెల్లాయి ఆత్మ సంతోషించటం ఎలా వున్నా- నువ్ వాడిన సామెత మాత్రం సబబుగా లేదోయ్ బావమరిదీ!...రొట్టె విరిగి నేతిలో పడితే రుచిగా వుంటుందిగానీ-సాంబారులో పడితే సరదా ఏముంటుంది?" - ఛలోక్తిగా అన్నాడు విష్ణుమూర్తి..

"అదంతేలే!..మా అమెరికావాళ్లకి నెయ్యి అంతగా పడదు!...'కొలెస్ట్రాల్' ఎక్కువవుతుందని భయం!"

ఆ మాటవిన్న విష్ణుమూర్తి నవ్వకుండా ఉండలేకపోయాడు...!

* * *

రెండురోజుల్నించీ అశ్విని తనగది విడిచిపెట్టి బయటకు రావటంలేదు. వేళకు భోజనం కూడా చేయటంలేదు... శ్రీరామ్‌తోనే తన జీవితాన్ని పంచుకోవాలన్న నిర్ణయంతో ఇంతకాలంగా ఎన్నో సాహసాలు చేసింది...అనుక్షణం అతన్ని నీడలా వెంబడించింది..తనమాటలతో, చేతలతో రెచ్చగొట్టింది...చివరకు తనవైపు ఆకర్షితుడయ్యేలా చేసుకోగలిగింది.. ఇంత జరిగిన తర్వాత -ఇప్పుడు 'ఈ పెళ్ళి జరగటానికి వీల్లేదని' శాసించాడు తండ్రి!.. నెలరోజులు తిరక్కుండా వేరే సంబంధం తెచ్చి తనకు పెళ్ళి చేస్తానంటూ ప్రతిజ్ఞ కూడా చేశాడు..!

ఇప్పుడు తనేం చేయాలి?...

తాను ప్రేమించిన శ్రీరామ్ కోసం తండ్రికి ఎదురు తిరిగి - ఇంటి గడప దాటటమా? లేక తండ్రి మాటను గౌరవించి, మనసును చంపుకుని మరో మనిషిముందు తలవంచి తాళి కట్టించుకోవటమా?



ఎటూ నిర్ణయించుకోలేక పోతోంది అశ్విని...

తనకు 'అమ్మ' ఎలా వుంటుందో తెలీదు.. అమ్మ ప్రేమలోని మాధుర్యాన్ని తను అనుభవించలేదు!.. ఆ లోటు తెలియకుండా -తనను కళ్లల్లో పెట్టుకుని పెంచాడు తండ్రి... చిన్నతనంలో తానువేస్తున్న తప్పటడుగులకు నడక నేర్పాడు..వచ్చీరాని మాటలకు భాషనేర్పాడు.. కాస్తంత జ్ఞానం వచ్చాక, తాను మనసుపడిన ప్రతి వస్తువు కొనిచ్చాడు. ..స్కూలునించి రావటం కాస్తంత ఆలస్యమైతే కలవరపడి పోయి- తనకోసం వీధి గుమ్మంలోనే నిలబడి ఎదురు చూసే వాడు...ఇప్పుడు తనకు, ఇంతవయసొచ్చినా, ఇంకా ఓ 'బుజ్జిపాపాయి'ని చూసినట్టే చూస్తూ -బుజ్జగిస్తూ, లాలిస్తూ- తన తోటిదే లోకంగా గడుపుతున్న తండ్రిని తను నిర్లక్ష్యం చేయగలదా?..... కానీ..తప్పదు!... శ్రీరామ్‌ని కాకుండా మరోవ్యక్తిని తన భర్తగా ఊహించుకోలేదు...

అలా ఉవ్వెత్తున ఎగిసిపడుతున్న ఎన్నో ఆలోచనా కెరటాల తాకిడితో తలమునకలవుతూ- మంచంపై పడుకుని వున్న అశ్విని- తండ్రి రాకను గమనించలేదు.

"బేబీ"!-ఆమె పక్కనే కూర్చుని, తలపై చేయివేసి,ఆప్యాయంగా పిలిచాడు విష్ణుమూర్తి.. తనకు తెలియకుండానే, కళ్ళల్లోకి ఉబికి వచ్చిన కన్నీళ్ళను తుడుచుకుంటూ లేచి కూర్చుందామె.

"నా మీద నీకింకా కోపం పోలేదా?"- తల నిమురుతూ లాలనగా అడిగేడు...ఆమె జవాబు చెప్పలేదు.

"కన్నబిడ్డ సుఖసంతోషాన్ని ఏ తండ్రైనా కోరుకోకుండా వుంటాడా?" మళ్లీ ప్రశ్నించాడు.

"నువ్వున్నావుగా?"-అని అందామనుకుంది.. కానీ ఆ ఆవేశాన్ని తనలోనే అణుచుకుంది.

ఇంతలో విష్ణుమూర్తి చెప్పేడు-

"కాగల కార్యాన్ని గంధర్వులే తీరుస్తారంటారు! ఎప్పుడు ఏది జరగాలని వుంటే- అప్పుడు, అది అలాగే జరిగి పోతూంటుంది బేబీ!... మనం నిమిత్త మాత్రులం!.. అంతే!.."

తండ్రి చెప్పబోతున్నదేమిటో ఆమెకు అర్థం కాలేదు..

"అయినా 'ప్రేమ' అనేది పాలపొంగులాంటి దమ్మా!.. గిన్నెలో పాలు మరిగిపోతే,ఒక్కసారిగా అని పొంగి పొర్లిపోతాయి..ఆ తర్వాత, తక్కినవి గిన్నెలోనే అడుక్కి వెళ్లిపోతాయి...ప్రేమ కూడా అంతే..ఈ వయసులో పిల్లలు చాలామంది 'ప్రేమ' అనుకుంటూ 'ఆకర్షణ'కు లోనవుతారు. ఆ ఆకర్షణ కారణంగానే ఒకర్ని చూడకుండా మరొకరు వుండలేకపోతారు... కానీ వాళ్ళ మధ్య విధివశాత్తూ కొంతకాలం ఎడబాటు కలిగిందే అనుకో!..అప్పుడిక ఆ ప్రేమలూ,ఆకర్షణలూ అన్నీ మరుగున పడిపోతాయి! పడిపోతాయి!!"- అంటూ హితబోధ చేశాడు కృష్ణమూర్తి.

ఆ మాటలు అశ్వినికి రుచించలేదు.

"పొరపాటు డాడీ! ఎడబాట'నేది విరహానికి దారితీస్తుంది. ఆ విరహం ప్రేమను మరింతగా




పెంచుతుందే తప్ప మరుగుపరచదు.. శ్రీరామ్‌ని నేనిపుడు ప్రేమించటమే కాదు, 'ఆరాధిస్తు'న్నాను కూడా!"-దృఢమైన స్వరంతో చెప్పింది.

విష్ణుమూర్తిలో సహనం నశించిపోయింది... ఆమె పక్కనుంచి చివాల్న లేచాడు.

"అసలు నువ్వు ఆ శ్రీరామ్ నామజపాన్నే ఎందుకు చేస్తున్నావో నాకర్థం కావటంలేదు. ఏ విషయంలోనూ అతను నీకు తగినవాడు కాడు. వాళ్ల ఊరో పల్లెటూరు... అతని తండ్రేమో పరమ మూర్ఖుడు!.. వాళ్ళ తాతలు నేతులు తాగినవాళ్లే కావచ్చు... కానీ వీళ్ళ మూతులకు ఆ వాసన కూడ అంటలేదు...చెప్పుకోటానికి పూర్వవైభవాలే తప్ప -ఇప్పుడనుభవించేందుకు ఆస్తిపాస్తులేం మిగల్లేదు వాళ్లకి!" ఆ మాట విన్న అశ్విని చురుక్కున తండ్రి వైపు చూసింది.

"ఆస్తిపాస్తులూ భోగభాగ్యాలూ వున్నంత మాత్రాన-మనిషికి సుఖసంతోషాలుంటాయని నమ్ముతున్నావా డాడీ?" -సూటిగా అడిగింది.

"అఫ్‌కోర్స్!..నేను కూడా ముందు అలాగే ఆలోచించాను...'ఆ భోగభాగ్యాలు వాళ్లకి లేకపోయినా మనకున్నాయి కదా' అని సరిపెట్టుకున్నాను.... కానీ, నేను వాళ్లింటికి వెళ్లి ఆ చాదస్తం మనిషితో మాట్లాడిం తర్వాత - ఆ ఇంటికి కోడలుగా నువ్వు సుఖపడలేవని గ్రహించాను..పైగా నీకు కాబోయే భర్తను ఆ భగవంతుడు ఏనాడో నిర్ణయించి వుంచాడు బేబీ! ఇప్పుడు సమయం వచ్చింది కనుకనే అతన్ని నేరుగా మనింటికి పంపించాడు!" -చెప్పేడు విష్ణుమూర్తి.

అశ్వినికి బోధపడలేదు.

"అమెరికాలో నీకొక మేనమామ వున్నాడని అప్పుడప్పుడు చెప్పేవాణ్ణి.. గుర్తుందా?" అడిగేడు వెంటనే.

గుర్తుతెచ్చుకునే ప్రయత్నం చేస్తోంది అశ్విని.

"పోనీ ఇప్పుడు మళ్లీ చెప్తాను విను!..మీ అమ్మకు స్వయాన అన్నయ్య!... నువ్ ఎరగవ్‌లే!.. అతగాడు అమెరికా వెళ్లిపోయి పాతికేళ్లయి పోయింది... అతనికో కొడుకున్నాడు.. పేరు గోపాలం!... ఇవాళ ఆ తండ్రీ కొడుకులిద్దరూ హైదరాబాదులో విమానం దిగి -టాక్సీలో సరాసరి మనింటికే వచ్చేరు!" అశ్విని వింటోంది..

విష్ణుమూర్తి ఇంకా చెప్తున్నాడు-

"గోపాలాన్ని చూసేను బేబీ!... శ్రీరామ్ కంటే బావున్నాడు...పైగా ఎమ్.బి.ఎ. చదివేట్ట!.. నిన్ను అతనికిచ్చి చేస్తే..మున్ముందు నా బిజినెస్ వ్యవహారాలన్నీ సమర్థవంతంగా చూసుకుంటాడు... నేనింక రెస్ట్ తీసుకోవచ్చు..అలా జరిగితే పైనున్న మీ అమ్మ ఆత్మ కూడా సంతోషిస్తుంది!"

తండ్రి మాటలు ఆమెకు రుచించలేదు..



"నీక్కావాలంటే ఆ బిజినెస్ వ్యవహారాల్నీ, ఆస్తీ ఐశ్వర్యాన్నీ -అన్నింటినీ కలిపి ఆ గోపాలానికో, గోవిందానికో ఇచ్చుకో...! నాకు అభ్యంతరంలేదు.... కానీ, నేను మాత్రం శ్రీరామ్‌తో తప్ప వేరే మగాడితో తాళి కట్టించుకోను!" -మొండిగా చెప్పిందామె.

విష్ణుమూర్తి కి ఒళ్ళు మండిపోయింది...

"అదే నీ చివరిమాటా?" అడిగేడు.

"అవును!"

"అయితే నా ఆఖరిమాట కూడా విను!..ఎంతో అపురూపంగా పెంచుకున్న నిన్ను- ఆ పిచ్చివాడింటి కోడలుగా పంపను గాక పంపను..వారం రోజుల్లోగా,ముహూర్తం ఎప్పుడంటే అపుడు -నిన్ను ఆ గోపాలానికిచ్చి, పెళ్ళి జరిపిస్తాను....సిద్ధంగా వుండు!" -అంటూ హెచ్చరించి విసావిసా బయటకు వెళ్లిపోయేడు విష్ణుమూర్తి.

పెల్లుబికి వస్తున్న దుఃఖాన్ని ఆపుకోలేక -నిస్సహాయంగా మంచంపై వాలిపోయి -దిండులో తలదాచుకుని ఏడుస్తూవుండి పోయింది అశ్విని...

కొన్నినిమిషాల తర్వాత వక్కనే బల్లమీదున్న సెల్‌ఫోన్ రింగవటంతో-దాన్ని అందుకుని, అందులో కనిపిస్తున్న నంబరు చూసింది... వెంటనే ఆమె గుండెల్లో బరువంతా తీరిపోయి -మనసు తేలికైనంతగా ఆహ్లాదం నిండి పోయింది..

అది శ్రీరామ్ నంబరు!

వరీక్షలురాని అతను వాళ్ళ ఊరువెళ్లిపోతూంటే- అపుడప్పుడు ఫోన్ చేస్తూండమని తనే-అతనికి 'సెల్‌ఫోన్' కొని బహుమతిగా ఇచ్చింది..అందుకే ఆ నంబరు ఆమెకు బాగా గుర్తుండిపోయింది...

వెంటనే ఫోన్ బటన్ నొక్కి 'హలో' అంది..

"అశ్విని! నేనే..... శ్రీరామ్‌ని !" అవతల్నించి వినిపించిన అతని గొంతు-మధుర స్వరాలెన్నింటినో వినిపించినట్లనిపించింది.

"చెప్పు శ్రీరామ్ !..ఎలా వున్నావ్?...ఏమిటి




విశేషాలు?" -ఉత్సాహాన్ని తెచ్చిపెట్టుకుంటూ అడిగింది అశ్విని.

"మా నాన్నగారు మన పెళ్ళికి ఒప్పుకున్నారు!" శ్రీరామ్ మాటల్లో సంతోషం ధ్వనించింది.

ఆ సంతోషానికి అశ్విని వెంటనే స్పందించలేక పోయింది.

ఒకప్పుడు శ్రీరామ్‌తో పెళ్లికి తన తండ్రి ఒప్పుకుంటే -ఆ చాదస్తం మాస్టారు వీల్లేదన్నాడు... ఇపుడు ఆయన అంగీకరిస్తే తన డాడీ 'ససేమిరా' అంటున్నాడు..."ఏవిటి అశ్విని ..ఇంత శుభవార్త చెప్తే ఫోన్లోనే ముద్దుల వర్షం కురిపించేస్తావనుకున్నాను...అలా మౌనంగా వుండిపోయావేమిటి?.....అసలు నేనే స్వయంగా మీ ఊరొచ్చి - ఈ శుభవార్త నీకు చెప్పాలనుకున్నా..మీ 'డాడీ'తో మాట్లాడి ముహూర్తాలు పెట్టించటానికి మానాన్నగారు ఎలాగా రెండు మూడు రోజుల్లో మీ ఇంటికి బయల్దేరి వస్తానన్నారు.. ఏకంగా 'ఎంగేజ్‌మెంట్'కే రావచ్చునని ఊరుకున్నా!.. అయినా విరహంలో కూడా సుఖం వుంటుంది కదా?.... అంతవరకూ ఆ సుఖాన్ని అనుభవిస్తూ ...కలల్లో నిన్నే చూస్తూ..." అలా శ్రీరామ్ ఫోన్లో ఏమిటేమిటో సంబరంగా మాట్లాడేస్తున్నాడు..

అశ్విని వింటూ వుండిపోయింది..

"అశ్వినీ..వింటున్నావా?" -కొన్ని క్షణాల తర్వాత అడిగేడు శ్రీరామ్.

"ఉఁ..ఉఁ..చెప్పు !"-పరధ్యానంలో వున్నా ఉత్సాహాన్ని ప్రదర్శించింది..

"ఇంక ఇపుడు చెప్పటానికేం లేదు...నీ మెడలో అర్జంటుగా తాళికట్టి నిన్ను నా దాన్నిగా చేసుకోవటమే!" ఆ తర్వాత ఇద్దరం ఏకాంతంలో కూర్చుని ఎన్నెన్నో మాటలు చెప్పుకోవచ్చు.. అంతవరకూ వెయిట్ చేస్తూండు...వుంటా...బై!"

అవతల 'ఫోన్' కట్టయింది...

అశ్విని కూడా తన 'సెల్‌ఫోన్' ఆఫ్ చేసి -మళ్ళీ ఆలోచనల్లోకి వెళ్లిపోయింది.

ఒకవైపు సంతోషం ..మరోవైపు సందేహం ..ఆమె మనసును అల్లకల్లోలం చేస్తున్నాయి... 'రేపెప్పుడో మంచిరోజు చూసుకుని శ్రీరామ్ తండ్రి ఇంటికొస్తాడు.. ఒకప్పుడు తనను అవమానం చేశాడన్న ప్రతీకారంతో ఇప్పుడు తన డాడీ కూడా ఆయన్ని అవమానం చేసి పంపిస్తే?...

'ఆ తర్వాత గోపాల్‌తోనే బలవంతంగా తన మెడలో మూడుముళ్లు వేయిస్తే...?

ఆ ఆలోచనలు అశ్విని అంతరంగాన్ని కలవరపరిచాయి...ఎంతోసేపు ఆలోచించి చివరకు ఓ నిర్ణయానికొచ్చింది...!

* * *

ఆరాత్రి మేడమీద గదిలో కూర్చుని-హనుమంతూ, గోపాలం మందు కొడుతున్నారు. "నీ మావయ్య కూతుర్ని చూశావా?" -రెండు పెగ్గులు గొంతు దిగిం తర్వాత గ్లాసులో మరో పెగ్గు పోసుకుంటూ-కొడుకుని అడిగేడు హనుమంతు.

"చూసేను ..చాలా బావుంది.. పేరు అశ్వినిట!.. పనిమనిషి చెప్పింది!"

ఆ మాట విన్న హనుమంతు కొడుకువైపు కొంచెం చిరాగ్గా చూసేడు. "పనిమనుషుల్తో మాట్లాడి 'చీప్'పై పోకుఁ?. అశ్వినితో పరిచయాన్ని పెంచుకో... అప్పుడప్పుడూ -తనతో ఏ హోటల్‌కో వెళ్లి వస్తూండు!" సిగరెట్టు వెలిగించుకుని చెప్పాడు.

"వెళ్ళాలని నాకు ఉంది! ..కానీ అశ్విని తన గది విడిచి పెట్టి బయటకు రావటంలేదు. ఇందాక, తనతో మాట్లాడదామని అటువెళ్లేసరికి-మావయ్య లోపలున్నాడు.. ఇద్దరూ ఘర్షణ పడుతున్నారు!"

'ఘర్షణా?.. దేనిగురించీ?" ఆత్రంగా అడిగేడు హనుమంతు.

-(ఇంకావుంది)





# తొలి సినిమాపాట సృష్టికర్త శ్రీ చందాల కేశవదాసు

- డా॥ ఎం. పురుషోత్తమాచార్య

"బలే మంచి చౌక బేరము" పాట వినగానే మనస్సు ఆనందంతో గంతులు వేయడం ప్రతి తెలుగువాడికి అనుభవంలో ఉన్నదే. "పరాబ్రహ్మ పరమేశ్వర' అని వినపడగానే రంగస్థల స్వరూపం, భగవంతుని త్రిమూర్త్యాత్మకత,నట రాజ తాండవ భంగిమ చప్పున గుర్తుకు వచ్చి మేను పులకరించడం ఆంధ్రులు చేసుకున్న అదృష్టం. ఈ అనుభూతులకు, ఆ పాటల సృష్టికర్త పేరు తెలుసుకోవాలనుకోవడానికి సంబంధం అంతగా లేకున్నా ఆ రచయిత ఎవరో తెలుసుకోవాలని కుతూహల పడడం ఒక సంస్కార విశేషంగా పెద్దలు చెబుతారు... పై రెండు పాటలను రచించిన వారు ఖమ్మం జిల్లా వాస్తవ్యులైన మహాకవి అష్టావధాని, హరికథా భాగవతార్, నాటక కర్త అయిన శ్రీచందాల కేశవదాసు గారు. వాటిని స్వరపరచినవారు దాసుగారి గురువు గారైన శ్రీ పాపట్ల లక్ష్మీకాంతయ్యగారు. వీరిద్దరూ కలిసి యాదగిరి గుట్ట బ్రహ్మోత్సవాలలో ధార్మిక సంగీత సాహిత్య కార్యక్రమాలకు శ్రీకారం చుట్టారు.

18,19 శతాబ్దాల మధ్య గుంటూరు జిల్లా తెనాలి తాలుకా 'చందవోలు' గ్రామం నుంచి ఖమ్మం జిల్లా గంగదేవిపాడుకు వలసవచ్చిన ఒక వైద్య కుటుంబ సభ్యులను ప్రజలందరూ చందోలు వారని సంభావించారు. అదే కాలక్రమంలో 'చందాల' వారయింది.

ఆ కుటుంబంలో పాపమ్మ, లక్ష్మీనారాయణ అనే పుణ్యదంపతులకు 1876 జూన్ 20న కేశవదాసు జన్మించారు. చిన్న తనంలోనే తండ్రి మరణించగా అన్నగారయిన వెంకట్రామయ్య గారే కేశవదాసును పెంచి పెద్ద చేశారు. తమ్మునికి ఉపాసనా విద్యను, రామనామ మంత్రాన్ని ఉపదేశించారు. తన లాగా ఆజన్మ బ్రహ్మచారి కావద్దని, గృహస్థ జీవితం గడుపుతూ ధార్మిక కార్యక్రమాలు చేవట్టమని బోధించాడు. కేశవదాసు ఆ మాటలను తు.చ. తప్పకుండా పాటించారు.

కేశవదాసు, చిట్టెమ్మ దంపతులకు జన్మించిన పెద్దకొడుకు కృష్ణమూర్తి RMP డాక్టర్. రెండోవాడు భద్రాచలంలో ఉపాధ్యాయుడు. ఆయన పేరు సీతారామయ్య. ఇప్పటికి వీరిద్దరూ కీర్తి శేషులయ్యారు. మూడవ సంతానమైన అండాళు గారి భర్త శ్రీగంధం నరసయ్యగారు, రిటైర్డ్ ఎం.ఇ.వో. వీరి కుటుంబం ఇప్పుడు నల్లగొండ జిల్లా మునగాల గ్రామంలో ఉన్నది.

నల్లగొండ జిల్లా కోదాడకు దగ్గరగా ఉన్న తమ్మర గ్రామంలోని శ్రీ సీతారామ చంద్రస్వామి దేవాలయం మీద, ఆ దేవుని మీదా దాసుగారికి విపరీతమైన భక్తి కుదిరింది. తాను సంగీత సాహిత్య కార్యక్రమాలద్వారా సంపాదించుకున్న ఆస్తినంతా ఈ దేవాలయ నిర్మాణానికి, సేవలకు, సప్తాహాలకు వినియోగించారు.

ఆయన కేవలం ఆధ్యాత్మిక కార్యక్రమాలకే పరిమితం కాలేదు. ఆనాటి స్వాతంత్ర్య సమరాన్ని ప్రశంసిస్తూ "జయతు జై' అనే పాట రాసి ఎస్.రాజేశ్వరరావు, ఆకుల నరసింహారావు గారల చేత పాడించి రికార్డు చేయించారు.

హుజూర్ నగర్, జగ్గయ్యపేట, తమ్మర, తిరువూరు, కందిబండ మొదలైన చోట్లలో అష్టావధానాలు చేసి సెబాసనిపించుకున్నారు. పోలంపల్లి, దబ్బాకుపల్లి, జక్కేపల్లి, ఖమ్మం, కోదాడ మొదలైన ప్రాంతాలలో హరికథాగానం చేసి బాగాపేరు, డబ్బు గడించారు. పేరును సమాజానికి, డబ్బును సప్తాహాలకు సమర్పించుకున్నారు.

ఆయన హరికథ విన్న శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రిగారు జగ్గయ్యపేటలో దాసుగారికి "అభినవ సూత" అనే బిరుదునిచ్చి సన్మానించారు. ఆనాటి దాసుగారి కథాగానానికి శ్రీద్వారం వెంకటస్వామి నాయుడు వయొలిన్ వాయించడం గొప్ప విశేషం.

మైలవరం రాజావారి బాల భారతీ నాటక సమాజంలోకి ప్రాంప్టర్‌గా ప్రవేశించిన కేశవదాసు క్రమంగా రచయితగా, నటుడిగా, దర్శకుడిగా ఎదిగారు. కనకతార, బలిబంధనం, నాగదాసు చరిత్ర, విరాటపర్వం, కేశవశతకం మొదలైన రచనలను 40కి పైగా చేశారు.

ఆయనకు బాగా పేరు తెచ్చి పెట్టిన నాటకం కనకతార. ఇది మన రాష్ట్రంలోనే కాక ఇతర రాష్ట్రాలలోనూ, ఇతర దేశాలలోనూ వెయ్యికి పైగా ప్రదర్శనలివ్వబడింది. నటసామ్రాట్ అక్కినేని నాగేశ్వరరావు గారు, పుట్టపర్తి సత్యసాయి బాబా వారు తమ చిన్నతనంలో, ఈ నాటకాలలోని తారపాత్రను పోషించడం చెప్పుకోదగ్గ గొప్పవిశేషం.

1931లో దాసుగారు మద్రాసుకు వెళ్ళి హెచ్.ఎం. రెడ్డిగారి దర్శకత్వంలో తయారైన మొట్టమొదటి తెలుగు టాకీ 'భక్త ప్రహ్లాద' కోసం "పరితాపభారంబు", " తనయా ఇటులన్", "భీకరంబగునా"అనే మూడు పాటలు రాశారు. సోమరాజు రామానుజరావు గారి 'సతీసక్కుబాయి' నాటకం కోసం ఆయన రాసిన 'గజ్జెలందియలు', 'రాదేలా కరుణ', వంటి

అయిదు పాటలను 'సతీసక్కుబాయి'' సినిమాలో ఉపయోగించుకున్నారు. అదేవిధంగా శ్రీ ముత్తరాజు సుబ్బారావుగారి శ్రీకృష్ణ తులాభారం నాటకం కోసం ఆయన రాసిన పాటల్లో 'బలే మంచి చౌక బేరమూ', మునివరా తుద కిట్లు, కొట్టుకొట్టండి, అనే పాటలను సినిమాల్లో వాడుకున్నారు.

దాసరి కోటిరత్నం నటించిన ''సతీ అనసూయ'' (1935) సినిమాకు దాసుగారు మాటలు, పాటలతో సహా పూర్తి స్క్రిప్టును రచించారు. 1936లో కాళ్ళకూరి సదాశివరావు గారి దర్శకత్వంలో విడుదలైన "లంకా దహనం" సినిమాకు కూడా ఆయన స్క్రిప్టు వ్రాశారు. ఆయన గారి 'కనకతార' నాటకంలోని రెండు పద్యాలు, రెండు పాటలు ఉపయోగించుకుంటూ, ఆయన కథనే అనుసరిస్తూ 1937లో 'కనకతార' సినిమాను "సరస్వతీ టాకీసు" వారు తీశారు. పానుగంటి వారి 'రాధాకృష్ణ' నాటకం కోసం దాసుగారు రాసిన పాటలను కొన్నిటిని 1939లో లక్ష్మీసినీ టోన్ వారు తీసిన ''రాధాకృష్ణ'' సినిమాలో ఉపయోగించుకున్నారు. ఇందులో స్థానం నరసింహారావుగారు ''రాధ'' గా అభినయించారు.

ఇవే గాక కేశవదాసుగారు సామాన్యప్రజల కోసం వేలు కొలువు పాటలు, మంగళ హారతులు, జోలపాటలు, హెచ్చరికలు, మొదలైనవెన్నో రచించారు.

1948లో రజాకార్ల అకృత్యాలకు అట్టుడికిపోయిన తెలంగాణలో భాగమైన జక్కేపల్లి గ్రామంలోని దాసుగారి ఇంటిని దుండగులు దోచుకున్నారు. ఆ దుష్కార్యంలో ఆయనగారి ఆస్తిపాస్తులతో పాటు రచనా సంపదకూడా అగ్నికి ఆహుతి అయ్యాయి. వెంటనే దాసుగారు ఆ వూరి నుండి ఖమ్మం పట్టణానికి మకాం మార్చారు. శిష్యుల, అభిమానుల కోరిక మేరకు 1950లో నాయకన్ గూడెం చేరారు. ఎక్కువ సమయాన్ని జపతపాలలోనూ, యోగధ్యానం లోనూ గడిపేస్తూ ఉండిపోయారు. అప్పుడు కూడా అడపాదడపా అష్టావధానాలు చేస్తూనే వున్నారు.

బొర్రా కోటయ్య చౌదరి గారి ''భారత కర్మాగారము'' అనే నాటకాన్ని, సందడి రామదాసుగారి మాధవశతకాన్ని పరిష్కరించి వారిద్దరి రచనా వ్యాసంగాన్ని ఎంతగానో ప్రోత్సహించారు.

ఆయన క్రమక్రమంగా ఉపాసనాధ్యాన స్థితిలో తాదాత్మ్యం చెందుతూ విజయనామ సంవత్సర వైశాఖ శుద్ధపంచమి అంటే 14-6-1956నాడు పరమపదం చేరుకున్నారు.

తెలుగు సాహితీ రంగానికి, సామాజిక రంగానికి, తెలుగు సినిమా రంగానికి కేశవదాసుగారు చేసిన సేవలు వెలకట్టలేని పెన్నిధులు.

---



ఈ వ్యాస రచయిత డా॥ ఎం.పురుషోత్తమాచార్య నల్లగొండలోని గీతా విజ్ఞాన ఉన్నత పాఠశాలలో తెలుగు ఉపాధ్యాయునిగా పనిచేస్తున్నారు. సంగీత సాహిత్యకోవిదులైన వారి తండ్రి శ్రీ వెంకట నరసింహాచార్యులు శిక్షణ ఇచ్చిన ఒక పాట మనస్సుకు హత్తుకుని, దాని చరిత్రను తవ్వితీయగా ఆ పాట చందాల కేశవదాసుగారు రాసినదని తెలుసుకున్నారు.

ఆ ప్రేరణతో 1998 నుండి 'శ్రీ చందాల కేశవదాసు సాహిత్యం - పరిశీలనం' అనే అంశాన్ని తీసుకుని పరిశోధన ప్రారంభించారు. దాసుగారి కొన్ని రచనలను సేకరించారు. వారి సమకాలికులను కలిసి ఇంటర్వ్యూ చేశారు. డా॥ కె.ఫక్రుద్దీన్ గారి పర్యవేక్షణలో సిద్ధాంత వ్యాసాన్ని ఉస్మానియా విశ్వవిద్యాలయం వారికి సమర్పించగా అక్టోబరు 2003లో పురుషోత్తమాచార్య గారికి డాక్టరేట్ పట్టాన్ని ప్రకటించారు. కాని ఇంకా పరిశోధించి ప్రకటించవలసిన విషయాలు, లభించాల్సిన రచనలు చాలా ఉన్నాయంటారాయన.

కేశవదాసుగారి జననమరణాలు రెండూ జూన్‌నెలలోనే సంభవించడం ఒక విశేషంగా భావించి ఈ వ్యాసాన్ని రాసిన డా॥ ఎం.పురుషోత్తమాచార్య డాక్టరేట్ పట్టాకోసం సమర్పించిన సిద్ధాంత వ్యాసంలోని కొన్ని భాగాలివి.....

## శ్రీకృష్ణ తులాభారము

**బలేమంచి చౌక బేరము**

కాఫీ రాగం - త్రిశ్ర ఏకతాళం

బలేమంచి చౌక బేరము
ఇది సమయము మించినన్ దొరకదు
త్వరన్ గొనుడు సుజనులార ॥బలే॥

1. విలువ ఇంతయని తెల్పుట కలవిగాని బేరము
సలిలజ గర్భాదులకౌ ఘనుల కందని బేరము
కలుముల చేడియకు సతతము నిలయమైన బేరము
ఫలాపేక్ష రహిత భక్త సులభమైన బేరము ॥బలే॥

2. ధన ధనేతరముల చేతగాని సా
ధన శమదమ నియమములకు గాని
లభియింపబోదు సుండీ కా
దనుకొను డౌననుకొనుడొక
మనసు నిష్కళంకముగా
నొనరించి తృణంబొసగిన
వెనువెంటనె నడచుచుండు ॥బలే॥

3. ఓ యాదవులారా గనుచు నూరక నిలుచున్నారు
మీ యజమానుని గొనుడు సుమీ తరి చెడుగా పిదప
నా యీ పల్కులు మీ మానసము నందునిడి దూరం
బరయుడు సరగున తడయక ॥బలే॥

4. ఇదియె తుదిసమయము త్వరపడుడు
ఇకెన్నటికిని దొరుకబోదు మరి
సదమలాత్ములని ఇది మరిమరి ని
శ్చయము తప్పకను తెలిపితిగా
అదృష్టమింత కెవరిదియో విధిగా
నచటికే జనునుగా ముదంబిపుడు ॥బలే॥

సత్యభామ చేసిన పుణ్యకవ్రతంలో నాథుడిని తన ధన సంపదతో తూచలేక పోవడం చూసిన నారదుడు కృష్ణుడిని అమ్మడానికి వెళుతూ పాడే పాట ఇది.

ఇన్ని విశేషాలున్న రచన కనుక సినిమాలోనే కాదు,ప్రజల నాలుకపైన కూడా ఈ పాట నిలిచిపోయింది. అంతే కాదు,దీని పల్లవి ప్రజలవాడుకలో నానుడిగా కూడా స్థిరపడిపోవడం దాసుగారి ప్రతిభా విశేషం, ఆంధ్రుల అదృష్టం.

**పరాబ్రహ్మ**

చందాల కేశవదాసుగారి పాటల్లో ప్రధానంగా చెప్పుకోవలసిన ప్రసిద్ధమైనది, నాటక ప్రదర్శనారంభ సమయ ప్రార్థనా పూర్వకమైనది - అయిన ఒక భక్తి గీతం.

**కళ్యాణిరాగం-రూపకతాళం**

పరాబ్రహ్మ పరమేశ్వర
పురుషోత్తమ సదానంద
పరంజ్యోతి పరాత్పర
పతిత పావన స్వప్రకాశ ॥పరా॥

చ: వరదాయక సకలలోక
వాంఛిత ఫలదాప్రమేయ
పాహిపాహి మాంపాహి ॥పరా॥

### కొట్టు కొట్టండిరా

ఆ జగన్నాథుణ్ణి నడివీధిలో అమ్మడం ఇష్టంలేని యాదవులంతా కలిసి కోపోద్రిక్తులై నారదుడిని కొట్టడానికి బయలుదేరుతూ పాడిన పాటయిది. జానపదులు పాడుకునే పాట కనుక పాటంతా జానపద ధోరణిలో సాగుతుంది. జానపదులే కానక్కరలేదు. ప్రజలందరికి కృష్ణుడంటే ఎంతప్రేమో, మరెంత భక్తియో ఈ పాట చక్కగా చిత్రించి మన కనుల ముందు నిలబెట్టింది.

శంకరాభరణం -త్రిశ్ర

కొట్టూ కొట్టండీ బుఱ్ఱ పగల ॥కొ॥
జుట్టూడ లాగండి- సెవులూ మెలెయ్యండి ॥కొ॥
నారదుండంట సన్యాసి గండడంట
దొరగారి నమ్మునంట తన బాబు సొమ్మంట
గడియగడియ కొచ్చి అమ్మగార్ని మోసపుచ్చి ॥కొ॥
మెడకు తాడుగట్టి సొంత మేకపిల్లలాగా తెచ్చి
నడిబజారులోన కిట్టసామి నమ్మునంట
ఈడి తాతసొమ్మంట ఈడ దాసుకొన్నాడంట
బుడిగిజంగంలాగ తంబుర మెడ నేసుకొని
జడుపు లేక వాగుతాడు నడుము విరిగి చచ్చేటట్టు ॥కొ॥

ఇందులో కూడా సాహిత్యసౌరభాన్ని గుబాళింప జేశారు దాసుగారు.

"ఈడి తాత సొమ్మంట
ఈడ దాసుకొన్నాడంట"

అనడంలో పౌరాణిక భావజాలాన్ని ధ్వనింపజేశారు. నారదుని తండ్రి బ్రహ్మ, బ్రహ్మ తండ్రి విష్ణువు కనుక నారదునికి విష్ణువు తాత. విష్ణుస్వరూపుడైన కృష్ణుడిని అంటే తాతగార్ని ద్వారకలో దాచిపెట్టాడు కనుక ఆయన,నారదునికి తాత సొమ్మే!

జానపదకళారూపాల్లో 'బుడిగ జంగాలు' అనేది ఒక ఒక కళా ప్రక్రియ. శైవ కథలు గానం చేస్తూ 'బుడిగె' అనే వాద్యం వాయించే వారు కనుక వీరికి బుడిగె జంగాలు అనే పేరు వచ్చింది.

### భక్తప్రహ్లాద (1931)

**కానడరాగం -ఆదితాళం**

పరితాపభారంబు భరియింపతరమా
కటకటనే విధి గడువంగ జాలుదు
పతి ఆజ్ఞను దాటగలనా
పుత్రుని కాపాడ గలనా... ॥పరి॥
1. ఈ విషము నేనెటులను
తనయుని త్రావింపగలను?
ధర్మము కాపాడుదునా?
తనయుని కావగగలనా ?.... ॥పరి॥

2. నాదనామక్రియరాగం - ఆదితాళం.

తనయా ఇటులన్ తగదురా బలుకా
తండ్రిమాట వినకా.... ॥తనయా॥
సకల సద్గుణంబులకు నిధివై
శాంతి మార్గావలంబకుడవునై ...... ॥తనయా॥
1. జనకుకంటే గురుదైవమెవ్వరిల
ప్రేమభరిత ఇటుతగునా?
శత్రుత్వమున్ జూపగన్... ॥తనయా॥

3. మధ్యమావతిరాగం - ఆదితాళం

భీకరమగు నా ప్రతాపంబునకు
భీతి లేక ఇటుచేసెదవా?..... ॥భీకర॥
1. భీరుడవై, క్రూరుడవై, చోరుడవై, పొరుడవై,
నాదగు సతినిటులన్ నీవిటు చెరగొనన్
నాదగు సామర్థ్యం బరయగ నెంచితివే
ఖండ ఖండములగ ఖండించెద నిను దుండగీడ ॥భీ॥

ఈ పాటల్లో సాహిత్యపరమైన, ఛందస్సు పరమైన విశేషాలెన్నో కనిపిస్తాయి. మొదటి పాటలో 8 పంక్తులు, రెండవపాటలో 7 పంక్తులు,మూడవ పాటలో '6' పంక్తులుండడం విలోమవైచిత్ర్యం.

### సతీసక్కుబాయి

దాసుగారి కుమారుడు కృష్ణమూర్తిగారు ఓ లిఖితపూర్వక సమాచారంలో ఈ విషయాన్ని ధ్రువీకరించారు.

"సతీసక్కుబాయి నాటకమునకు నాన్నగారు పాటలు రాసినారు. తుంగల చలపతిరావు రాదేలకరుణ,పాలుమీగడలెన్నో అనే పాటలను,మిస్ రామతిలకం ఆటలాడుకోరా అనే పాటను పాడినారు. సక్కుబాయిలో వీరి పాటలను పూర్తిగా వాడుకున్నారు".

1. మాండ్‌రాగం - ఆదితాళం

గజ్జెలందియలు ఘల్లుఘల్లుమన
గంతులు వేయర గోపాలా
బొజ్జనిండ పాలారగించి నీ
మురళీగానము సేయరా నీ
వాటరాడుకోరా నా ముద్దుల
మూటగదరా గోపాలా ॥ఆట॥
1. కనికర మింతయులేక యశోదనిన్
కట్టివైచెనా రా తండ్రీ
కట్లు విప్పెదను పారిపోకు నా
కన్నుల పండువు సేయరా
నందకుమారా నవనీతచోరా
బృందావన భువిసంచారా
అందమెల్ల నీ సొమ్మేరా మా
మందిరమును విడనాడకురా ॥ఆట॥

కాఫీరాగం - ఆదితాళం

కృష్ణాపోబోకుమా
పరమాత్మా పరంధామ పోబోకుమా ॥కృష్ణా॥
1. పదయుగమును నే నమ్మితిరా
వదలిచనుట అన్యాయమురా ॥కృష్ణా॥
2. అగుపించితివని మురిసితిరా
ఆశలన్నీ వృథాసేయకురా ॥కృష్ణా॥

దేవదేవిగా,రాధగా,సక్కుబాయిగా రంగస్థలంమీద తన మృదుమధుర కంఠస్వరంతో ప్రశస్తిపొందిన తుంగల చలపతిరావుగారు ఈ పాటను కొన్ని వేలసార్లు పాడి ఉంటారు. ఈ పాట లేకుండా సతీసక్కుబాయి నాటకానికి ఉనికిలేదు. స్థానం వారికి 'మీరజాలగలడా' ఎంతటి ఉన్నతస్థానాన్ని ప్రసాదించిందో తుంగల వారికి ఈ పాట అంతటి ఉన్నత పీఠాన్ని సంపాదించి పెట్టింది. బెంగుళూరులో ఆయన పాడి రికార్డు ఇవ్వగా అది విడుదలై చలన చిత్ర సంగీతరంగపు రికార్డును బ్రద్దలు కొట్టింది. దాసుగారి రచనకు, ద్రైతావారి స్వరకల్పన అంత గొప్ప ప్రాణం పోసింది.

1935నాటి సినిమాలో చిలకమర్తి వారు దీనికి అనుకరణ రాసినా,1955 లో చిన్ని బ్రదర్స్ వారికి సముద్రాలవారు అనుకృతి చేసినా బాణీమాత్రం మార్చలేకపోయారు. ఎందుకంటే సాహిత్యం ఏదైనప్పటికీ ప్రజల గుండెల్లో సంగీత మాత్రం నిలిచిపోయింది కనుక. అయినా ఆ రోజులలో సంగీత బాణీలకు హక్కులుగాని ఆంక్షలుగాని లేవు. ఎవరైనా యథేచ్ఛగా ఉపయోగించుకోవచ్చు.

ఇంత గొప్ప ప్రజాదరణపొందిన ఈ పాట బాణీ ద్రైతావారి పూర్తి సృష్టికాదని, దీనిలో మరాఠీ బాణీ పోలికలున్నాయని పైడిపాల గారు ప్రమాణం చూపారు.

'కృష్ణాపోబోకుమా
పరమాత్మ పరంధామా పోబోకుమా'

అనే పాటకు 'కిసీగానే జీతుల' అనే మరాఠీ పాట బాణీ ఆధారమట'

అని 07-11-1989 నాడు ఓ ముఖాముఖిలో ఆదినారాయణరావు పైడిపాలతో అన్నారుట.

హాస్యనాటిక

# కారులో షికారు

**ఇందులో పాత్రలు**

| | | |
|---|---|---|
| పాపారావు | గౌరీపతి | శ్రీనివాస్ |
| ఎ.సి.బి. ఇన్‌స్పెక్టర్ | భిక్షం | కావేరి |

**- కె.వి.ఆర్.విజయకుమార్**

**జరిగిన కథ**

రిటైర్డు హెడ్‌మేష్టారు గౌరీపతి కొడుకు శ్రీనివాస్(వాసు) వ్యాపారం అంటూ అందర్నీ పిచ్చిస్కీములో చేర్పించాలని చూస్తాడు. పక్కపోర్షన్లో ఉన్న రెవెన్యూ ఉద్యోగి కూతురు కావేరిని ప్రేమిస్తాడు. వాళ్లిద్దరి పెళ్లి గౌరీపతికి సమ్మతమేకానీ పాపారావుకిష్టంలేదు. తన కూతురికేసి కన్నెత్తి చూడనని మాటిస్తేనే స్కీములో చేరతానని వాసుకు చెప్తాడు. ఓరోజు భిక్షం అనే అతను పాపారావు ఇంటికి లంచం యివ్వటానికి వస్తాడు.

- ఇక చదవండి

భిక్షం : చెప్పొచ్చుకొడ్తారా? (ఆశ్చర్యం) ..సర్ ఆ సర్టిఫికెట్లు...లంపటాలు నా దగ్గర లెవ్వు సార్...మీరేం చేస్తారో నాకు తెలీదు. నాకు మాత్రం లోను శాంక్షను కావాలి. మీకు ఎంత కావాలన్నా యిచ్చుకుంటాను. (అంటూ పాంట్ జేబులోంచి రూ.500/- రూపాయల నోట్లు పది లెక్కేసి పక్కన ఉన్న టీపాయి మీద పెట్టి) ఇంక మీరు కాదనకూడదు....వుంటాను సార్...అవి లెక్కేసుకోండి. లెక్కేసు కోండి సార్ (అంటూ గట్టిగా అరుస్తూ బయటకు పరుగెత్తుతాడు)

(భిక్షం డబ్బులు తియ్యటం.. లెక్క పెట్టటం... అప్పటివరకూ తాపీగా వున్నవాడు హడావుడిగా పరుగెత్తటం గమనిస్తున్న పాపారావుకి డౌట్ వస్తుంది)

పాపారావు : (భిక్షం వెళ్ళిన వైపు తేరిపారా చూసి) (స్వగతంగా అనుకుంటాడు) పిల్లికి భిక్షం పెట్టని ఈ భిక్షం వెధవ ఒక్కసారిగా ఇన్ని డబ్బులు ఇవ్వటం ఏమిటబ్బా?.. అయినా లోనుకి రికమండ్ చేయటమే గానీ... వస్తుందో రాదో తెలియదు... శాంక్షన్ చేసేది మనం కాదు...ఈ చిన్నపనికి పని గట్టుకొని యింత డబ్బు.. అమ్మో యిందులో ఏదో తిరకాసున్నట్లుగావుంది... కొంప తీసి దొంగనోట్లు కాదు గదా! (అంటూ అనుమానంగా నోట్ల వైపు చూస్తాడు).

ఏది ఏమైనా తగు జాగ్రత్త లో.. మన జాగ్రత్త లో.. యిల్లు కట్టిన గౌరీపతి కి కూడా తెలియని స్థలంలో దీన్ని భద్రపరచాలి (అనుకుంటూ టీపాయ్ మీద వున్న నోట్ల మీద జేబులో వున్న ఖర్చీఫ్ వేసి తీసి, జాగ్రత్తగా లోపలికి వెళ్ళి వాటిని దాచి..ఏమీ తెలియనట్లు వసారాలోకి వచ్చి టీపాయ్ మీద న్యూస్ పేపరు తీసి చదువుతూ కుర్చీలో కూర్చుంటాడు)

(ఇంతలో బయట నుంచి గంభీరమైన అరుపులు వినిపిస్తాయి)

ఎక్కడ ..ఎక్కడిదిరా ..ఈ అవినీతి వాసనా? ..(అంటూ భరద్వాజ పాత్ర ప్రవేశం. భరద్వాజ గెటప్ పోలీస్ ఇన్‌స్పెక్టర్. చేతిలో హ్యాండ్ స్టిక్ వుంటుంది. హ్యాండ్‌స్టిక్‌ని రెండు



చేతుల మధ్య తిప్పుతూ ... పరిసరాల్ని వాసన చూస్తూ లోపలికి ప్రవేశం. భరద్వాజ ఇన్‌స్పెక్టరు గెటప్‌కి బుర్రమీసాలు స్పెషల్ ఎట్రాక్షన్)

భరద్వాజ : ఆ...అవినీతి ఎక్కడున్నా..ఈ భరద్వాజ ఉక్కుపాదాల క్రింద పడి బిక్కచచ్చి పోవాల్సిందే..ఎక్కడ (అంటూ స్టేజీ నాలుగుపక్కలా తిరుగుతాడు)

(ఈ హడావుడి అంతా ఆశ్చర్యంగా చూస్తున్నా పాపారావు)

పాపారావు : (భరద్వాజని పట్టుకొని ఆపి) ఎవర్రా నువ్వు? సరాసరి యింట్లో కొచ్చి పూరకుక్కలా యిల్లంతా వాసన చూస్తున్నావ్.. పైగా ఈ దసరా వేషం ఒకటి.. పిట్టలదొర వేషమా? పిచ్చి పోలీసు వేషమా? అబ్బో ..మీసాలు కూడా దిట్టంగా పెట్టావే (అంటూ ఒక్కటి చరుస్తాడు)

భరద్వాజ : (పాపారావు కాలర్ పట్టుకొని) రేయ్..ఎవర్ని పట్టుకొనిరా దసరా వేషం అంటున్నావ్ ..ఈ ఎ.సి.బి. ఇన్‌స్పెక్టరు భరద్వాజ నీకు పిట్టల దొరలాగా....పిచ్చి పోలీసులాగా కనిపిస్తున్నాడురా! డొక్క చీరేస్తా.. ఖబడ్దార్ (అంటూ ఊపేస్తాడు)

(పాపారావు ఖంగుతింటాడు. భయం భయంగా చూస్తాడు) ఏంట్రా..మీసాలు దిట్టంగా బెట్టా నంటావ్....(అంటూ మీసాలు దువ్వుకుంటూ కుర్చీలో కూర్చుంటాడు. కాలుమీద కాలు వేసుకొని)సరేగాని నీ పేరేంట్రా?....

పాపారావు : (వణికిపోతుంటాడు )పా...పా... రావండి!

భరద్వాజ : పాపారావా... పాపారావా?.....నా సంగతి తెల్సా...అవినీతిని అణిచి వేసే అంకుశాన్ని! లంచాల కొమ్ములు విరిచి పేగులు తీసే సింహాన్ని , నరసింహాన్ని...

పాపారావు : ఐతే భరద్వాజ కాదా సార్? (భయపడుతూనే అనుమానంగా అడుగుతాడు)

భరద్వాజ : (సైలెంట్‌గా తల పైకెత్తి ఓ చూపు చూసి ) వెటకారమా.... లాఠీతో కొడితే కోఠీలో పడతావ్ (అంటూ పైకి దూకుతాడు)...తియ్యరా బైటికి...ఆ భిక్షం గాడి దగ్గర




తీసుకున్న భిక్షం... ఛీ... ఛీ.... లంచం (అంటూ పాపారావు కాలర్ పట్టుకుంటాడు)

పాపారావు: భిక్షం గాడెవడూ..... భిక్షం ఏమిటి? ఛీ..ఛీ... లంచమేమిటి?... మీరు పొరపడుతున్నారు సార్... నేను అలాంటివాడిని కాదు సార్... అలాంటివాడిని కాదూ..దూ... (అంటూ దొంగ ఏడుపేడుస్తాడు)

భరద్వాజ: అబ్బా.... టివి సీరియల్స్ బాగా వంటబట్టాయ్. పావలా వేషానికి ముప్పావలా మేకప్ వేసినట్టు కవర్ చేస్తున్నావ్.... (అంటూ గంభీరంగా) అరె అరెరేయ్... ఈ భరద్వాజతో పెట్టుకోకురా... నీ చేత నిజం ఎలా కక్కిస్తానో నా టాలెంట్ చూడ్రా (అంటూ) భిక్షం....భిక్షం.. (అంటూ కూతలాగా పిలుస్తాడు)

(భిక్షం నెమ్మదిగా వచ్చి నిలబడతాడు)

యిప్పుడు చెప్పు....ఆ డబ్బు లెక్కడ దాచావ్... (అంటూ పాపారావు జేబులు వెతుకుతాడు. డబ్బులు దొరకవు) ఛీ...ఛీ..(అంటూ రెండు చేతులూ దులుపుకుంటూ పాపారావు వైపు తీక్షణంగా చూస్తూ) అరేయ్ భిక్షం అర్జంటుగా గ్లాసుతో నీళ్ళు పట్టుకురారా...

పాపారావు : సా..ర్... నీళ్ళెందుకుసార్? (అనుమానంగా అడిగాడు)

భరద్వాజ : నీ చేత స్నానం చేయిద్దామని కాదురా నేను నీళ్ళు తీసుకు రమ్మంది..నీ చేతులు కడిగిద్దామని ఆ.. (కన్‌ఫాంగా చెప్తాడు)

పాపారావు : ఇప్పుడెందుకు లెండిసార్. ఈ సారెప్పుడైనా మీ యింటికి భోజనానికి వస్తాలెండి. (సంతోషంగా, సిగ్గుపడుతూ అంటాడు)

భరద్వాజ : అబ్బా... ఆఁ... ఇదంతా సిగ్గే?... చర్మం ఛీరేస్తా రోయ్. నా దగ్గర అతి వేషాలేస్తే.... అయ్.... ఈ భరద్వాజ అంటే రాష్ట్రం మొత్తం గడగడ లాడుతోంది. నాతో పరాచికాలా?

నీళ్ళతో హ్యాండ్స్ వాష్ చేస్తే మేము కరెన్సీకి వాడిన కెమికల్స్ పూతవల్ల..... అపుడు నీ రంగు బయట పడుతుంది. అపుడు కేసు బుక్‌చేసి నిన్ను బొక్కలో తోస్తాన్రా (అంటూ) ముందు నువ్వు నీళ్ళు తీసుకురా భిక్షం (అంటూ అరుస్తాడు)

భిక్షం : నీళ్ళా సార్.... (ఆశ్చర్యంగా)

పాపారావు : వాడికదో జబ్బులెండి (ఇంతలో గ్లాసుతో నీళ్ళతో భిక్షం వస్తాడు)

భరద్వాజ : (పాపారావుతో) నువ్వు ముయ్.. (భిక్షంతో...పాపారావ్ చేతులు ముందుకు లాగి ) నువు... పొయ్ (అంటాడు) (పాపారావు చేతులు కడుగుతాడు)

భిక్షం : (నీళ్ళు పోస్తూ) సార్ రంగు రావటం లేదుసార్ (అంటాడు)

భరద్వాజ : ఏవోయ్.. పాపారావు ..నీవు పెద్ద సీనియర్ లాగా ఉన్నావ్. అయినా సరే. అవినీతిపై సింహం వేట ఆపదు. ఒరేయ్ భిక్షం ఇల్లంతా అణువణువు గాలించు....ఆ లంచమిచ్చిన నోట్లు కనిపెట్టి .. వీణ్ణి శ్రీకృష్ణజన్మస్థానానికి పంపించే దాకా నేను నిద్రపోను (అంటూ ఆవులించి)ఛీ.... నిద్రపోను.

(అంటూ పాపారావును వదిలి నాలుగు మూలలూ గాలిస్తుంటాడు. భిక్షం యింట్లో వెతుకుతుంటాడు. పాపారావు నిలబడి గమనిస్తుంటాడు) లోపలినుండి బయటకు వస్తాడు. భరద్వాజ బయట నుండి వెతుక్కుంటూ లోపలికి వెళ్తాడు.

మళ్ళీ భిక్షం లోపలికి - భరద్వాజ బయటకు వస్తారు. ఇంతలో సార్... అని భిక్షం బాధగా అరుస్తాడు)

పాపారావు : ఇదేంటి..వీడు ప్రతి దానికి ఆశ్చర్యంగా అరిచేవాడు... బాధగా మూలిగా డేంటబ్బా? (అంటూ గుమ్మంవైపు చూస్తాడు) (భరద్వాజ కూడా గుమ్మంవైపు చూస్తాడు)

భిక్షం : (నోట్లో వేలు పెట్టుకొని చీకుతూ వస్తాడు) సార్.. యింట్లో మొత్తం వెతికి.. బాత్రూంలో వెతుకుతూ చీకట్లో గూట్లో చెయ్యి పెడితే తేలుకుట్టింది సార్... (అంటూ ఏడుస్తాడు)

పాపారావు : తేలుకుట్టిందా? (అంటూ ఆశ్చర్యపోయి) ఛీ...ఛీ.... (దరిద్రుడా నీ జబ్బు నా కంటుకున్నట్లుంది. తేలు కనపడితే కోడి....కోడి... కోడి...అంటూ వెంటబడితే నిలబడుతుంది. అదిగో ఆ మూలున్న చెప్పు తీసుకెళ్ళి చంపెయ్..లేకపోతే, రేపు మనల్ని కుట్టినా కుడుతుంది (అంటూ చెప్పు అందిస్తాడు)

భరద్వాజ : అరేయ్ పాపారావు?....ఏం అనుకుంటున్నావ్‌రా వేమంటే నీ కొంపలో తేళ్లు పాముల్ని పట్టటానికొచ్చిన పాములోళ్ల మనుకున్నావా...లేకపోతే ఉడుతలు బట్టే నక్కలోళ్ళను కున్నావేరా. . ఇక నీకు యావజ్జీవ శిక్ష వేయించకపోతే నా పేరు భరద్వాజ...ఛీ..ఛీ.....భరద్వాజ కాదురా (అంటూ ఆవేశంతో ఊగిపోతాడు.)

భిక్షం : (భరద్వాజతో ) సార్.... మనమిచ్చిన డబ్బులెక్కడా కనపడం లేదు సార్ (అంటూ బిక్కమొగం వేస్తాడు)

భరద్వాజ : (గతుక్కుమంటాడు. గబగబా భిక్షం మీద చెయ్యివేసి మూలకి లాక్కెళ్ళి) దరిద్రుడా ...నేనిచ్చిన డబ్బులు వీడికిచ్చావా? కక్కుర్తిపడి నువ్వే నొక్కేశావా? (అంటూ ఆవేశంతో ఊగిపోతాడు.)

భిక్షం : మీమీదొట్టు సార్..నేను ఇంతకు ముందు స్వయంగా యిచ్చి.. మీరు చెప్పినట్లుగానే బయట కొచ్చి మీకు సిగ్నల్ కూడా యిచ్చానుగా సార్ (అంటూ ఏడుపు మొహంతో చెబుతాడు)




భరద్వాజ : సిగ్నల్ కరెక్ట్‌గానే యిచ్చావ్... డబ్బులు యిచ్చి చచ్చావో.. లేదో. అనే డౌటు (అంటూ మేకపోతు గాంభీర్యం వొలకబోస్తూ పాపారావు వైపు వెళ్తాడు)

భరద్వాజ : వెల్...మిస్టర్. పాపారావు ..నీకు నువ్వుగా మాకు లొంగిపోయి తప్పును వొప్పుకుంటే నీకు శిక్ష పడకుండా చూసే పూచీనాది... ఇంతకీ ఆ డబ్బెక్కడ దాచావో చెప్పు (ప్రాధేయపూర్వకంగా అడుగుతాడు)

పాపారావు : ఏ డబ్బు.... నాకేం తెలీదే?

భరద్వాజ : (భిక్షం వైపు అనుమానంగా చూస్తాడు. భిక్షం దణ్ణం పెడుతూ అతనికే యిచ్చానని సైగ చేస్తాడు) ఓ.కె. మనం ఓ అండర్‌స్టాడింగ్‌కి వద్దాం అన్నమాట.. నీకిచ్చిన 5,000/- రూపాయలు..నిన్ను విడిచిపెట్టడానికి మరో 50,000/ రూపాయలిస్తే గుట్టు చప్పుడు కాకుండా కేసు మూసి వేస్తానన్నమాట.

పాపారావు : అసలు డబ్బే యివ్వలేదంటుంటే దాన్ని మాఫీ చెయ్యటానికి డబ్బు లంటావేంటి? మీ వాడు నాకు డబ్బులిచ్చినట్లు ప్రూవ్ చెయ్యి కేసు పెట్టుకో.

భరద్వాజ : అమ్మా భిక్షం యిలా రామ్మా... (అని భిక్షం దగ్గరకు రాగానే)వాడు యివ్వ లేదంటాడు.. నువ్వేమొ యిచ్చానంటావ్.... మధ్యలో నన్నువుంచావ్‌రోయ్. దేవుడోయ్. వా... (అంటూ గుప్పిట మూసి నోట్లో కుక్కుకుంటాడు) (తర్వాత ఒక నిర్ణయానికి వచ్చి) ఒరేయ్... మీ యిద్దరి పెద్దలకి దండం పెడతాను...నాకు పుట్టే పిల్లలకి ఛండాలంగా మీ పేర్లు పెట్టుకుంటాను. దయచేసి నా డబ్బులివ్వండిరోయ్ (అంటూ వెంటపడ్తాడు) (పాపారావు భరద్వాజ దగ్గరికి రానిచ్చి భుజం మీద చెయ్యివేసి)

పాపారావు : ఏరా....అవినీతి సింహానివా... ఎ.సి.బి ఇన్‌స్పెక్టర్‌విరా నువ్వు (అంటూ కాలర్ పట్టుకుంటాడు)

భరద్వాజ : (వెంటనే గాంభీర్యం నటిన్నూ) ఏంటి... బతిమిలాడుతున్నానని గొట్టంగాడిలాగానో... లేకపోతే పుడింగ్ గాడి లాగానో కనిపిస్తున్నానా? ఒరిజనల్ ఇన్‌స్పెక్టర్ భరద్వాజ.. అవినీతి సింహం (అంటూ పులిలా గాండ్రిస్తాడు)

పాపారావు : నోర్ముయ్యరా... ఇందాక నువ్వు నా చేతులు కడిగేటప్పుడు చూసా..

భరద్వాజ : ఏం చూశావ్.. (అంటూ గతుక్కుమని వెనక్కి తిరిగి జిప్ లాక్కుంటూ డ్రస్ సరిచేసుకుంటాడు)

పాపారావు : (భరద్వాజ డ్రస్ జేబుకున్న లేబుల్ చూపిస్తూ అడుగుతాడు) ఏంట్రా యిది?

భరద్వాజ : రెడ్డిమాను శాంతయ్య డ్రామాడ్రస్ కంపెనీ, యన్.ఆర్.టి. అంతే.... (అని నాలుక కరుచుకుంటాడు)

పాపారావు : నిజమైన ఇన్‌స్పెక్టర్ ఎవడూ డ్రామా డ్రస్ అద్దెకు తెచ్చుకోడురా.. సోంబేరీ! అది చూసిన తర్వాత అసలు మీ ప్లానేమిటో కనుక్కుందామని యింతసేపాగాను. ఇక నడవండిరా పోలీసుస్టేషన్‌కి (అంటూ భిక్షం భరద్వాజ ఇద్దరినీ కాలర్లు పట్టుకొని లాగుతాడు.)

-(తరువాయి వచ్చే సంచికలో)

జంధ్యాల & కె.వి.మహదేవన్ వర్ధంతులను పురస్కరించుకుని....

# సరిగపదమని

కూర్పు : టి.నవీన్, హైదరాబాద్

**21**

| | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|
| 1 | | 2 | | ● | 3 | | 4 | |
| | ● | | ● | ● | | ● | | ● |
| ● | 5 | | ● | 6 | ● | 7 | ● | 8 |
| 9 | ● | | ● | 10 | | ● | 11 | |
| 12 | | ● | 13 | | ● | ● | | ● |
| ● | ● | 14 | | ● | 15 | | ● | 16 |
| 17 | ● | | ● | ● | | ● | 18 | |
| | ● | 19 | 20 | ● | 21 | | ● | |
| 22 | | ● | | ● | ● | ● | 23 | |

పంపినవారి పేరు :..........................................................

వయసు :........... వృత్తి :..........................................................

చిరునామా :..........................................................

..........................................................

..........................................................ఫోన్ :..........................

**నిబంధనలు:**

ఎ) పోటీలో పాల్గొనగోరేవారు పైన ప్రచురించిన కూపన్‌తో పజిల్‌ను నింపి కవరులో పంపాలి. మరే విధంగా పంపినా ఆ ఎంట్రీ స్వీకరించబడదు.

బి) కవరుపై 'సరిగపదమని' అంటూ నంబర్‌తోసహా పేర్కొనటం మరచిపోకూడదు.

సి) ఏ బహుమతి కైనా ఒకరు కన్నా ఎక్కువగా విజేతలుంటే డ్రా తీయటం జరుగుతుంది.

విజేతల ఎంపిక ప్రతిసారి ఓ సినీ ప్రముఖునిచే...



**అడ్డం:-**

1. '......... చినుకులు పడుతూవుంటే చెలికాడే సరసన ఉంటే' (4)
3. '........ పూవులో మూగకళ్ళ వూసులో' (4)
5. '.........యు తండ్రి ఓ.......యు తండ్రి మానోములన్ని పండినాయి తండ్రి'(2)
7. 'అహ ..... పెళ్ళంట' జంధ్యాల గారి సినిమా (1)
10. 'చిటా పటా చినుకులతో కురిసింది....మెరిసింది జాణా' అక్కచెల్లెలు చిత్రంలోని పాట (2)
11. 'ఎంకొచ్చిందోయ్ ....... ఎదురొచ్చిందోయ్' (2)
12. 'కడవెత్తుకొచ్చింది ......పిల్ల అది కనబడితే చాలు నా గుండె గుల్ల' (2)
13. 'రెండు రెళ్ళు .......' ఇది కొత్త లెక్కకాదు జంధ్యాల గారి సినిమా పేరు (2)
14. '......కే బంగారమాయెరా అందాలరామ' అందాల రాముడు చిత్రంలోని పాట (2)
15. 'చరణ కింకిణులు ఘల్లు ఘల్లుమన కర కంకణములు ..... .....లాడగ' (2)
18. 'మబ్బులు...... భేటీ అయితే మెరుపే వస్తుందీ మనసులు .....పేచీ పెడితే వలపే పుడుతుంది' దేశోద్ధారకుడు సినిమాలోని పాట(2)
19. 'మహా బలి...... భారతీయ కళాజగతికిది గొప్ప గోపురం' (2)
21. '......నుండి భువికి దిగివచ్చె దిగివచ్చె పారిజాతమై నీవై నీవై' తేనెమనసులు చిత్రంలోని పాట (2)
22. '...... ..... తెలుగులా తెల్లవారి వెలుగులా' ప్రేమ్‌నగర్ చిత్రంలోని గీతం (2)
23. 'దులపరబుల్లోడా దుమ్ము దులపర బుల్లోడా చిలిపి.....తో షికార్లుకొట్టే' అంతస్తులు చిత్రంలో భానుమతి పాట(2)

**నిలువు:-**

1. 'సోగ్గాడే ......నాయనా ఒక్క పిట్టనైన కొట్టలేడు సోగ్గాడు' ఆస్తిపరులు చిత్రంలోని పాట (2)
2. '...........సంధ్యారాగం' జంధ్యాల అమెరికాలో తీసిన చిత్రం (4)
3. '....... మీద కోపం నీ ముకానికె అందం' (2)
4. 'ఈనాటి ఈ ...... మేనాటిదో ఏనాడు పెనవేసి ముడివేసెనో' (2)
6. 'ఏమండోయ్ ....... ఓ చిన్నమాట ఏఊరు వెళతారు ఏదీ కాని వేళ' (3)
8. '....... .......పన్నీరు' జంధ్యాల తీసిన సినిమా (2)
9. 'అనగనగా ......రాజు అనగనగా .....రాణి' (2)
11. మహదేవన్‌గారిని ఇలాకూడా పిలుస్తారు (2)
13. 'ఏం ఎందుకని? ఈ సిగ్గెందుకని? ........మగల మధ్యనున్నది ఎవరికి తెలియదని?' (2)
14. 'ముత్యమంత ......... ముఖమెంతో ఛాయ' (3)
15. 'గోదారి ...... గట్టుమీద శెట్టుంది' (3)
16. '..............సీత తీపి గుండె కోత ప్రణయ జీవులకు నీవే భగవద్గీత' (4)
17. మనసుగతి ఇంతే పాట బిగినింగ్(3)
20. 'చెంగావి ........చీర కట్టుకున్న చిన్నది' (2)

**పజిల్, కూపన్ 30-06-2004 లోగా చేరాలి**

**పంపవలసిన అడ్రసు**

'హాసం- హాస్య సంగీత పత్రిక'
502, శ్రీ బాలాజీ నిలయం, 13-1-212,
మోతీనగర్, హైదరాబాద్-500 018.

మొదటి బహుమతి (ఆల్ కరెక్ట్)



రెండవ బహుమతి (ఒక తప్పుతో)



మూడవ బహుమతి (రెండు తప్పులతో)



కన్సొలేషన్ బహుమతి (మూడు తప్పులతో)





# అర్థం చేసుకుందాం ఆస్వాదిద్దాం

| తమిళం | | తెలుగు |
| --- | --- | --- |
| చిత్రం | : మిస్సియమ్మ | మిస్సమ్మ |
| రచన | : తంజై రామయ్యాదాస్ | పింగళి నాగేంద్రరావు |
| సంగీతం | : యస్.రాజేశ్వరరావు | యస్.రాజేశ్వరరావు |
| గానం | : ఎ.ఎం.రాజా | ఎ.ఎం.రాజా |
| అభినయం | : జెమిని గణేష్, సావిత్రి, సారంగపాణి, ఎస్వీ రంగారావు, ఋష్యేంద్రమణి | ఎన్.టి.రామారావు, సావిత్రి, రేలంగి, ఎస్వీ రంగారావు, ఋష్యేంద్రమణి |

**త**ప్పనిసరి అయిన పరిస్థితులలో ఆ నాయకుడూ ఆ నాయికా దంపతులలాగా నటించి ఆ మారుమూల గ్రామంలోని బడిలో ఉపాధ్యాయులుగా ఉద్యోగాలు సంపాదించారు. నాయిక మొదట్లో నాయకుణ్ణి నమ్మలేదు. నాయకుడు ఆమెతో తమది కేవలం 'వ్యాపార సంబంధం' అని అందుకు తగ్గట్టుగా జాగ్రత్తగా ప్రవర్తించేవాడు. అయితే నాయిక తనకు తెలియకుండానే నాయకుణ్ణి ప్రేమించసాగింది. నాయకుడూ ఆమెను ప్రేమించ సాగాడు. అయితే తాను ప్రేమించిన నాయికకు ప్రేమకానుకలు ఇవ్వడానికి ఆ నాయకుడికి ఉన్న కలిమి మనసు ఒక్కటే. కాకుంటే అతను చాలా గడుసువాడు. తన ప్రేమను ప్రకటించడానికి పాట అందుకున్నాడు. తనవన్నీ ఆమెవేనట. ఆమె కావాలంటే అవన్నీ ఇస్తాడట. ఇంతకు తనకున్నవన్నీ ఏమిటి?

'మిస్సమ్మ' చిత్రంలోని ఈ పాటలో నాయకుడు తన ఆస్తిపాస్తుల వివరాలు తెలియజేస్తున్నాడు. పరిశీలించండి.

ఈ నవ నవాభ్యుదయ విశాల సృష్టిలో....
చిత్రములన్నీ నావేలే
కావాలంటే ఇస్తాలే
నా వన్నీ ఇక నీవేలే ॥కావాలంటే॥
ఆ.......ఆ.........ఆ...
తళుకు తళుకుమని తారలు మెరిసే
నీలాకాశము నాదేలే
ఎల్లరి మనముల కలవరపరిచే
జిలిబిలి జాబిలి నాదేలే... ॥కావాలంటే॥
ఆ....ఆ......ఆ.........
ప్రశాంత జగమును హుషారు చేసే
వసంత ఋతువూ నాదేలే
పూవుల ఘుమఘుమలు చల్లగ విసిరే
మలయమారుతము నాదేలే ...... ॥కావాలంటే॥



'మిస్సమ్మ' చిత్రంలోని ఈ పాటను పింగళి రాశారు. రాజేశ్వరరావు సంగీత దర్శకత్వంలో ఎ.ఎం. రాజా ఈ పాట పాడారు. ఈ పాట సన్నివేశంలో నాయికకు నాయకుడి పట్లగల ఆరాధానా భావాన్ని నాయకుడికి ఆమె పట్ల ఉన్న అనురక్తినీ,నాయికా నాయకులుగా నటించిన సావిత్రి,ఎన్.టి.రామారావు ఎంతో లలితంగా ప్రదర్శించారు.

నాయకుడికి ఎవరూ లేరని అతనికి ఉద్యోగం ఎంతో అవసరమని నాయికకు తెలుసు. అయితే ప్రేమోల్లాసంలో ఉన్న నాయకుడు చమత్కారంగా ప్రకృతిసిద్ధమైన తన సంపదల పట్టిక వినిపించాడు... ..సన్నివేశంలోని ప్రేమ మత్తును పాటంతా వినిపించడంలో ఏ.ఎం.రాజా కృతకృత్యుడయ్యాడు. ప్రత్యేకించి 'జిలిబిలి జాబిలి నాదేలే' అనే పంక్తిలో 'జిలిబిలి' అనే పదం పలికిన తీరు ప్రత్యేకమైనది.

'మిస్సమ్మ' చిత్రంలోని సన్నివేశంలో 'మిస్సియమ్మ' తమిళ చిత్రంలోనూ ఉంది. ఆ సన్నివేశంలోని పాట ఇది.

ఇణై ఏదుమిల్లాద విశాల సృష్టి యినిలే
విశిత్తిరంగళెల్లాం ఎనదాగుమే
ఎల్లాం ఉనక్కే తరువేనే
ఇనిమేల్ ఉరిమై నీ దానే ॥ఎల్లాం॥
తళుక్కు తళుక్కెనలే తారగై మిన్నుం
నీల వానగం ఎనదాగుమే
వెణ్ణిలా మాందరుక్కుం
ఇదయల్గం తరుం
కుళిర్న్ద వెణ్ణిలావుం ఎనదాగుమే ॥ఎల్లాం॥
మనోహరమాగ కుదూగలం తరుం
వసంత రుతువుం ఎనదాగుమే
మలరోడు సేర్న్దు విళైయాడియే వరుం
మలయ మారుదముం ఎనదాగుమే ॥ఎల్లాం॥



ఈ తమిళ గీతాన్ని తంజై రామయ్యదాస్ రాశారు. ఎ.ఎం. రాజా గానం చేశారు.

తమిళ గీతం తెలుగు గీతాన్ని అనుసరించింది. కాని తెలుగు పాటలోని సొగసులన్నీ తమిళగీతంలో కనిపించవు.

తమిళగీతంలోని భావాలను పరిశీలిస్తే -తమిళ గీతాన్ని కవిగారు సర్దుబాటు చేసిన వైనం తెలుస్తుంది.

**సాటిలేని విశాలసృష్టిలో**
**విచిత్రాలన్నీ నావేలే (నావవుతాయిలే)**
**అన్నీ నీకే ఇస్తాలే**
**ఇకపై బాధ్యత (అధికారం/ హక్కు)నీవేలే** ॥అన్నీ నీకే॥
**తళుకు తళుకుమని తారక మెరిసే**
**నీలాకాశం నాదేలే**
**జాబిలి మానవులకు**
**హృదయ వేగం కలిగిస్తుంది**
**చల్లని జాబిలీ నాదేలే** ॥అన్నీ నీకే॥
**మనోహరమై కుతూహలం కలిగించే**
**వసంత ఋతువూ నాదేలే**
**పువ్వులతో చేరి ఆటాడుతూ సాగివచ్చే**
**మలయమారుతమూ నాదేలే** ॥అన్నీ నీకే॥

తమిళ చిత్రం తెలుగు నుంచి 'డబ్' చేసింది కాదు. తమిళ చిత్రంలో నాయకుడు జెమిని గణేష్ పాడడం కోసం ప్రత్యేకంగా రాయించిన ఈ పాటలో తమిళంలో అంతగా వాడని సృష్టి, ఋతు వంటి మాటలు పాట రచన త్వరగా కావడానికి తోడ్పడినట్టున్నాయి.

'నా వన్నీ ఇక నీవేలే' అని తెలుగు లో సూటిగా ఉన్న అభిప్రాయం తమిళంలో తికమకగా ఉంది. 'ఇనిమేల్ ఉరిమై నీ దానే' అంటే 'ఇకపై అధికారం నీవేగా' అనీ 'ఇకపై బాధ్యత నీకేగా' అనీ అర్థం చేసుకోవచ్చు. తెలుగులో 'కావాలంటే ఇస్తాలే' అనే పంక్తిలోని చమత్కారం 'ఎల్లాం ఉనక్కే తరువేనే' (అన్నీ నీకే ఇస్తాలే) అనడంలో కనిపించదు. మొత్తం మీద తెలుగు పాటలోని జిలిబిలి తళుకులు తమిళ గీతంలో కనిపించవు!

**- పి.ఎస్.గోపాలకృష్ణ**

# వినుడు వినుడు కలాం గాథ

భారతదేశాధ్యక్షుడు అబ్దుల్ కలాం ఆత్మకథ్ను "వింగ్స్ ఆఫ్ ఫైర్" పేరుతో పుస్తకంగా ప్రచురించిన యూనివర్శిటీ ప్రెస్ ప్రెసిడెంటు మధురెడ్డి ఓ రోజు కలామ్ వద్దకు వచ్చి "మీ పుస్తకాన్ని ఆడియో బుక్‌గా వెలువరిద్దామని ఓ లండన్ కంపెనీ వాళ్లు అడుగుతున్నారు. ఏమంటారు?" అని అడిగాడు.

పుస్తకాన్ని చదవడంలో ఒకరకమైన ఆనందముంటే, ప్రతిభావంతులయిన కళాకారులు వాటిని శబ్దకావ్యాలుగా మారిస్తే వినడంలో మరో రకమైన మజా ఉంది. ముఖ్యంగా పుస్తకాన్ని కాస్త కుదించి, సంగీతం కూడా జోడిస్తారు కాబట్టి ఆ ప్రక్రియ పిల్లలను బాగా ఆకట్టుకుంటుంది. వాల్ట్‌డిస్నీవారు తాము తీసిన బాలలచిత్రాలలో సౌండ్ ఎఫెక్ట్‌లను కూర్చి కాసెట్స్‌గా రిలీజ్ చేసి ఆడియోబుక్స్ అంటే ఇలా ఉండాలి అని నిర్వచించారు. అప్పటినుండీ అదొక ట్రెండ్ అయిపోయింది. పశ్చిమదేశాలలో అనేక మ్యూజిక్ కంపెనీలు పాప్యులర్ పుస్తకాలను ఇలా ఆడియోరూపంలో రిలీజ్ చేసి పేరుప్రఖ్యాతులు,



కరడి టేల్స్ వ్యవస్థాపకులు

డబ్బు మూటకట్టుకున్నాయి. ఈ లండన్ కంపెనీ కూడా వాటిల్లో ఒకటి.

మధురెడ్డి అన్నది విని, "మన ఇండియాలోనే కరడి టేల్స్ కంపెనీవాళ్లున్నారుగా. వాళ్ల నడిగి చూడండి. వాళ్లు కాదంటే చూద్దాం." అన్నారు కలాం. చిన్నపిల్లలంటే అమితప్రేమ కనబరచే కలాంకు విశ్వనాథ్ సోదరులు నడిపే కరడి టేల్స్




కంపెనీగురించి తెలియడంలో ఆశ్చర్యం లేదు. వాళ్లు ఇంగ్లీషు, తమిళం, హిందీ 37 రకాల ఆడియోబుక్స్ తయారుచేసి 5 లక్షల కాసెట్స్, సిడిలు అమ్మారు. గిరీష్ కర్నాడ్, నసీరుద్దీన్ షా, నందితా దాస్, సయీద్ జాఫ్రీ, గుల్జార్, ఎస్పీ బాలు, వంటివారిచే పుస్తకాలను చదివించి తామే 'త్రీ బ్రదర్స్ అండ్ ఎ వయొలిన్' పేర సంగీతాన్ని సమకూర్చారు.

అవును, కరడి టేల్స్ స్థాపించిన ముగ్గురు సోదరులూ విద్యావంతులే, శాస్త్రీయసంగీతం పాడగలిగేవారే! విశ్వనాథ్ మృదంగంలో నిపుణుడు కాగా ఘటంలో ప్రవీణుడయిన నారాయణ్ ఐఐటి చదివి అమెరికన్ యూనివర్సిటీలో పోస్టుగ్రాడ్యుయేషన్ చేశాడు. ఇంజనీరింగు, ఐఐఎమ్‌లో ఎమ్‌బిఏ చేసిన శ్రీరామ్ వయొలిన్ విద్వాంసుడు.

కలాం సలహామేరకు మధురెడ్డి కరడి టేల్స్ కంపెనీవారిని కదలేయగానే వారు ఎగిరి గంతేశారు. 8 నెలలపాటు శ్రమించి పుస్తకాన్ని 75 ని॥లకు కుదించారు. ఒక బీద కుటుంబంలో పుట్టి శ్రమతో, శ్రద్ధతో శాస్త్రజ్ఞుడిగా ఎదిగి దేశంలో ప్రథమపౌరుడిగా మారిన కలాం జీవితంలో నాటకీయ ఘట్టాలకు కొదవలేదు. అందునా గిరీష్ కర్నాడ్ వంటి అద్భుత నటుడి కంఠంలో ఆ నాటకీయత మరింత పండింది.

పైగా సందర్భానుకూలంగా పాటలు, కీర్తనలు మిళితం చేశారు. కలాం తన ఉపాధ్యాయుల గురించి చెబు తున్నప్పుడు గురునానక్ గురువాణి వినిపిస్తుంది. కలాంకు 'నాసా'లో ఉద్యోగం వచ్చినప్పుడు ఆయన తండ్రి దైవాన్ని ప్రార్థించే సమయంలో శంకర్ మహాదేవన్ పాడిన అమీర్ ఖుస్రో గేయం 'ఔలియా తేరే దామన్ లగీ..' వినబడుతుంది. **కలాం బంధువులు మరణించినపుడు బాంబే జయశ్రీ పాడిన అన్నమయ్య కీర్తన వినబడుతుంది.**

ఇంత ఘనంగా తయారయిన సిడి ఇవ్పటివరకు 20,000 కాపీలు అమ్ముడుపోవడంలో ఆశ్చర్యమేముంది? దీని గురించి విశ్వనాథ్ బ్రదర్స్ మొదట్లో ప్రస్తావించినపుడు కలాం "ఈ టాకింగ్‌బుక్ ఎవరైనా కొంటారంటారా?" అని అనుమానం వెలిబుచ్చారట. సిడి తయారయ్యాక మధురెడ్డితో "ఇప్పుడు నీ రీడింగ్‌బుక్ ఎవరైనా కొంటారంటావా?" అన్నారట!

గుల్జార్ సహాయంతో దీని హిందీ వెర్షన్ తయారవుతోంది. **గోవా ప్రభుత్వం కరడి టేల్స్ వారి ఆడియోబుక్స్ కొని రాష్ట్రంలోని కొంకణిమీడియం స్కూళ్లలో పంచుతోంది. మన రాష్ట్రప్రభుత్వం కూడా ఆ దిశగా సాగి స్ఫూర్తిదాయకమైన ఈ సిడిని పిల్లలకు వినిపింపజేస్తే బాగుంటుంది.**

**- కమ్యూనికేటర్ ఫీచర్స్**



జంతువులు మనగురించి మాట్లాడేది తెలిసిపోతే ఎంత తమాషాగా ఉంటుందో వివరించే...

బాల్యపు లేతదనం మళ్ళీ కోరుకునే పెద్దలకు మరీ మరీ ప్రత్యేకం



పిల్లల కోసం ప్రత్యేకం...

# డాక్టర్ డూలిటిల్



నవలీకరణ **ఎమ్బీయస్ ప్రసాద్**

చిత్ర పరిచయం 7

సమన్వయం **మంజీర**

**జరిగిన కథ**

జాన్ డూలిటిల్ చిన్నప్పుడు జంతువులభాష అర్థం చేసుకునేవాడు. క్రమేపీ ఆ శక్తి పోయింది. పెరిగి డాక్టరయ్యాక ఓ రోజు హఠాత్తుగా ఆ శక్తి తిరిగివచ్చింది. దానితో ఖంగారుపడ్డాడు. భార్యతో సహా ఎవరికీ చెప్పలేదు. బ్రెయిన్ స్కాన్ చేయించుకున్నాడు. డాక్టరు ప్రాబ్లెమ్ ఏదీ లేదన్నాడు. ఫామ్‌హౌస్‌లో ఓ గుడ్లగూబ వచ్చి రెక్కలో గుచ్చుకున్న పుల్లముక్క తీయించేసుకుంది. ఇతను చేసిన ఉపకారాన్ని సిటీకొచ్చి పదిమందికీ చెప్పడంతో ఓ రోజు రాత్రి నానారకాల జంతువులూ ఇతని ఇంటిమీదకు వచ్చి వైద్యం చేయించుకున్నాయి. ఓ రోజు కోతి అభ్యర్థన మేరకు ఓ పులిని ఆత్మహత్యాప్రయత్నం నుండి మాన్పించాడు. పులి తలకాయనొప్పి తగ్గించడమెలా అని ఓ పశువుల డాక్టరునడిగాడు. - ఇక చదవండి

"అంటే టిక్కెట్టు కోసేయడం. ఓ జంతువువిషయంలో అంతకంటె ఏం చేయగలం?"అన్నాడా ఫేమస్ డాక్టర్.

కాస్సేపటికి జాన్ సర్కసులో పులిబోను వద్ద ఉన్నాడు. దానికి హామీలు కురిపిస్తున్నాడు - "ఎలా చేస్తానో తెలియదు కానీ, నీ సమస్య తీరుస్తాను. ఇదే నా ప్రతిజ్ఞ"అంటున్నాడు.



"చేసేదేదో త్వరగా చేయి డాక్టర్, ప్రతీ నిమిషం నేను వంృత౦ంౖవం ఖ చేరువవుతున్నాను. నువ్వు ఫెయిలయితే ఈ ఊచలకు నేను ఉరేనుకోవడం ఖాయం." అంది పులి. అంది కానీ కాస్త ఆలోచించి, "వీటికి ఉరేనుకోవడం కష్టమే అనుకో." అంది.

* * *

మార్క్‌కు జాన్ భార్యనుండి ఫోన్ వచ్చింది. "మా ఆయన ఎక్కడున్నా పిలవండి. ఇక్కడ పరిస్థితి చూస్తే మతిపోతోంది." అని అరుస్తోంది. అవును మరి, నానారకాలు జంతువులు కిచెన్‌లో చేరి గిన్నెలతో ఆడుకుంటున్నాయి.

కథానాయకుడు జాన్‌కి ఇవన్నీ తెలియవు. ఓ అపార్ట్‌మెంటు పక్కగా నడిచి వెళుతున్నాడు. చెత్తడబ్బాలోంచి ఓ ఆర్తనాదం వినిపించింది. "డాక్టర్, డాక్టర్ కాస్త చూడాలి. మా స్నేహితుడి ప్రాణం పోయింది. వచ్చి కాపాడు." అంది ఎలుక జంటలో ఓ ఎలుక. స్నేహితుడి మాటలకు వత్తాసు పలకడానికి చచ్చినట్టు పడున్న ఎలుక కడుపుపట్టుకుని గాఢంగా మూలిగింది. ఎక్కడ చూచినా ప్రత్యక్షమయి కయ్యానికి కాలుదువ్వే



ఎలుకలజంట అంటే మండిపడే జాన్ వెక్కిరింతగా చూసి "మూలుగుతున్నాడుగా అంటే బతికివున్నట్టే లెక్క" అనేసి వెళ్లిపోబోయాడు.

"ఏయ్, ఏయ్, అలా వెళ్లిపోతావేమిటి సాయం చేయకుండా" ఎలుక విసుక్కుపోయింది.

"సాయం చెయ్యాలా, మా నాయనే, ఎందుకో.." అన్నాడు జాన్ ఒళ్లు మండుతూండగా.

"ఎందుకంటే.. ఎందు కంటే.. నువ్వు మనిషివి కనకా, అందునా హృదయమున్న మనిషివి కనుక"

"నేను మనిషినని ఇవాళ గుర్తుకొచ్చిందా? మొన్నటికి మొన్న నువ్వు మనిషిని కావు, దున్నపోతువని అనలేదు, నాలుగురోజుల క్రితం.."ఎలుకల జంట తిట్టిన తిట్లను గుర్తు చేసుకోబోయాడు జాన్.



"భలే వాడివే అవన్నీ జోక్స్, సరసమాడామన్నమాట. నువ్వు సీరియస్‌గా తీసుకున్నావే!" అంటూ నవ్వు తెచ్చుకోబోయింది ఎలుక.

'భలేవాడివే' అంటూ

ఎలుకమాటలను వెక్కిరించబోయాడు జాన్. అంతలోనే "ఇహలోకమా, ఇహ గుడ్‌బై, పరలోకమా.."అని జబ్బుపడ్డ ఎలుక వీడ్కోలు గీతానికి గొంతు సవరించుకోవడం చూసి ఫ్రెండు ఎలుక కంగారుపడింది. "డాక్టర్, నువ్వు తలచుకుంటే అతనికి ప్రాణదానం చేయగలవ్. మేమన్న మాటలు, కూతలు మర్చిపో. ప్లీజ్. కాపాడు" అని ఏడ్చింది. జాన్ మనసు కరిగింది.

ఓ పేపరు బ్యాగ్‌లో ఎలకలను వేసుకుని జాన్ హాస్పిటల్‌లో ప్రవేశిస్తూండగానే మార్క్ ఎదురయ్యాడు. "ఎక్కడకి పోయావయ్యా బాబూ" అంటూ విసుక్కున్నాడు.

"ఏం? ఏమయింది?"

"ఏమవ్వడమేమిటి? మీటింగు ఉందన్నానుగా."



"ఓ మీటింగా?" జాన్‌కి గుర్తు వచ్చింది. కానీ అది ఎగ్గొట్టినందుకు బాధపడలేదు. "సారీ, ఓ ఎమర్జన్సీ కేసు వచ్చిపడింది." అంటూ ఆపరేషన్ థియేటరులోకి వెళ్లి అతని మొహం మీదే తలుపేసేశాడు.

మార్క్ భగభగలాడిపోయేడు. 'సారీ అట సారీ, నిన్ను క్షమించడమా?' అంటూ పళ్లు నూరుకున్నాడు.

లోపల కాగితం పొట్లంలోంచి ఎలుకలను బయటకు తీశాడు జాన్ . 'బ్రదర్, నువ్వు కాస్త పక్కగా నిలబడు, ఇతని సంగతి చూద్దాం' అని రోగిష్టిఎలుక పొట్ట నొక్కి చూడసాగాడు.

"అతను చచ్చిపోతే నా గతేం కాను, నాకేం చేయాలో పాలుపోవడం లేదు." అంది పక్కగా నిలబడ్డ ఎలుక.

"నేను చచ్చిపోతే నా శవాన్ని పక్కకు ఈడ్చుకెళ్లి తినేసేయి మిత్రమా" అంది మరణశయ్యపై నున్న త్యాగమూర్తి.

"అదీ నీపై గౌరవంతోనే సుమా" అందీ ఎలుక!



"ఇదిగో మీరీ త్యాగాల డైలాగులు ఆపకపోతే నా ఆపరేషన్ సాగదు" అని జాన్ కసురుకుంటూండగానే జాన్ భార్య లీసా, జీన్, మార్క్‌లను వెంటబెట్టుకుని తలుపు తోసుకుని లోపలకు వచ్చేసింది. తన భర్త ఎలుకలతో మాట్లాడుతూండడం చూసి విస్తుపోతూ నిలబడింది.

జాన్ తలెత్తి చూశాడు. "కడుపునొప్పి అంటున్నాడు" అన్నాడు లీసాతో.

"..డు..? ఎవరు?" కళ్లు పెద్దవి చేస్తూ భార్య అడిగింది.

"ఇంకెవరు? ఈ ఎలకే! ఎమర్జన్సీ కాకపోతే నేను కేసు తీసుకునేవాణ్నా? కావాలంటే నువ్వే చూడు" అని ఉదారంగా ఆఫర్ ఇచ్చాడు. కానీ లీసా మొహం అదోలా పెట్టింది.

తన ఆరోగ్యం గురించి జాన్ భార్యతో చర్చిస్తూండగానే ఒక్క పెడబొబ్బ పెట్టి ఎలుక తలవాల్చేసింది.

## చిత్ర విశేషాలు

డా॥ డూలిటిల్‌కు దర్శకత్వం వహించినది బెట్టీ థామస్ 6'1" పొడుగున్న ధీరవనిత. 1948లో మిస్సోరీలో పుట్టిన ఈమె ఓహైయో యూనివర్సిటీ నుండి ఫైన్ ఆర్ట్స్‌లో డిగ్రీ తీసుకుని షికాగో పబ్లిక్ స్కూలులో పాఠాలు చెప్పబోయింది. కానీ సమాజం గురించి, సెక్సుగురించి తన అభిప్రాయాలు నిర్భయంగా వెల్లడించే ఈమె తరహా స్కూలు యాజమాన్యానికి మింగుడు పడలేదు.



తన అభిప్రాయ వ్యక్తీకరణకు కళారంగమే, అందునా హాస్యరసమే తగినదని నిశ్చయించుకున్న బెట్టీ సెకండ్ సిటీ ట్రూప్‌లో చేరి హాస్యనటీమణిగా పేరు తెచ్చుకుంది. 'టన్నెల్ విజన్' (1975), 'చెస్టీ యాండర్సన్ యుఎస్ఎన్' (1976) సినిమాలలో చిన్నపాత్రలు వేసింది. 1976 నుండి టెలివిజన్‌లో, ముఖ్యంగా 'ఫన్ ఫ్యాక్టరీ' అనే వెరయిటీ ప్రోగ్రాంద్వారా, మంచిపేరు తెచ్చుకుంది. 1981-87ల మధ్య నడిచిన 'హిల్ స్ట్రీట్ బ్లూస్' లో లేడీ పోలీసు ఆఫీసరుగా నటించి 1985లో ఎమ్మీ అవార్డు గెలుచుకుంది. 'హోమ్‌వర్క్'(1982), 'వెన్ యువర్ లవర్ లీవ్స్' (1983) 'నో గ్రేటర్ గిఫ్ట్'(1986), 'ట్రూప్ బెవర్లీ హిల్స్' (1989) సినిమాలలో మంచి వేషాలే వచ్చాయి. ఈ లోగా టీవీ సినిమాల డైరక్షన్ కూడా మొదలుపెట్టింది.

'ఓన్లీ యూ'(1991) రొమాంటిక్ కామెడీతో బాటు బ్రెస్ట్ క్యాన్సర్ బాధితురాలి గురించి 'మై బ్రెస్ట్' (1994) డైరక్టు చేసింది. ఆమె 'డ్రీమ్ ఆన్' సిట్‌కామ్‌కు ఎమ్మీ ఎవార్డు వచ్చింది. టీవీకై తీసిన చేసిన 'బ్రాడీ బంచ్ మూవీ'ను పెద్దతెరకై మళ్లీ తీసి అదీ హిట్ చేసింది. 'ప్రైవేట్ పార్ట్స్'(1997) అనే కామెడీ డైరక్టు చేశాక 'డా॥డూలిటిల్' (1998) ఛాన్సు వచ్చింది. ఇది హిట్ అయినా ఈ సినిమా రెండవ భాగానికి ఈమెను వద్దని స్టీవ్ కార్‌ను దర్శకుడిగా పెట్టుకున్నారు. ఈమె '28 డేస్' (2000) అనే కామెడీ తీశాక 2002 లో 'ఐ స్పై' అనే సినిమాకు దర్శకత్వం వహిస్తూ నిర్మించింది కూడా. డా॥డూలిటిల్‌లో వేసిన ఎడ్డీమర్ఫీనే తన స్వంత సినిమాలో హీరోగా పెట్టుకుంది.

"ఏమయింది డాక్టర్?" ఆదుర్దాగా అడిగింది ప్రేక్షక ఎలుక.

"గుండె ఆగిపోయినట్టుంది. ఇదిగో పల్స్ కూడా అందటం లేదు. ఇదిగో మార్క్, ఎలక్ట్రిక్ షాక్ ఇస్తే గుండె మళ్లీ ఆడుతుందంటావా?" అడిగాడు జాన్.

అయోమయంగా చూస్తున్న మార్క్ "ఏ..ఏమో.." అన్నాడు.

జాన్‌కి హఠాత్తుగా ఏం చేయాలో తట్టింది. ఎలుక నోరు తెరిచి తన నోటితో గాలి ఊదడం మొదలుపెట్టాడు. అక్కడున్న అందరూ వాంతి చేసుకోబోయారు. భార్య అయితే మరీనూ "జాన్ డియర్, నో, నో" అని అరిచింది. కానీ జాన్ వినిపించుకుంటేనా? "హనీ, నేనిక్కడ ఒకడి ప్రాణం కాపాడుతున్నాను. నువ్వలా మొహం పెట్టకు. కావాలంటే వెళ్లిపో." అని చెప్పేసి మళ్లీ ఎలుక నోట్లో నోరు పెట్టి ఊదాడు. "యాక్ డాక్టర్" అని పక్కనున్న ఎలుక కూడా మొహం తిప్పుకున్నా జాన్ తన ప్రయత్నాలు మానలేదు.



చివరికి ఎలుక పొట్టలోంచి గ్యాస్ బయటకు పోయింది. హమ్మయ్య అంటూ లేచి కూచుంది. లేస్తూనే 'ఆకలేస్తోంది' అంది. జాన్ పొంగిపోయాడు. లీసా కేసి చూసి 'నే చెప్పలే, గ్యాస్ అని' అన్నాడు విజయగర్వంతో.

అన్నాడే కానీ తన భార్య, కొలీగ్స్ తన గురించి ఏమనుకుంటున్నారో వాళ్ల మొహాల మీదనే స్పష్టంగా చదివి కొయ్యబారిపోయాడు. ఎలుకల పొట్టలో గ్యాసు వర్రీ అయ్యేవాణ్ని పిచ్చివాడను కోవడంలో వాళ్ల తప్పేముంది? మీరైనా, నేనైనా చేసేదదే! అందుకనే వాళ్లు అతన్ని మెంటల్ డాక్టరు దగ్గరకి మెడికల్ ఎగ్జామినేషన్‌కు పంపారు.

* * *

సైకియాట్రిస్టు అప్పటిదాకా చదివిన జాన్ కేస్ హిస్టరీ కాగితాలు టేబుల్ మీద పడేశాడు - "డాక్టర్ జాన్ డూలిటిల్! డాక్టరు పరీక్షల్లో యూనివర్సిటీ ఫస్టు! ఇవాళ పిచ్చాసుపత్రిలో! ఇలా జరుగుతుందని ఎవరూహించగలరు? అల్లాటప్పా డాక్టరు కాదు, యూనివర్సిటీ ఫస్ట్! నో, నో..నాకేం అసూయలేదు. ర్యాంకులంటూ పెట్టాక ఎవడో ఒకడు ఫస్టురాక తప్పదు..."

"....ఎవడో ఒకడు లాస్ట్ రాకతప్పదు" అన్నాడు జాన్ కసిగా.



"..సో, డాక్టర్ జాన్.., ది గ్రేట్ డాక్టర్ హూ టాక్స్ టూ ఏనిమల్స్! అవును డాక్టర్ జంతువులతో ఏం కబుర్లు చెప్తావో కాస్త చెబుదూ" అని వెక్కిరిస్తూ"అవునూ నాకు చెబుతావా? లేక మా ఫ్రెండుకి చెబుతావా?" అని అడిగాడు ఒళ్లో ఉన్న పిల్లిపిల్లను చూపించి.

జాన్ పిల్లిపిల్ల కేసి చూసి "నీతో మాట్లాడడానికి నాకే అభ్యంతరమూ లేదు" అన్నాడు.

పిచ్చి డాక్టరు జాన్ కేసి హేళనగా చూసి "నీతో ఊసుపోసు కబుర్లు చెప్పడానికి అది సిద్ధంగా ఉందని ఎందుకనుకుంటున్నావ్?" అన్నాడు.

"ఉందేమో నీకేం తెలుసు" అన్నాడు జాన్ ఏ మాత్రం తగ్గకుండా.

"అలాగా!..అయితే నా గురించి ఏమనుకుంటోందో అడిగి చూడు" అన్నాడు డాక్టరు నవ్వాపుకుంటూ.

"ఒఠ్ఠి మొద్దు రాచ్చిప్ప అనుకుంటున్నానని చెప్పు." అంది పిల్లి.

జాన్‌కి ఫక్కున నవ్వు వచ్చింది. "మీ పిల్లికి మంచి పరిశీలనాశక్తి ఉంది." అని మెచ్చుకున్నాడు.

దీనివల్ల జరిగిందేమిటయ్యా అంటే పని ఒత్తిడివల్ల డాక్టర్ జాన్‌కు మతి కాస్త చలించిందని, పదిరోజులపాటు ఏ పనీ చేయకుండా రిట్రీట్ హోమ్‌లో విశ్రాంతి తీసుకుంటే బాగుపడతాడని డాక్టరు గారు తన అభిప్రాయం చెప్పాడు.

జాన్ హోమ్‌లో చేర్చడానికి వచ్చి లీసా కళ్లనీళ్లు పెట్టుకుంది. "నేను ఇక్కడ ఉండవలసిన అవసరం ఉందంటావా?" అడిగాడు జాన్ దీనంగా.

"అవును మరి, నువ్వు జంతువులతో మాట్లాడగలవని చెప్పుకుంటున్నావు"

"నిజంగా మాట్లాడగలను కాబట్టే చెప్పుకుంటున్నాను."

అబద్ధాలు చెప్పే పిల్లలను చూసి జాలిపడే తల్లిలా లీసా అతని నుదురు ముద్దాడి వెళ్లిపోబోయింది.

"నే చెప్పేది నువ్వు నమ్మాలి" అన్నాడు జాన్.

"సారీ, నాకు నమ్మకం కుదరటం లేదు." అంది లీసా కళ్లు తుడుచుకుని వెళ్లడానికి ఉద్యుక్తురాలవుతూ.

- (సశేషం)



# హిందీ సినిమాల్లో పక్షిగీతాలు

హిందీసినిమా పాటల్లో 'పంఛీ'కి ఓ ప్రత్యేకస్థానం ఉంది. అంటే కోకిల గానం గురించిన పాటలనుకునేరు. అవి పక్కన పెట్టి చూసినా పల్లవులలో పక్షిగురించి ఉన్న పాటలే అనేకం కనబడతాయి. సైగల్ 'పంఛీ కాహే హోతే ఉదాస్..'(ఎందుకింత ఉదాసీనత, ఓ పక్షీ) అని ఓదార్పు పాట పాడితే, దేశభక్తి ప్రకటించడానికి 'సికందర్-ఏ-ఆజమ్'లో పక్షులను, అవి వాలే కొమ్మలను ఉపయోగించుకున్నారు - 'జహా డాల్ డాల్ పర్ సోనేకీ చిడియా కర్‌తీహై బసేరా..' (కొమ్మకొమ్మపై బంగరుపక్షులు వాలే భారతదేశమే నాది) అంటూ.

చాలామంది స్వేచ్ఛకు ప్రతీకగా పక్షిని చూపారు. 'చోరీచోరీ'లో తండ్రి బంధనాలలోంచి తప్పించుకుని పారిపోయి వచ్చిన నర్గీస్ పాడే


'చోరీ-చోరీ'

పాట - 'పంఛీ బనూ ఉడ్‌తీ ఫిరూ మస్త్ గగన్ మే, ఆజ్ మై ఆజాద్ హూ దునియాకి చమన్ సే' (పక్షి నవుతా, లోకమనే తోటను వదలి ఆకసంలో హాయిగా విహరిస్తా). 'మేరే మన్ కా బావ్‌రా పంఛీ క్యూం బార్ బార్ డోలే..' అని లతా 'అమర్‌దీప్'లో ఆశ్చర్యపడితే రఫీ 'ఆజ్ ఉడ్‌తా హువా ఎక్ పంఛీ జిందగీ కే బహారోం మే ఆయా..' అని 'గెహరా దాగ్'లోనూ 'దిల్ మేరా ఏక్ ఆస్ కా పంఛీ' అని 'ఆస్ కా పంఛీ'లోనూ ఆనందపడతాడు. ఇవాళ మనసు పక్షిలాగ మారి సముద్రాలు దాటి వెళ్ళిపోయింది అంటూ 'ఉడ్‌చలా పంఛీ బన్‌కే మన్ మేరా సాగర్ కే పార్..'(లఫంగే) సాగితే 'ఆజా పంఛీ అకేలా హై, ఓ సోజా నిందియా కీ బేలా హై' 'నౌదో గ్యారహ్'లో మరో జంట వాపోయింది.

పక్షి అంటే హాయిగా పాటలు పాడుకుంటూ విహరిస్తుందనే మన భావన. 'పంఛీ బన్ మై పియా పియా గానే లగా' అని 'బాబుల్'లో ఓ పాట. 'బన్‌కె పంఛీ గాయే ప్యార్ కా తరానా , మిల్ జాయే అగర్ ఆజ్ కోయీ సాథీ మస్తానా..' (పక్షినై ప్రేమగీతాలు పాడతా, ఎవరైనా సరదాకుర్రాడు తోడు దొరకుతాడేమో) అని సైకిళ్లెక్కి కాలేజీ అమ్మాయిలు హాయిగా పాడతారు 'అనాడీ'లో. పాటలు పాడడానికి అర్థం తీస్తాడు ముకేష్ 'ప్యాసే పంఛీ'లో - 'ప్యాసే పంఛీ నీల్ గగన్ మే గీత్ మిలన్ కే గాయే' అని. అలా పాటలు పాడితే ప్రేమికులకు ఇబ్బంది కాబట్టి ఎగిరిపోవే తల్లీ అని పాడతారు ఓ ప్రేమజంట, 'హరే కాంచ్ కీ చూడియా' లో - 'పంఛీ రే ఓ పంఛీ, ఉడ్‌జారే ఓ పంచీ, మత్ ఛేడ్ తూ తరానే, హోజాయేనా దోదిల్ దీవానే' (పాటలు పాడకు, రెండు హృదయాలను పిచ్చెక్కించకు, ఎగిరిపోవే పక్షీ) అని.

పక్షిలా గాలిలో ఎగరడమంటే అందరికీ సరదానే, దాన్ని ప్రేమకు ముడిపెట్టి 'బారిష్'లో - 'కెహ్‌తే హై ప్యార్ కిస్‌కో పంఛీ జరా బతాదే ఉడ్‌నా ఖులీ హవామే ఓ బేజుబాన్ సిఖా దే..' ప్రేమ అంటే గాలిలో విహరించడమంటారు, ఆ ఫీలింగెలాటిదో నువ్వే చెప్పాలి మరి అని లతా, చితల్కర్ పాడారు. రెక్కలుంటే బాగుండును అని మనందరికీ అనిపిస్తుంది. నాకే రెక్కలుంటే నిర్దయుడైన ఓ ప్రియుడా, ఎగిరివచ్చి గాయపడిన నా హృదయాన్ని చూపించేదాన్ని అంటుంది కథానాయిక 'పంఖ్ హోతే తో ఉడ్ ఆతీ రే రసియా ఓ జాలిమా, తుఝే దిల్ కా దాగ్ దిఖ్‌లాతీ రే..'(సెహ్‌రా) పాటలో.

పట్టరాని దుఖం కలిగినప్పుడు ఎక్కడికో వెళ్లిపోవాలనిపిస్తుంది మనకు. దాన్నే పక్షిమీద పెట్టి చెప్పడం జరుగుతూంటుంది. 'చల్ ఉడ్ జారే పంఛీ, అబ్ యే దేశ్ హువా బేగానా..' (పక్షీ, ఎగిరిపో, ఈ దేశం నీకు పరాయిదయిపోయింది) అనే 'భాభీ' పాట తెలుగులోకి వచ్చేసరికి 'వయసించే ఓ చిలుకా, ఎగిరిపో, పాడయిపోయెను గూడు' అయింది. కానీ హిందీ వాళ్లు గూడుతో సరిపెట్టలేదు. దేశాన్నే తప్పుపట్టారు. 'జారే జారే ఉడ్ జారే పంఛీ బహారోంకీ దేశ్ జాయే..'లో హాయిగా వసంతాలు విరిసే దేశానికి వెళ్లిపోమని లతా 'మాయా'లో ఉద్బోధించింది. పక్షి జీవితంలోని హాయిని చెప్పాడు జావేద్ అఖ్తర్. పక్షిని, నదిని, గాలితెమ్మెరను ఆపే సరిహద్దులు లేవన్నాడు - 'పంఛీ, నదియా, పవన్ కే ఝోంకే - కోయీ


'రెఫ్యూజీ'

సర్‌హద్ నహీ న ఇన్హే రోకే'(రిఫ్యూజీ). అలా వెళ్లిపోలేని పక్షిగురించి ప్రదీప్ జాలిపడ్డాడు 'నాగ్‌మణి'లో - 'పింజ్‌రే కే పంఛీ రే - తేరా దర్ద్ న జానే కోయీ..'(పంజరంలోని ఓ పక్షీ, నీ బాధెవరికి తెలుసు?) అని.

పావురాలను ప్రేమసందేశాలకు వాడుకున్న పాటలు, పంజరంలో ఉన్న చిలకకు తన మనోభావాలు వెల్లడించిన పాటలు కోకొల్లలు. కానీ పంజరాలలో ఉన్న మనుష్యులు,


'బందినీ'

అంటే జైల్లో ఖైదీలుగా ఉన్నవారు స్వేచ్ఛగా తిరిగే పిట్టతో ఊసులాడిన పాటలు అరుదు. అలాటి అరుదైన పాట- 'ఓ పంఛీ ప్యారే, సాంఝ్ సఖారే, బోలీ తూ కౌన్ సీ బోలీ బతా రే..'! పక్షిపాటల గురించి ఆలోచించినప్పుడల్లా 'బందినీ'లోని ఈ పాట గుర్తుకురాక మానదు.

\- కమ్యూనికేటర్ ఫీచర్స్

# లలిత సంగీతం



ప్రముఖ గాయకుడు, స్వరకర్త
లలిత సంగీత విద్వాంసుడు,
వాగ్గేయకారుడు

**ఎం.చిత్తరంజన్**

సమర్పిస్తున్న శీర్షిక ఇది.
ఫోన్ నెం. 040-27402993

## ఓ కళాసుందరి

సాకి
ఓ కళాసుందరి.......ఓ మధుర గాయని
ఈ ఎడద వీణపై ....తీయకే నీచేయి

ప॥ ఓ కళాసుందరి ఓ మధురగాయని
ఈ ఎడద వీణపై తీయకే నీ చేయి ॥ఓ కళాసుందరి॥

చ॥ మునివేళ్ళస్పృశియింప మూర్ఛనలు పోయావు
అంగుళుల సవరింప అమృత మొలికించావు ॥ఓ కళాసుందరి॥

చ॥ నీ గళస్వరముతో నిరతమ్ము శృతికలిపి
ఎగసిపోయెడి వీణ ఎరుగదే తను తాను ॥ఓ కళాసుందరి॥

చ॥ నిండు హృదయముతోడ నీవు కేలుంచావు
వెలిలేని తుదిలేని వేదనలు పోయావు ॥ఓ కళాసుందరి॥





| | | |
|---|---|---|
| రచన | : | కీ॥శే॥ కందుకూరి రామభద్రరావు |
| గానం,సంగీతం | : | జి.వి. ప్రభాకర్ |
| రాగం | : | కల్యాణి- 65వ మేళకర్త కల్యాణ్(హిందుస్తాని సం॥) |
| తాళం | : | ఖండ చాపు (కర్ణాటక సం॥) ఝప్ తాల్ (హిందుస్తాని సం॥) |
| ఆరోహణ | : | సరిగమపదనిస |
| అవరోహణ | : | సనిదపమగరిస |

- షడ్జము, చతుశృతిరిషభం,అంతరగాంధారం, ప్రతిమధ్యమం, పంచమం,చతుశృతిదైవతం, కాకలినిషాదం యీ రాగంలోని స్వరాలు.

కల్యాణిరాగం కర్ణాటక,హిందుస్తాని, లలిత సంగీతాలలోను కూడా అమిత ప్రాచుర్యాన్ని పొందిన రాగం. 65వ మేళకర్త మేచకల్యాణిగా కర్ణాటక సంగీతంలోను,కల్యాణ్ థాట్‌గా హిందుస్తాని లోను పిలువబడుతున్నది. దీనినే యమన్ అని కూడా అంటారు. లలిత సంగీతంలో మాత్రం యమన్ అంటూ శుద్ధమధ్యమాన్ని కూడా మిశ్రమం చేసి బాణీలు కూర్చడం ఆనవాయితీగా వస్తున్నది. ఈ విషయాలన్నిటినీ కూలంకషంగా 16-30 నవంబర్ 2002, 16-31 జూలై 2002 'హాసం'సంచికలలో ప్రస్తావించాను.

"సంగీతమపిసాహిత్యం సరస్వత్యాః స్తన ద్వయం" అన్న ఆర్యోక్తి అందరికీ తెలిసినదే. ఆ కళామతల్లి తన చేత ధరించిన పవిత్ర వీణా వాద్యము పేరు "కచ్ఛపి" అనాదిగా ఆ వాయిద్యాన్ని అభ్యసించి నిష్ణాతులైన మహావిద్వాంసులు ఎంతోమంది ప్రజల హృదయాలలో సుస్థిర స్థానాన్ని సంపాదించుకున్నారు. తుమరాడ సంగమేశ్వర శాస్త్రి, ఈమని అచ్యుత శాస్త్రి, ఈమని శంకరశాస్త్రి, వాసాకృష్ణమూర్తి, చిట్టిబాబు మొదలగు వైణిక శిఖామణులు ఆంధ్రదేశానికి ఎనలేని కీర్తిని గడించి పెట్టారు. సంగీతంలో వీణకున్న వైశిష్ట్యాన్ని ఆ వాద్యప్రవీణులు చాటగా, సాహిత్యంలో కూడా చాలామంది కవులు, కవయిత్రులు, తత్త్వవేత్తలు వీణప్రాశస్త్యాన్ని తమ గేయాలలో వర్ణించారు. శివాంశసంభూతుడుగా పరిగణించబడే బసవేశ్వరుడు క్రీ.శ.1140 ప్రాంతంవాడు. ఆయన ప్రబోధించిన "బసవేశ్వర ప్రవచనాలను" ఆచార్య ముదిగొండ శివప్రసాదు గారు తెలుగులోకి గీతాలుగా అనువదించారు. వాటిలో కొన్నిటిని నేను స్వరపరచి పాడగా 1978లో'బసవేశ్వర జయంతి'సందర్భంగా ఆకాశవాణిహైదరాబాద్ కేంద్రం ప్రసారం చేసింది.

"స్వామి! కూడల సంగమదేవా!
కొనుమిదెవల్లకి
నేనే వీణను నాతల ముఖమగు
నా నరములు వీణా మృదుతంత్రులు
నా కరమది మ్రోగించు కమానుగ
నాలోముప్పది రెండు రాగములు
నేనే నాదముగా వేదముగా
నీకై మ్రోగుచునిలిచితి తండ్రీ!"

అంటూ తన శరీరాన్నే (మానవ శరీరాన్నే) వీణకు సంకేతంగా చేసి పరమేశ్వరుని యెడ ప్రసన్నుడై తన భక్తిని నివేదించుకున్నాడు బసవేశ్వరుడు.

మానవహృదయాన్ని, జీవితాన్ని వీణగా మలచుకొని చాలామంది కవులు,కవయిత్రులు రచించిన గీతాలెన్నో వున్నాయి. "ఈ జీవితపువీణ నీవె పలికింపుమా-నిలువు నిలువున కరగువలపు పాటై విరియ" (ఇంద్రగంటి హనుమచ్ఛాస్త్రి), 'పలికిస్తివయ్య నీ బంగారు వీణ-మీటిస్తివా వెలుగు వేళవించిన తంత్రి' అంటూ సంగమేశ్వరశాస్త్రి వీణాగానానికి ముగ్ధుడై అడవి బాపిరాజుగారు రచించిన గేయం (నేను ఆకాశవాణిలో పాలగుమ్మి వారి సంగీత సారథ్యంలో పాడాను) "హృదయ వీణా తంత్రి మీటి సారించితే-ముదమారపాడనా మధుర గీతమ్ము"(మంచాల జగన్నాథరావు),"ఏల మ్రోగించేవురా యీ మూగవీణ-యీ నిరాశే జీవితాన '-విరహగీతం(డా॥సి.నా.రె.), "తెలుగు తల్లి కోవెలలోన పలికింది పావనవీణ"(దేశభక్తి గీతం డా॥దాశరథి), "హృదయవీణ పలికెరా మనోహరా" (డా॥పద్మినీదేవి), "పొంగారిపాడవే బంగారువీణ-భోగాల కల్యాణరాగాల జాణవై" (వింజమూరి శివరామారావు) మొదలైనవి మచ్చుకుకొన్ని.

భావోద్వేగాలకు స్పందించని హృదయం ఉండదు. కాని స్పందనా స్పదమైన ఆ హృదయాన్ని కళానుందరి అంగుళుల సవరించినప్పుడు వేదనలైనా మధురంగా నినదిస్తాయి. అమృతం ఒలికిస్తాయి. అందుకే కళాసుందరిని(ప్రస్తుతం ప్రస్తావించబడుతున్న యీ గీతంలో) కవి రామభద్రరావుగారు తన హృదయవీణపై నుండి చేయి తీయవద్దంటారు. అమృత గీతాల ఆవిర్భావానికి ఆమె తోడు అవసరం కదా. ఈ చక్కని గీతానికి స్వరకర్త జి.వి. ప్రభాకర్ కల్యాణిరాగంలో బాణీని కూర్చి వీణను ప్రముఖంగా ఉపయోగించిన వాద్య సహకారంతో మధురంగా గానం చేశారు. 'మానసవీణ' శీర్షికన మరికొన్ని గీతాలతో క్యాసెట్‌గా రూపొం దించారు.

## జి.వి. ప్రభాకర్

ప్రముఖ గాయకుడుగా, స్వరకర్తగా, కర్ణాటక సంగీత విద్వాంసుడుగా పేరొందిన ప్రభాకర్‌గారి పూర్తిపేరు గరికిపాటి వెంకట ప్రభాకర్. చిన్నతనం లోనే మచిలీపట్టణంలో శ్రీమతి. భైరవభట్ల కమలమ్మగారి వద్ద కర్ణాటక సంగీతం ప్రప్రథమంగా అభ్యసించారు. అటు తరువాత 1974 ప్రాంతంలో తను గ్రాడ్యుయేషన్ చదువుతున్న సమయంలో సుమారు 6 సంవత్సరాలపాటు శ్రీ శిష్ట్ల ప్రభాకర కృష్ణమూర్తిశాస్త్రిగారి వద్ద సంగీత విద్యను అభ్యసిం చారు. బి.కాం., ఎం.ఎ. (మ్యూజిక్)



పట్టభద్రులు అయిన ప్రభాకర్ తరువాత విజయవాడలో నివసించసాగారు. ఆకాశవాణిలో లలిత సంగీతంలో 1980లో గాయకుడిగా గుర్తింపు పొంది ఎన్నో కార్యక్రమాలలో పాడి మంచిపేరు గడించుకున్నారు. 1987లో బి.హై ఆర్టిస్టు గాను,1990లో శాస్త్రీయ సంగీతంలోను ఆడిషన్‌లో ఉత్తీర్ణులైన ప్రభాకర్ గారు పలుసభలలో కచేరీలు చేసి పండితుల మన్ననలు పొందారు. ఆవిధంగా సుమారు 500 కచేరీలు చేసి భారతదేశమంతా పర్యటించి వచ్చిన యీ విద్వాంసుడిని మరెన్నో గౌరవాలు, అవార్డులూ వరించాయి. 1991,2001 సం॥లో అమెరికాలోని'తానా' సంస్థ వారి ఆహ్వానం అందుకుని సుమారు 25 కచేరీలు ఆదేశంలో నిర్వహించి మంచిఖ్యాతి నార్జించుకున్నారు. ఆ తరువాత తన శాస్త్రీయ,లలిత సంగీతాలను దుబాయ్, అబుధాబి, షార్జా మొదలగు దేశాలలోని శ్రోతలకు వినిపించారు. తిరుమల తిరుపతి దేవస్థానం వారి పండిత్ రవిశంకర్ అవార్డు, చెన్నైలోని తెలుగు కల్చరల్, సోషియో క్లబ్ వారిచే బెస్ట్ శాస్త్రీయ,లలిత సంగీతం అవార్డు, 'మధురగాయక' అనే బిరుదు ఆయనకు లభించాయి. 2000సం॥లో భగవాన్ సత్యసాయిబాబాగారి 75వ జయంతి ఉత్సవాలలో పుట్టపర్తిలో గానం చేసి బాబావారి ఆశీస్సులు పొందారు. అలాగే శ్రీగణపతి సచ్చిదానందస్వామి వారి భజనలు గానం చేసి 'అధికార గాయక', 'సంగీత దర్శక', బిరుదులు పొందారు. 2003లో ఘంటసాల సంగీత సంస్మరణ సంఘంవారి పురస్కారం పొందారు.

లలిత సంగీతంలో సుప్రసిద్ధ కవుల గీతాలకు సంగీతాన్ని సమకూర్చి ఆకాశవాణి, దూరదర్శన్‌లలో తను పాడడమే కాక, ఎంతోమంది గాయనీ గాయకుల చేత పాడించారు. కొంతకాలం క్రితం హైదరాబాదులో స్థిరనివాస మేర్పరచుకొని S. S. మ్యూజిక్ అకాడమిని స్థాపించి వారు, వారి శ్రీమతి జి.పి.లలిత యిద్దరూ కలిసి ఔత్సాహిక గాయనీ గాయకులకు, బాలబాలికలకు శాస్త్రీయ, లలిత సంగీతాలలో శిక్షణనిస్తున్నారు. ధర్మపథం, మానసవీణ, ఈ ప్రశాంత వేళలో (భావగీతాలు), వేమన పద్యాలు మొదలుగునవి ఆడియో క్యాసెట్లుగాను, సి.డి.లుగాను ప్రభాకర్‌గారు తన సంగీత సారథ్యంతో రూపొందించారు. మిరజ్ (మహారాష్ట్ర)లోని గాంధర్వ మహావిశ్వవిద్యాలయం వారి పాఠ్యప్రణాళికతో విద్యార్థులకు శిక్షణను యిస్తూ మంచి కళాకారులుగా తీర్చిదిద్దుతున్న శ్రీప్రభాకర్ గారు, శ్రీమతి లలితగారు అభినందనీయులు. నాకత్యంత ఆత్మీయులు.

కల్యాణీ/యమన్ రాగాల ఆధారంగా కొన్ని చిత్రగీతాలను 'హాసం' 16-31 జూలై, 2002, 16-31 నవంబర్,2002 సంచికలలో పేర్కొనడం జరిగింది.

## కొంటెకొశ్చెన్లు - తుంటరి జవాబులు



**యం. మస్తాన్ రెడ్డి, విశాఖపట్నం.**

ప : అర్థంకాని విషయాల్లో ఒకటి?

జ : దేశమంతా శాఖోపశాఖలుగా విస్తరించి ఉన్న స్టేట్ బ్యాంకుకి నేషనల్ బ్యాంక్ ఆఫ్ ఇండియా అని పెట్టక స్టేట్‌బ్యాంక్ ఆఫ్ ఇండియా అని పేరుపెట్టి రాష్ట్రానికే పరిమితి చేయడం.

**యం.భాస్కర్రావు, హైద్రాబాద్.**

ప : దుష్యంతుడు శకుంతలకి పుట్టిన భరతుడు, విశ్వామిత్రుడి మనవడంటే ఒప్పుకుంటాను. కానీ అతడు మనకి మునిమనవడు అని మా ఫ్రెండ్ అంటున్నాడు అదెలా....?

జ : విశ్వామిత్రుడు మనకి మునేకదా అందుకని 'ముని'మనవడు అన్నమాట.

## చిలిపి లిపి



Cow రవులు - కౌరవులు

**-మహేంద్రాడ చలం, టెక్కలి.**

youth Rum - యువతరం

**13** మేరా **7** రహేగా - తేరా మేరా సాత్ రహేగా

**-యం. మస్తాన్ రెడ్డి, విశాఖపట్టణం.**

## పేరు - రిపేరు



నేను - దొంగ - రౌడీ -గూండా - ద్రోహి -
ఐతే - నేరం నాది కాదు ఆకలిది.

**-ఎమ్. శరత్‌కుమార్‌రెడ్డి, నెల్లూరు.**

అతడు : ఓ చినదాన - నువ్వులేక నేనులేను-
ప్రేమించుకుందాం రా - నువ్వునేను -
ఆడుతు పాడుతు - కలిసుందాంరా

ఆమె : సారీ నాకు పెళ్లయింది - అంకుల్

**- కె.పిఆర్.శర్మ, కర్నూలు**



## ఈ రూటే వేరు




North son - ఉత్తరకుమారుడు

డ్రీమ్ మజిల్ - కలకండ

**-మహేంద్రాడ చలం, టెక్కలి.**

Others meditation - పరధ్యానం

Top Secret - ఎత్తయిన చోట చెప్పే రహస్యం

**-మేడా మస్తాన్‌రెడ్డి, విశాఖపట్నం**

## డబుల్ రోల్



ఆ వేప చెట్టుని హైవే పక్కన నాటాడు

వాడి విన్న పాలు విన్నాక నాతేం పాలు పోవటం లేదు

-వై. ధీరజ్‌కుమార్, నందిగామ.

కువైట్ నుండి నాకు వైట్ షర్ట్ తీసుకొనిరా

-జి. బాలా త్రిపురసుందరి, శ్రీకాకుళం.

## చిలిపి కవిత



నా పేరు యాదగిరి
మా ఊరు బోన్‌గిరి
అందరిపై చేస్తాను దాదాగిరి
చేతకాదు బొత్తిగా చెంచాగిరి
అందుకే మొన్న పోలీసులు పెట్టిరి కిరికిరి
తీసుకెళ్ళి శుభ్రంగా నా నెత్తి గొరిగిరి

-వి.రామ్మోహన్, సత్య ఆల్వాల్, ఆర్.ఆర్.డిస్ట్రిక్ట్

## షార్ట్‌కట్స్




| | | |
|---|---|---|
| **రోణంకి రంగరాజు** | - | రోజు |
| **వా విలాల రంగనాధం** | - | వారం |
| **నెల్లుట్ల లక్ష్మి** | - | నెల |
| **మామిడి సంగీత** | - | మాసం |
| **పల్లా విరూపాక్షం** | - | పక్షం |

-ఎమ్. శరత్‌కుమార్‌రెడ్డి, నెల్లూరు.

## పేరడీ పెరేడ్



ప: నాకూ నా భార్యకు పడదు
నేనంటే అసలే పడదు
ఔనన్నది కాదంటుంది
కాదన్నది లేదంటుంది
దీనితో వేగేదెలా
అయ్యయ్యో ! రామా, యిదీ పెళ్లామా ॥అయ్యయ్యో॥
కాదయ్యా కాదు కానే కాదు
ఆడపులి రా యిదీ ॥కాదయ్యా॥

చ: నా కిష్టం గుత్తొంకాయ
దాని కిష్టం గుమ్మడికాయ ॥నాకిష్టం॥
ఏకూర వండాలనీ
తగవుల తోనే టైమయిపోయె ॥తగవుల॥
టైమయినా గానీ వంటింకా లేదు
రోజూ ఉపవాసమే ॥నాకూ నా భార్యకు॥

చ: నాకిష్టం మహేషు బాబూ
దానికిష్టం మోహన్‌బాబూ ॥నాకిష్టం॥
ఏ సినిమా కెళ్లాలనీ
తగవులతోనే టైమయిపోయె ॥తగవులతోనే॥
తొందరగా మేమూ బయల్‌దేర లేదు
హాల్ ఫుల్లాయెనే
నాకు నా భార్యకు పడదు, నేనంటే అసలే పడదు
ఔనన్నది కాదంటుంది. కాదన్నది లేదంటుంది
దీనితో వేగేదెలా, అయ్యయ్యో! రామా, ఇదీ పెళ్లామా,
కాదయ్యా కాదు కానే కాదు, ఆడపులిరా యిదీ.

(బాబీ (హిందీ) చిత్రంలోని 'నా చాహూ సోనా చాందీ' పాటకు పేరడీగా )

-నేరెళ్ల రామమూర్తి, కాకినాడ.

ఈ సంచికలోని పేరడీ పెరేడ్‌ని రాసిన **నేరెళ్ల రామమూర్తి, కాకినాడ** గారికి సోహన్ మ్యూజిక్ వారు 'పెదబాబు' సినిమా పాటల ఆడియో సి.డి.ని బహుమతిగా ప్రకటించారు. అతి త్వరలో పోస్ట్‌ద్వారా పంపించడం జరుగుతుంది.

SOHAN MUSIC



## 'సరిగపదమని-19

**జవాబులు**

అడ్డం: 1.భద్రాచలం 3. ఆకుచాటు 5. నెల 6. ఏ 8. తిక 11.దొర 12.నర 13.వానా 16. లోకం 17.ఏవెట్టి 19.ఏ 21.ఇదిలే 25.నువ్వంటే 26.డాడీ

నిలువు: 1. భళి 2.చలి 3.ఆలయాన 4.చామంతి 7.చరణ 9.కళ్ళ 10.కోవా 14.నాలో 15.ఉట్టి 17.ఏమ 18.నాఇల్లు 20.నైజాం 22.లేను 23.మాటే 24. సోడా

### కరెక్టు సమాధానాలు వ్రాసిన వారు:

మైసూర్ కీర్తన-మదనపల్లి, ఆత్మూరి వెంకటసూర్యనారాయణరావు-హైదరాబాద్, పప్పు సత్యవతి- బెర్హంపూర్ (ఒరిస్సా), దాసరి స్నేహ-చల్లాపల్లి (కృష్ణా), భార్గవి వంకేశ్వరం- సి.యస్.పురం (ప్రకాశం), యం సత్యవాణి-పాతపట్నం (శ్రీకాకుళం), సి.యస్.అనురాధదేవి- పుంగనూరు (చిత్తూరు), యస్.యస్.కె సుధాకర్- విశాఖపట్నం, జన్ను బాబురావు- గుడివాడ, వి.స్వాతితేజస్వి- హైదరాబాద్, యు.యు.య.- ఎమ్మిగనూర్, పి.యల్ వందన-తాడేపల్లిగూడెం, ఇ.రాధిక- హైదరాబాద్, యస్.సునీత-ఎమ్మిగనూరు, నండూరి రామానుజాచార్యులు- విజయవాడ, పి రమ్యక్రిష్ణా- నందిగామ (కృష్ణా), శ్రీపాద స్వర్ణలత -న్యూఢిల్లీ, అయ్యగారి రాజశేఖర్- రాజోలు, కె.వి.దుర్గామోహనరావు- నల్గొండ, కె.జైదేవ్- నెల్లూరు, యస్ సుధారాణి-హైదరాబాద్, నడిపల్లి నాగరమేష్- రవుతులపూడి (తూ.గో.జిల్లా), జొన్నలగడ్డ అన్నపూర్ణ- విజయవాడ, పార్నంది వెంకటసూర్య సుబ్రహమణ్యమూర్తి-విశాఖపట్నం, టి శశికళ-శ్రీహరికోట(నెల్లూరు), నెల్లూత రమాదేవి-హనుమకొండ (వరంగల్), ఇ.పి.యస్ ప్రవీణా-విజయనగరం, మేడా మస్తాన్‌రెడ్డి- విశాఖపట్నం, ముటుకూరు వసుంధర- హైదరాబాద్, ఎ.శివకుమార్- తిరుపతి, కె.చిన్నబాబు- నెల్లూరు, సి.హెచ్ శ్యామలకుమారి-రాజమండ్రి, ఎస్.శేషుమారి- దేవాపూర్(అదిలాబాద్), కె.వి సరవనాకుమార్-సోదామ్, కె.వి సరస్వతి- హైదరాబాద్, అనుపమ,చక్రవర్తి-రాజమండ్రి, కె.శ్రీనివాసులు -పాలకల్ (కర్నూలు), బి.వేణుగోపాల్- పర్లాకిమిడి (ఒరిస్సా), టి.వి.నిర్మలారాణి - పర్లాకిమిడి (ఒరిస్సా), కె.సంతోష్‌కుమార్- సికింద్రబాద్, చివుకుల సుబ్రహ్మణ్యశాస్త్రి- ఒంగోలు, అయితా సత్యనారాయణ-సూళ్ళూరూ పేట (నెల్లూరు), యం బాలసాయిప్రభా- న్యూపాల్వంచ (ఖమ్మం), యం.బి.రామశేషు- కర్నూలు, యం.యన్.వి.శాస్త్రి- కాకినాడ, గానుగపాటి. సరోజినిదేవి- సికింద్రబాద్, పద్మనాభం- విజయవాడ, కె.వి.యన్.యస్. భగవాన్- రాజమండ్రి, చిలుకూరి శ్రీనివాసశర్మ-విజయవాడ, ఆర్.యస్.సత్యవాణి- హైదరాబాద్, పి లలితాదేవి- నెల్లూరు, యం.వి.రాఘవమూర్తి- రాజమండ్రి, రాచర్ల ఆదిమూర్తి- గరివిడి (విజయనగరం), యస్.ఇ.రావు- హైదరాబాద్, యన్ శ్రీవాణి- విజయవాడ, యన్ జ్యోతిర్మయి-హైదరాబాద్, మద్దాలి సువర్చలాశ్రీనివాస్- హైదరాబాద్, యస్. మనోహర్‌బాబు- కావలి, నారోజు శంకరాచార్యులు- చిలుకానగర్, బెహరా శేషశాయి- సత్తెనపల్లి (గుంటూరు), జస్వంత్ ప్రసాద్‌జైదేవ్- ఖమ్మం, సి.హెచ్. పరాత్పరరావు- ఏలూరు, ముప్పిరాల వెంకటరమణ- హైదరాబాద్, ఆర్. కిషోర్‌కుమార్- 8ఇంక్లిన్ కాలనీ (కరీంనగర్), సి.హెచ్. కళ్యాణ్ చక్రవర్తి-బెర్హంపూర్ (ఒరిస్సా), యల్లాపంతుల చందు- శ్రీకాకుళం, పప్పు అప్పారావు -శ్రీరామ్‌నగర్ (విజయనగరం), జోశ్యుల భానుమూర్తి -భీమవరం (ప॥గో॥జిల్లా), కొండదాడి సుగుణాకరరావు- విశాఖపట్నం, ఉప్పాల మోహనబాబు-అవనిగడ్డ (కృష్ణా), పి. తిరుమలప్రసాద్- హైదరాబాద్, వేదగిరి లక్ష్మీప్రసాద్- సికింద్రబాద్, రాచర్ల రోహిణి- హైదరాబాద్, ఇ.నటరాజన్-చిత్తూరు, గొర్తి సూర్యనారాయణ- రాయగడ (ఒరిస్సా), ఎం పురుషోత్తమాచార్యా- రామగిరి(నల్గొండ), ఆర్.సాయిప్రసాద్- హైదరాబాద్, యస్.వి.సి కామేశ్వరరావు- సికింద్రాబాద్, సి.హెచ్.శ్వేత- చీపురుపల్లి (విజయనగరం), యం అంజిరెడ్డి- ఒంగోలు, జి.లక్ష్మణ్‌కుమార్-విశాఖపట్నం, వి.కనకదుర్గ- గుంటూరు, ఎ. విఘ్నేశ్వర రావు- పర్లాకిమిడి (ఒరిస్సా), గంగిశెట్టి భారతి- నెల్లూరు, ఎన్ జగన్మోహనరావు- కరీంనగర్, యం.మారుతిశాస్త్రి-చింతలపూడి (గుంటూరు), బచ్చువిజయ్‌కుమార్- విశాఖపట్టణం, పి వేణుగోపాల్ రావు- అచ్చంపేట (మహబూబ్‌నగర్), పెరాల శ్రీవాణి- వైజాగ్, పసుపులేటి ఝాన్సీలక్ష్మీబాయి -మొగలికుదురు (తూ.గో.జిల్లా), కె చిన్నబాబు- నెల్లూరు, సి విజయ సారధి- కర్నూలు, కనకదండి ప్రదీప్‌కుమార్-టాటానగర్ (జార్కాండ్), వాస్తుసతీష్ చంద్ర- నెల్లూరు, ఓలేటి సీతాదేవి -విజయవాడ, కోడూరు సత్యనారాయణ- కడప, భువనగిరి ప్రభాకర్-హైదరాబాద్, బంకరు శ్రీను- సికింద్రాబాద్, వి.రమాదేవి- హైదరాబాద్, పింగళి లలిత- ఒంగోలు, పి.శిరీషాకుమార్- రాజమండ్రి, చివుకుల చిరంజీవి-ఒంగోలు, ఎం.వి.యస్ లక్ష్మి- కాకినాడ, యన్.లలిత- గుంటూరు, ములగలేటి వెంకటసత్యనారాయణశాస్త్రి- విజయవాడ, అవసరాల ప్రసన్నకుమార్-విశాఖపట్నం, బి శ్రీనివాస్‌ప్రభాకర్- హైదరాబాద్.

### ఒక తప్పుతో వ్రాసిన వారు:

యిరుకుళ్ళ వీరన్న- గోదావరిఖని, ఏ.బి.వి.ఎన్ రమేష్- వేలూరు (తమిళనాడు), గర్రేపల్లి వెంకటరావు- హైదరాబాద్, గోసాల వ్యాఘ్రేశ్వరరావు- రాజమండ్రి (తూ.గో.జిల్లా), యస్.సంజయ్- నల్గొండ, వేముల శేఖర్- నిజామాబాద్, వి.ఆనంద్ కుమార్-ఏలేశ్వరం (తూ.గో.జిల్లా), జీవా- రాజోలు, యం.డి.ఆసిఫ్‌పాశ- నాచారము(రంగారెడ్డి), జి.ఆశాజ్యోతి- వినుకొండ, పి.యన్.యస్.రమ్యా- సికింద్రాబాద్, సౌజన్య,శిరీష, సువేద- హైదరాబాద్, వేంద్ర బాలస్వప్న- హైదరాబాద్, సంగనభట్ల రామకిష్టయ్య- ధర్మపురి (కరీంనగర్), పెద్ది శ్రీనివాస్- ధర్మపురి (కరీంనగర్), సాలా రవికుమార్-విశాఖపట్నం, యం.మాధురి రంగారావు- నల్గొండ, ఎస్ శివశ్వేత-దేశపాతునిపాలెం(విశాఖజిల్లా), యం.శ్రీరామకృష్ణా- గుడివాడ, యం రవిచంద్ర- తిరుపతి, కె సౌజన్య-రాజమండ్రి, కె వాసంతిదేవి-నిజామాబాద్, పి.మధుసూదన్- సికింద్రబాద్, ఎ.టి శ్రీనివాసన్ -అనంతపురం, వి ఉమావెంకట్‌రావు-ఖమ్మం, ఆరాధ్యుల సత్యసీతాసుంద ర్రావు- విశాఖపట్నం, మానూరు సుగుణ సునంద- మల్కిపూరం, కె. సుబ్రమణ్యం-రాయచోటి(కడప), ఎ సిద్దార్ధ- అమాలాపురం, బి.యస్.ప్రసాద్- భీమడోలు, డి సబిత- హైదరాబాద్, వి.వి సూర్యనారాయణ మూర్తి- కాకినాడ, పి.పాపారావు-విశాఖపట్నం, ఆర్.వి.వి.క్రిష్ణా-ఆర్.సి.పురం (హైదరాబాద్), బి భార్గవి-ప్రొద్దుటూరు, జి.హేమంత్- మాల్కాజ్‌గిరి (హైదరాబాద్) , ఎ.నవీన-కొత్తపేట(కర్నూలు), సాదినేని వెంకటేశ్వర్లు- కాజీపేట (వరంగల్), వల్లభాపురపు ఉష- తెనాలి, యడ్లపల్లి చంద్రశేఖర్- తెనాలి, యం.శంకరశాస్త్రి- ఆదోని, ముగ్గుళ్ళ రాజ్‌కుమార్-మాల్కాజ్‌గిరి, పక్కి చక్రవర్తి- విజయనగరం, సామంచి రాధ- విజయవాడ, గంగారపు కళ్యాణి-సత్తెనపల్లి(గుంటూరు), యన్.క్రిష్ణకుమార్- గుంటూరు, ఎ అపర్ణ-హైదరాబాద్.

### రెండు తప్పులతో వ్రాసిన వారు:

పాలకోడెటి గౌరి- హైదరాబాద్, యు.ఆదిత్యామణిధర్- కోటనందురు (తూ.గో.జిల్లా), సపారే ఈరణ్ణ- ఆదోని, యిశిరెడ్డి వెంకటరమణారెడ్డి-అంకిరెడ్డిపాలెం (గుంటూరు), సుజన్‌కుమార్- హైదరాబాద్, యం అనుపమ్ కుమార్- అనకాపల్లి, నేమాన సుభాష్- శ్రీకాకుళం, సి.హెచ్ గౌరీపతిరావు-జోగిపెట్(మెదక్), ఎ శ్రీనివాస్- పాతపాలమూర్ (మహబూబ్‌నగర్), లుంబూరు లక్ష్మీప్రసాద్- హైదరాబాద్, పుణ్యాల శ్రీలక్ష్మి- సత్తెనపల్లి (గుంటూరు), కె.రామారావు- హైదరాబాద్, బి.కె మురళీమోహన్- మర్కాపూర్ (ప్రకాశం), తాడి కృష్ణారెడ్డి- భిక్కవోలు, పుణ్యాల రాజ్యలక్ష్మి- సత్తెనపల్లి (గుంటూరు), ఆర్ బుషికాంత్-చెన్నై.

### మూడు తప్పులతో వ్రాసిన వారు:

యస్.వి.యస్.యస్.భాస్కర్- రాజమండ్రి, బేరా సతీష్‌కుమార్- నర్సీపట్నం (విశాఖజిల్లా), ఉదాలి భాస్కరయ్య- చెన్నై, ఉప్పులూరి సాహితిచంద్రిక-మొగలికుదురు (తూ.గో.జిల్లా), జి పార్వతి-కొంతమూరు, డి. వర్ష-సికింద్రాబాద్, కె.వి.రమణారెడ్డి- హైదరాబాద్, యస్.టి.పి కళ్యాణ్-విజయవాడ, సి.ఉమారవిక్రిష్ణ- తిరుపతి, వరయోగి రామ్‌మోహన్-సికింద్రాబాద్.

## రచన : వేటూరి (1) గానం : ఎస్.పి.బాలు, ఎస్. జానకి

ప: ఓం.... ఓం... ఓంకారనాదాను
సంధానమౌ గానమే శంకరాభరణము
శంకరగళ నిగళము శ్రీహరి పదకమలము
రాగరత్న మాలికా తరళము శంకరాభరణము
చ: శారద వీణా రాగచంద్రికా పులకిత శారద రాత్రము
నారద నీరద మహతీ నినాద గమకిత శ్రావణగీతము
రసికుల కనురాగమై రసగంగలో తానమై
పల్లవించు సామవేదమంత్రము శంకరాభరణము
చ: అద్వైత సిద్ధికి, అమరత్వలబ్ధికి గానమె సోపానము
సత్వసాధనకు, సత్య శోధనకు సంగీతమే ప్రాణము
త్యాగరాజ హృదయమై రాగరాజ నిలయమై
ముక్తినొసగు భక్తియోగ మార్గము
మృతియె లేని సుధాలాపస్వర్గము శంకరాభరణము
ఓంకారనాదాను సంధానమౌ గానమే శంకరాభరణము
పాదాని శంకరాభరణము
పమగరీ-గమపదని శంకరాభరణము
సరిసా -నిదపా-నిసనీ-దపమా-గరిగా-పమగా-పమద-
పనిద సనిగరి శంకరాభరణము
దపా-దమా-మా పాదపా
మా పా ద పా
దపా-దమా-మదపామగా
మ ద పా మ గా
గమమద- దనినిరి-మదదని-నిరిరిగ-నిరిరిగ-గమమగ-
సరిరిస-సనినిదదప శంకరాభరణము
రీసనాస-రిరిసాస-రీసాస సనిస రీససని రిసని దనీనీనీ
దాదానీని-దదనీని-దానీని దనిస దనిసద నిసదని దగరిసాని
దస దా దా దా
గరిగా మమగా-గరిగా మమగా-గరిగమస-గామపద-
మదసమ-గరిసరి
సరిగసరీ-గరిమగపమ దప మగప దపనిద-పమదప
నిదసని
రిసగరిసా-గరిసనిద-రీసా-రిసనిదప-సా
గరిసనిద-రిసనిదప-సనిదపమ-రీసానీ-రిసనిదప-నీదా
సనిద పమపా-రిసనిదప-సనిదపమ-దపమగరి-గామాదా
నిదని-పదమాప-రిసనిదప-రీ-దపమగరీ-
రిసని దప-మగరిసని శంకరాభరణము...శంకరాభరణమూ

## (2) గానం : యస్.పి బాలు,యస్.జానకి

సారిగరీ గపదాపా।
సరిగపదా పగరీ।
రిగపదసానీ దాపా॥
గపద పదప గపదపదప।
గపదప। రిగ పగపగ। రిగపగపగ।
రిగపగ॥
సరిగ। రిగప। గపద। పదరిసా। రిగప। గపద। పదస। దసగరీ॥
ససరిరి గగపప। రిరిగగ పపదద। గగపప దదసస॥
పపదద ససరిరిసా। రిసా। రిసా। రిసా॥
గపద। పగరి। రిగప। గరిస॥
దసరి పదసా। గపదారిగపా॥
దసరి పదసా। గపదారిగ పా॥
సానిద। నీదప। దాపగ। పదప॥
పదసరీగరి। రిగపదాపదా॥
సారీ। గాపా। దాపా॥

## రచన : వేటూరి (3) గానం : ఎస్.పి.బాలసుబ్రహ్మణ్యం

ప: రాగం తానం పల్లవి
నా మదిలోనె కదలాడి కడ తేర మన్నవి
చ: కృష్ణాతరంగాల సారంగ రాగాలు
కృష్ణలీలా తరంగిణీ భక్తిగీతాలు
సస్య కేదారాల స్వరస గాంధారాలు
సరసహృదయ క్షేత్ర విమల గాంధర్వాలు
క్షీర సాగర శయన దేవ గాంధారిలో
నీ పద కీర్తన సేయగా....మమపదని
రాగం తానం పల్లవి
నా మదిలోనె కదలాడి కడతేర మన్నవి
చ: శృతి లయలే జననీ జనకులుకాగా
భావాల, రాగాల తాళాల తేలి
శ్రీ చరణ మందార మధుపమ్మునై వ్రాలి
నిర్మల నిర్వాణ మధుధారలే గ్రోలి..
భరతాభినయ వేద వ్రత దీక్ష పూని
కైలాస సదనా కాంభోజి రాగాన
నీ పద నర్తన సేయగా ....పదని
రాగం తానం పల్లవి
నా మదిలోనె కదలాడి కడ తేర మన్నవి

## రచన : వేటూరి (4) గానం : ఎస్.పి.బాలసుబ్రహ్మణ్యం

శంకరా నాదశరీరా పరా
వేదవిహారా హరా జీవేశ్వరా....శంకరా
ప్రాణము నీవని గానమే నీదని ప్రాణమె గానమనీ
మౌన విచక్షణ గాన విలక్షణ రాగమె యోగమని
నాదోపాసన చేసిన వాడను నీ వాడను నేనైతే
ధిక్కరీంద్రజిత హిమగిరీంద్రసిత ఖందరా నీలకంధరా
క్షుద్రులెరుగని రుద్రవీణ నిర్నిద్ర గానమిది
అవధరించ రా విని తరించరా ॥శంకరా॥
మెరిసే మెరుపులు మురిసే పెదవుల
చిరు చిరు నవ్వులు కాబోలు
ఉరిమే ఉరుములు సరిసరి నటనల
సిరిసిరి మువ్వలు కాబోలు
పరవశాన శిరసూగంగా ధరకు జారెనా శివగంగ
నా గానలహరి నువు మునుగంగా
ఆనంద వృష్టి నే తడవంగ ॥శంకరా॥

## రచన : కె. విశ్వనాథ్ (5) గానం : జిత్‌మోహన్ మిత్ర& పార్టి

హల్లో శంకర్ శాస్త్రీ.......
హౌ ఆర్ యూ ఏరియల్ శాస్త్రీ
లంబోదరా లకుమిక రా
అంబాసుత అమర వినుత సరీగమ పదనీ మేస్త్రి
ఓ పూర్ శాస్త్రీ

## రచన : రామదాసు (6) గానం : వాణీజయరాం

ఏ తీరుగ నను దయజూచెదవో ఇనవంశోత్తమరామా
నా తరమా భవసాగర మీదను నళిన దళేక్షణ రామా
శ్రీ రఘునందన సీతారమణా శ్రితజన పోషక రామా
కారుణ్యాలయ భక్త వరద నిను కన్నది కానుపురామా
క్రూరకర్మములు నేరక చేసితి నేరము లెంచకు రామా
దారిద్ర్యము పరిహారము సేయవే దైవ శిఖామణి రామా

## మైసూరు వాసుదేవాచార్య కీర్తన (7) గానం : ఎస్.పి.బాలు, వాణీజయరాం

బ్రోచే వారెవరూ నినువినా రఘువరా
నీ చరణాంబుజములనే విడజాల కరుణాలవాల
ఓ చతురాననాది వందిత నీకు పరాకేల నయ్యా
నీ చరితము పొగడలేని, నా చింత దీర్చి వరములిచ్చి వేగమె
సా సనిదపదని సనినిదదప మపాద మాగామ పదాని-
సనీదపమ నిదపమ గమప దమగరి-సమాగమసద
మా పదని-ససరినీ-నినిసదా-దదనిసాద-మపదనిస నిదప
మగమనిదని-సదమా పదని
సమాగరి-సరిసా నీదస-సనీదపమ-గామాపదని
బ్రోచేవారెవరురా
సీతాపతే నాపై నీ కభిమానము లేదా
వాతాత్మజార్చితపాద నా మొరలను వినరాదా
భాసురముగ కరిరాజుని బ్రోచిన వాసుదేవుడవు నీవు కదా
నా పాతక మెల్ల పోగొట్టి గట్టిగ నా చేయిపట్టి విడువక
సాసనిదపదని సనినిదదప మపాద మాగామ పదాని
సనీదపమ-నిదదమగమప దమగిరి-సమాగమపద
మాపదని-ససరినీ-నినిసదా-దదనిసాద
మపదనిస నిదప-మగమనిదని-సదమాపదని
సమాగరి సరిసానీదస-సనీదప-గమాపదని
బ్రోచేవారెవరురా

## రచన : సదాశివ బ్రహ్మేంద్ర స్వామి (8) గానం : ఎస్.పి.బాలు, వాణీజయరాం

మానస సంచరరే బ్రహ్మణి మానస సంచరరే
మదశిఖి పింఛాలంకృత చికురే
మహనీయ కపోలజితముకురే
శ్రీరమణీకుచ దుర్గ విహారే
సేవకజన మందిరమందారే
పరమ హంసముఖ చంద్రచకోరే
పరిపూరిత మురళీరవధారే....మానస సంచరరే..

## పల్లవి : త్యాగరాజు కీర్తన (9) గానం: ఎస్.పి.బాలు, జానకి చరణాలు : వేటూరి

సామజ వరగమనా సాధుహృత్ సార సాబ్జపాల
కాలాతీత విఖ్యాత సామజవరగమనా
సామని గమజ సుధామయగాన విచక్షణ గుణశీల
దయాలవాల మాంపాలయ సామజవరగమనా
ఆమని కోయిలా ఇలా- నా జీవన వేణువులూదగా
మధురలాలసల మధుపలాలనల -పెదవిలోని మధువులాను
వ్రతముపూని జతకు చేరగా
నిసా-దనీ-మదా-గమా-సమమగ-గదదమ
మనినిద-సనిదమ-దనిసా-దనిసా
గదదమ-మనినిద-దససని-గసనిద-నిసగ-నిసగ
సమగమ-గససని-నిగసగ-సనినిద-దనినిద
మదదని-గమదని-సనిదమగస-సామజవరగమనా
వేసవి రేయిలా ఇలా నా ఎదలో మల్లెలు చల్లగా
మదిని కోరికలు మదన గీతికలు
పరువమంత విరులపాన్పు పరచి నిన్ను పలుకరించగా
గమా - గమదమగమా - గమనిదమదా-మదనిసదనీనినీని-
మదనీనినీని-గమదా-దదాదదానీ-మదనీని నీదమగసా-
సాసా-సానీ-సదా-సగమద- గమదని- గమదని
మదనిస-మదనిస-దనిసగమా..ఆ(...ఆ(..ఆ(...

## కాళిదాసు శ్యామలా దండకం (10) గానం : ఎస్.పి.బాలసుబ్రహ్మణ్యం

మాణిక్యవీణాం ముపలాలయంతీం మదాలసాం
మంజుల వాగ్విలాసామ్
మహేంద్ర నీలద్యుతి కోమలాంగీం
మాతంగ కన్యాం-మనసాస్మరామి
చతుర్భుజే - చంద్రకళా వతంసే
కుచోన్నతే కుంకుమరాగశోణే
పుండ్రేక్షు పాశాంకుశ పుష్ప బాణహస్తే
నమస్తే నమస్తే జగదేకమాతః

## రచన : రామదాసు (11) గానం : వాణీజయరాం

పలుకే బంగారమాయెనా
పలుకే బంగారమాయె
పిలిచిన పలుక వేమి
కలలో నీ నామస్మరణా మరువ చక్కని స్వామి-
పలుకే బంగారమాయెనా

## రచన : వేటూరి (12) గానం : యస్.పి.బాలు,వాణీజయరాం

దొరకునా..... దొరకునా ......దొరకునా
దొరకునా ఇటువంటిసేవా
నీపద రాజీవముల చేరు నిర్వాణసోపాన
మధిరోహణము సేయుత్రోవ ॥దొరకునా॥
రాగాలనంతాలు నీ వేయి రూపాలు
భవరోగతిమిరాల పోకార్చు దీపాలు,
నాదాత్మకుడవై నాలోన వెలిగే
నా ప్రాణదీపమై నాలోన వెలిగే
నినుకొల్చువేళ దేవాదిదేవా..దేవాదిదేవా.. ॥దొరకునా॥
ఉచ్ఛ్వాస నిశ్వాసములు వాయులీనాలు
స్పందించు నవనాడులే వీణాగానాలు,
నడలూ, ఎదలోని సడులే మృదంగాలు
నాలోని జీవమై నాకున్న దైవమై
వెలుగొందువేళ మహానుభావా
దొరుకునా ఇటువంటిసేవా
నీపద రాజీవముల చేరు నిర్వాణసోపాన
మధిరోహణము సేయుత్రోవ ॥దొరకునా॥

## నటీనటవర్గం

| | |
|---|---|
| జె.వి. సోమయాజులు, | మంజుభార్గవి, |
| అల్లు రామలింగయ్య, | జి.నిర్మల, |
| చంద్రమోహన్, | పుష్పకుమారి, |
| సాక్షి రంగారావు, | బేబి వరలక్ష్మి, |
| భీమేశ్వరావు, . | ఝాన్సీ, |
| అర్జా జనార్దనరావు, | జానకి |

మాస్టర్ తులసీరామ్
మరియు
నూతననటి రాజ్యలక్ష్మి.

## సాంకేతిక నిపుణులు

| | |
|---|---|
| కథ, స్క్రీన్‌ప్లే | |
| దర్శకత్వం | : కె.విశ్వనాథ్ |
| మాటలు | : జంధ్యాల |
| పాటలు | : వేటూరి సుందరరామమూర్తి |
| సంగీతం | : కె.వి. మహదేవన్ |
| ఛాయాగ్రహణం | : బాలూమహేంద్ర |
| నృత్యాలు | : శేషు |
| కళ | : తోట |
| కూర్పు | : జి.జి. కృష్ణారావు |
| గాయనీ గాయకులు | : ఎస్.పి.బాలసుబ్రమణ్యం,ఎస్.జానకి, వాణీజయరాం, ఎస్.పి. శైలజ, మాధవపెద్ది రమేష్, జిత్‌మోహన్ మిత్రా, పట్టాభి |
| శబ్దగ్రహణం | : ఎ.ఆర్.స్వామినాధన్ |
| దుస్తులు | : కె. సూర్యారావు |
| మేకప్ | : యం.సత్యం |
| పబ్లిసిటి | : లక్ష్మీ పబ్లిసిటి |
| పబ్లిసిటీ డిజైన్స్ | : గంగాధర్, పాణి |
| స్టిల్స్ | : కె. సత్యనారాయణ |
| సహాయ దర్శకులు | : వంశీ - జె. వెంకటేశ్వరరావు |
| ప్రొడక్షన్ మేనేజర్స్ | : పి.రాజగోపాల్, ఆర్.రవిప్రకాశ్ |
| ప్రెస్ రిలేషన్స్ | : ఐ.అర్జునరావ్ |
| ప్రొడక్షన్స్ చీఫ్ | : వి. జగన్మోహనరావు |
| సహకార దర్శకుడు | : యన్.విజయ్ |
| నిర్వహణ | : జి. పృథ్విరాజ్ |
| సహనిర్మాతలు | : తాడి రామకృష్ణ, తాడి హరిబాబు, తాడి బాబ్జి. |

## కథా సంగ్రహం

సంగీతాన్నే నమ్ముకున్న స్వరసిద్ధుడు శంకరశాస్త్రి(జెవి సోమయాజులు). శంకరాభరణం రాగాన్ని ఆలాపించటంలో తనకి సాటిలేరనే ఖ్యాతిని సంపాదించుకున్న నాదోపాసకుడతను. తులసి (మంజుభార్గవి) ఆ ఊరి వేశ్య రత్న పాప(ఝూన్సీ) కూతురు. శంకరశాస్త్రి అంటే అమితమైన ఆరాధన, భక్తిభావం.

ఆయన ఫోటోను ఎదురుగా పెట్టుకుని సంగీత సాధన చేస్తూ వుంటుంది. ఆమెను వేశ్యావృత్తికి దించాలని రత్నపాప ప్రయత్నిస్తూ వుంటుంది. కానీ ఆమె లొంగదు. శంకరశాస్త్రి ఆలాపన ఎక్కడ వినిపిస్తే అక్కడికి పోయి తన్మయురాలై పోతూవుంటుంది. నృత్యం కూడా చేస్తూ వుంటుంది. బెంగళూరులో ఓసారి సంగీత కచ్చేరీ ఇవ్వడానికి శంకరశాస్త్రి రైలులో ప్రయాణిస్తూ వుంటే, తల్లి బారినుండి తప్పించుకున్న తులసి అదే కంపార్టుమెంట్‌లో ప్రవేశిస్తుంది. జరిగింది తెలుసుకొని ఆమెకు ఆశ్రయం ఇస్తాడు శంకరశాస్త్రి. కచ్చేరిలో తనకు వాద్యసహకారాన్ని అందించే వాళ్ళు నోళ్ళు నొక్కుకున్నా లెక్కచేయడు. కచ్చేరీ ముగిసిన సమయానికి రత్నపాప అక్కడికి చేరుకుని తన కూతురును ఈ శంకరశాస్త్రి వలలో వేసుకున్నాడన్న అభాండం వేసి తులసిని లాక్కుపోయి ఆమెను కొన్నాళ్ళుగా కోరుకుంటున్న జమిందారు పరం చేస్తుంది. తనను ఆ జమిందారు అపవిత్రం చేసినా తులసి సహిస్తుంది. కానీ తను ఆరాధ్యదైవంగా భావించే శంకరశాస్త్రిని తూలనాడుతూ ఆయన ఫోటోను కాలిలో తన్నగానే భరించలేకపోయింది. ఫోటో ఫ్రేములో పగిలిన గాజుముక్కతో ఆ జమిందారును చంపి అతని రక్తంతో శంకరశాస్త్రి పాదాలు కడుగుతుంది.

శంకరశాస్త్రి ఆమెను అర్థం చేసుకుంటాడు. తన స్నేహితుడు, లాయరు అయిన మాధవాచారి (అల్లురామలింగయ్య) కి తులసి కేసును అప్పగిస్తాడు. ఖర్చంతా తనే భరిస్తానంటాడు. ఆ ప్రకారం మాధవాచారి కోర్టులో వాదించి నేరం తులసిది కాదని ఆమె తల్లి రత్నపాపదేనని నిరూపించి రత్నపాపకు శిక్ష పడేట్టు చేస్తాడు. ఒంటరిదైన తులసికి తన యింట ఆశ్రయం ఇస్తాడు శంకరశాస్త్రి. ఊరంతా ఈ చర్యకు నివ్వెరపోతుంది. పరమనిష్ఠాగరిష్ఠుడైన శంకరశాస్త్రి ఇంట ఒక వేశ్య పాదం మోపడాన్ని జీర్ణించుకోలేకపోతుంది. తత్ఫలితంగా శంకరశాస్త్రికి కచ్చేరీలో వాద్య సహకారాన్ని అందించే వారంతా ఆయనకి దూరమైపోతారు. ఊరి ప్రజలు కూడా ఆయన కచ్చేరీ చేస్తూంటే దిగ్గున లేచిపోతారు. తన మూలంగా తన దైవం ఇన్ని అవమానాలను ఎదుర్కోవటం తులసి సహించలేకపోయింది. ఎవరికీ చెప్పకుండా ఆ ఊరు విడిచి వెళ్ళిపోతుంది.

ఆత్మహత్య చేసుకోవాలనుకుంటుంది కానీ జమిందారు చేసిన అకృత్యం వలన తనలో మరొక జీవి ఊపిరిపోసుకుంటున్నదని తెలుసుకొని ఆ ప్రయత్నాన్ని విరమించుకుంటుంది. విషకీటకమైన నాగుపాము శంకరునికే ఆభరణమైనట్టు విషబీజంగా తనలో పెరుగుతున్న ప్రాణిని ఏనాటికైనా శంకరశాస్త్రి గారి పాదాల వద్ద చేర్చి తను పొందలేకపోయిన అదృష్టాన్ని ఆ శిశువుకు ప్రసాదించాలన్న కోరికతో కాలం వెళ్ళబుచ్చుతూ వుంటుంది.

కాలచక్రం తిరిగింది. ప్రజల అభిరుచుల్లో మార్పువచ్చింది. శాస్త్రీయ సంగీతానికి ఆదరణ తగ్గింది, అంతా పాశ్చాత్య సంగీతం వైపు మోజు చూపుతున్నారు. శంకరశాస్త్రి కుటుంబం ఆర్థికంగా చితికిపోయింది. ఆయన మాత్రం మొక్కవోని ధైర్యంతో కాలానికి తలవంచక సంగీత సాధన విడువకుండా చేసుకుంటూ జీవితాన్ని సాగిస్తున్నాడు.

తులసి తనకు పుట్టిన కుర్రవాడికి శంకరశాస్త్రి పేరు కలిసొచ్చేట్టు 'శంకరం' అనే పేరు పెట్టుకుని పెంచి పెద్ద చేసి కొన్నేళ్ళ తర్వాత ఆ ఊరిలో అడుగుపెడుతుంది. తన కొడుకు శంకరం కి శంకరశాస్త్రి గారి గురించి సర్వం తెలియచేస్తుంది. శంకరం, శంకరశాస్త్రి గారింట్లో ఓ అనాథలా అడుగుపెడతాడు. అక్కడే వుండి శంకరశాస్త్రి గారిని చూసుకుంటూ ఆయన సేవలు చేసుకుంటూ ఆయన చేసే సంగీత సాధన ద్వారా స్వరజ్ఞానాన్ని అలవర్చుకుంటూ ఉంటాడు.

తులసి కోర్టు కేసుని వాదించిన లాయర్ మాధవాచారి ఓ రోజు తులసిని చూసి గుర్తుపట్టి -మీ అమ్మ పశ్చాత్తాపంతో కన్నుమూసింది. పోతూ పోతూ యావదాస్తినీ నీ పేరనే రాసింది- అంటూ ఆస్తికి సంబంధించిన పత్రాలు ఇస్తాడు. ఇప్పుడు తనకు ఆస్తి ఎందుకంటుంది తులసి. నీకు అక్కరలేకపోతే ఏ ధర్మకార్యానికో, ఏ పుణ్యకార్యానికో వినియోగించు అంటాడు మాధవాచారి.

తులసికి ఆ సలహా నచ్చుతుంది. ఆ ఊరిలో ఉన్న ఓ హాలుని రీమోడల్ చేయించి దానికి 'శంకరాభరణం శంకరశాస్త్రి కళామందిరం' అని పేరు పెట్టి అందులో తొలి కచ్చేరీ శంకరశాస్త్రి గారిదే అయ్యేట్టుగా ఏర్పాటు చేస్తుంది.

ఈలోగా శంకరశాస్త్రి కూతురు శారద(రాజ్యలక్ష్మి) కు కామేశం (చంద్రమోహన్)అనే ఓ బుద్ధిమంతుడైన కుర్రాడితో వివాహం నిశ్చయం అవుతుంది. ఆ పెళ్ళి, శంకరశాస్త్రి కళామందిరం ప్రారంభోత్సవం రెండూ ఒకే రోజున కలిసొస్తాయి.

కూతురు పెళ్ళి నిర్విఘ్నంగా జరిగిపోయింది. తన పేరుమీద ఓ కళామందిరం ఏర్పాటయింది. ఇన్నాళ్ళకి తనకు మళ్ళీ శాస్త్రీయ సంగీత కచ్చేరీ చేసే ఓ అవకాశం వచ్చింది. ఈ అనుభూతులన్నింటినీ కలగలుపుకొని శంకరశాస్త్రి గానం మొదలుపెట్టాడు. కానీ ఆనందోద్వేగాలను ఆయన గుండె తట్టుకోలేకపోయింది. ఆయన పాడలేక మధ్యలో ఆపేసిన గీతాన్ని శంకరం అందుకుని అద్భుతంగా ఆలపించి సభికులను రంజింపచేస్తాడు. తనలోని సంగీత విద్యకు సరియైన వారసుడు శంకరమే అని శంకరశాస్త్రి గ్రహిస్తాడు. అంతేకాదు ఇంతకాలం అజ్ఞాతంగా వుండి ఈ ఏర్పాట్లన్నీ చేయించినది తులసేనని, శంకరం ఆమె కొడుకేనని తెలుసుకుంటాడు. తన కాలికున్న గండపెండేరాన్ని శంకరంకి తొడిగి తన స్వరవారసుడిగా ఆశీర్వదిస్తూ సభికులు,బంధువులు అందరి మధ్య తృప్తిగా కన్నుమూస్తాడు. తన ఆశ,ఆశయం రెండూ నెరవేరాయన్న సంతృప్తితో తులసికూడా శంకరశాస్త్రి పాదాల వద్ద తన జీవితాన్ని చాలిస్తుంది.

## రసజ్ఞ పాఠకులకి..... నమస్కారం..

ఎందరెందరో మహానుభావుల గురించి 'హాసం'లో రకరకాల వ్యాసాలు రాసే అవకాశం కలిగింది. వీటన్నిటినీ కలిపి 'ఎందరో మహానుభావులు' అనే మకుటంతో ఓ పుస్తకంగా వేస్తే.... అనే ఆలోచన ఈ మధ్యనే వచ్చింది. లెక్క చూసుకుంటే 41... మరొక తొమ్మిది వ్యాసాలు ఎలాగోలా వీలుచిక్కించుకుని రాయగలిగితే 50 అవుతాయి. చెప్పుకుందికి బావుంటుంది. అందుకే మళ్లీ మొదలుపెడుతున్నాను.

సరే...ఈ ఆలోచనతో పాటే మరో ఆలోచన...

'హాసం'లో నా వ్యాసాలు వచ్చిన తర్వాత ఎందరెందరో ఉత్తరాలు రాసేవారు. ఫోన్లు చేసేవారు, వ్యక్తిగతంగా కలిసేవారు. "మేం మీరు రాసిన ఫలానా వారి బంధువులమండీ... మా దగ్గర వారికి సంబంధించినవీ ఎన్నో ఉన్నాయండీ" అంటూ చెప్పేవారు. ప్రాణం ఉసూరుమనేది. అవి కూడా ఉంటే ఇంకా బాగా రాసేవాణ్ణి కదా అనిపించేది.

అందుకే 'హాసం'లో ఇప్పటివరకూ నేను రాసిన మహానుభావుల పేర్లు ఈ దిగువున ఇస్తున్నాను. వీరికి సంబంధించిన వివరాలు, ఫోటోలు, ఏవి దొరికితే అవి పంపించండి. పుస్తకంలో కలుపుకుంటాను. పంపిన వారిని జీవితాంతం మరిచిపోలేను. పుస్తకంలో పేరుపేరునా కృతజ్ఞతలు తెలుపుకుంటాను. అలాగే నేను రాయబోయే మిగిలిన 9 మంది మహానుభావుల పేర్లు కూడా ఆయా వ్యాసాలు ప్రింట్ అయ్యాక చూసి పంపించండి.

నేను ఇప్పటి వరకూ రాసిన మహానుభావుల పేర్లివి.

తుమరాడ సంగమేశ్వర శాస్త్రి, పట్రాయని సీతారామశాస్త్రి, కోలంక వెంకటరాజు, గుమ్మలూరి వెంకట శాస్త్రి, దూర్వాసుల సోమయాజులు, మునిపల్లె సుబ్రహ్మణ్యకవి, ఆదిభట్ల నారాయణదాసు, విశ్వపతి శాస్త్రి, హనుమద్దాసు, సారంగపాణి, వీణవెంకట రమణదాసు, గరికపర్తి కోటయ్యదేవర, బొబ్బిలి కేశవయ్య, మద్దిరాల వెంకట రాయకవి, దుడ్డు సీతారామయ్య, మనుసారి వెంకట లక్ష్మమ్మ, వాసా అప్పయ్య, పిరాట్ల శంకరశాస్త్రి, దాసు శ్రీరాములు, విద్యల నారాయణ స్వామి నాయుడు, కాళహస్తి వీరయ్య, పాటల రామన్న, వెంకట సామయ్య, పప్పు వెంకన్న, ద్వారం వెంకట స్వామి నాయుడు, మహేంద్రవాడ బాపన్న శాస్త్రి, పారుపల్లి రామక్రిష్ణయ్య పంతులు, కామసముద్రం అప్పలాచార్యులు, శ్రీశ్రీశ్రీ ఆనందగజపతి మహారాజా, త్యాగరాజు, పొడుగు రామమూర్తి, షేక్ చినమౌలా, యానం రామకృష్ణ, కొచ్చెర్లకోట రామరాజు, తూము నరసింహదాసు, వారణాసి రామసుబ్బయ్య, హరి నాగభూషణం, పలుకూరి వెంకట రమణ, నందిగానం వెంకన్న, వీణకుప్పయ్య, స్వాతి తిరుణాళ్.


మీరు వివరాలను
పంపవలసిన చిరునామా:

**తనికెళ్ల భరణి,**
కేరాఫ్ హాసం,
502, శ్రీ బాలాజీ నిలయం,
మోతీనగర్,
బాలాజీస్వర్ణపురి కాలనీ,
హైదరాబాద్-500 018




నన్నింతవరకూ
ప్రోత్సహించినట్టే
లభించిన వివరాలను పంపి
ఆశీర్వదిస్తారు కదూ..

మీ
**తనికెళ్ల భరణి**

